అపరాధ పరిశోధన అనుబంధం—29

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వజ్రాల వేట
రచన : సుజనశ్రీ

## తమాషా దొంగలు
రచన : ఏ. వీ. మోహన్రావ్

## రహస్యం కావాలి!
రచన : కురుమద్దాలి విజయలక్ష్మి

## కాటేసిన యవ్వనం
రచన : టెంపోరావ్

"ఖైదీ" సీరియల్ - 24 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—28
మే, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు



కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ; హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# వజ్రాల వేట

సుజనశ్రీ

బరువుగా అడుగులు వేసుకుంటూ ఆ వ్యక్తి గేటుని సమీపించాడు. గేటు అవతల పెద్ద కాటన్ మిల్ ఉంది. దాదాపు అయిదారు వందల మంది అందులో పని చేస్తుంటారు.

గేటు దగ్గరున్న గూర్ఖా అతడి కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. ఆగంతకుడు ఆరడుగుల ఎత్తున్నాడు. మాసిన గడ్డం, ఎర్రని కళ్ళూ, ఖాఖి ప్యాంటూ, మాసి మరకలైన బూడిదరంగు యూనిఫారం చొక్కాలో బికారిలా కనుపించాడు.

“ఏం?” గుర్రుగా అతడి వంక చూశాడు గూర్ఖా.

“సుబ్రమణ్యంతో పనుంది నా పేరు లక్ష్మణరావు!”

అన్నాడు ఆ వ్యక్తి గూర్ఖాతో.

"నువ్వేం దొరవా? ఇక్కడ కొచ్చేవాళ్ళంతా సుబ్రమణ్యం పేరే చెబుతారు, అంతకన్న తక్కువవాళ్ళను కలవటం తమ హోదాకు లోకువ అన్నట్టు! తీరా లోపలకు వదిల్తే, ఉద్యోగం కావాలంటారు! ఇక్కడేం ఖాళీల్లేవు, వెళ్ళు, వెళ్ళు!" గూర్ఖా దురుసుగా మాట్లాడాడు, గేటుకి తగిలించి ఉన్న 'నో వేకన్సీ' బోర్డు చూపిస్తూ.

"నేను ఉద్యోగానికి రాలేదు, నేనూ, ఈ మిల్ మేనేజింగ్ డైరెక్టర్ సుబ్రమణ్యం ఇద్దరమూ క్లాస్ మేట్స్ము. అతడ్ని చూసిపోవాలని వచ్చాను."

గూర్ఖా నమ్మలేనట్టుగా అతడి వంక ఎగాదిగా చూశాడు.

నల్లరంగు కారు వస్తూండడం చూసి, "ప్రక్కకు తప్పుకో! అయ్యగారొస్తున్నారు!" అంటూ గేటు బార్లా తెరిచాడు గూర్ఖా.

కారు గేట్లోకి వచ్చింది. గూర్ఖా సెల్యూట్ చేశాడు.

కుదుపుతో కారు ఆగిపోయింది. స్టీరింగ్ ముందు కూర్చున్న వ్యక్తి లక్ష్మణరావు వంక ఆశ్చర్యంగా చూశాడు.

"నమస్కారమండీ! నేను లక్ష్మణరావును. గుర్తున్నాననుకుంటాను. ఇంటర్మీడియెట్ లో మనం క్లాస్ మేట్స్ము. మీ దర్శనం చేసుకుందామని వచ్చాను." లక్ష్మణరావు కారులోకి వంగి చూస్తూ వినయంగా చెప్పాడు.

"అదే చూస్తున్నా! నువ్వు అవునా, కాదా అని అనుమానమేసింది! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు చూశాను నిన్ను! రా! రా!" అంటూ సుబ్రమణ్యం ప్రక్కకు జరిగి డోర్ని తెరిచాడు. పాత మిత్రుడ్ని ఆప్యాయంగా ఆహ్వానించాడు.

లక్ష్మణరావు కారెక్కాడు. మరికొద్ది క్షణాల్లో అతడు ఎయిర్‌కండిషన్డ్ రూమ్‌లో కూర్చుని డ్రింక్స్ సేవిస్తున్నాడు.

"మిమ్మల్ని కలుసుకోగలనో, లేనో అని భయపడుతూనే వచ్చాను సుబ్రమణ్యంగారూ!"

"అదేమిటోయ్? గారూ, గీరూ అంటూ! కాలేజిలో చదివే రోజుల్లోలాగ ఆప్యాయంగా సుబ్రమణ్యం అని పిలువు, మన పాత రోజుల్ని జ్ఞప్తికి తెస్తూ."

"మాలాంటి వాళ్ళకు అవన్నీ బ్రతికివున్న రోజులు. ఇప్పుడేం జీవించే ఉన్నా మృతుల క్రిందే లెక్క!" వేదాంతిలా పలికాడు లక్ష్మణరావు.

"అన్నట్టు, నీవిప్పుడేం చేస్తున్నావ్?" సుబ్రమణ్యం అడిగాడు.

"డబ్బుకోసరం వెతుకుతున్నాను."

సుబ్రమణ్యం పొట్ట చెక్కలయేలా నవ్వాడు. "మొత్తానికి పెద్ద విట్టే వేశావ్!" అంటూ మళ్ళీ మరోసారి నవ్వాడు. "నీవేకాదు, ఈ దేశంలో ముప్ఫయి ఆరు కోట్ల మందీ తెల్లవారి లేస్తే, డబ్బుకోసం వెదకడమే చేస్తున్నారు. మంచి జోక్ వేశావ్ లక్ష్మణా!" అంటూ తిరిగీ నవ్వాడు సుబ్రమణ్యం.

"అలాకాదుసార్! నాకిచ్చే డబ్బుకి వెయ్యిరెట్లు ప్రతిఫలం చూపగలననే ధైర్యంతోనే వచ్చాను. మీరు నాకీ విషయంలో సహాయపడగలరనే అనుకుంటాను."

"ఏ మాత్రం కావాలేమిటి?"

"కనీసం యాభైవేలు!"

"అబ్బా! ఎందుకంత డబ్బు?"

"మీలాంటి అత్యాధికారులకు యాభైవేలు ఒక లెక్క లోది కాదని నాకు తెలుసు. అందుకు ప్రతిగా మీకు కొన్ని లక్షలూ, కోట్లూ విలువ చేసే బుట్టెడు వజ్రాలు దొరుకు తాయి!"

"ఏమిటీ? వజ్రాలే? బుట్టెడా? ఎక్కడా? ఏమిటీ?" సుబ్రమణ్యాం ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి అడిగాడు.

"నేను ఓషియానోగ్రఫీలో పోస్టుగ్రాడ్యుయేట్‌ని. భూగోళ శాస్త్రాన్ని జాగ్రఫీ అంటారు. అలాగే సము ద్రాలూ, అవి ఉత్పన్నమయే విధానాలూ, చంద్రుడికీ సముద్రానికీ గల సంబంధం వీటన్నిటికీ సంబంధించినదే ఓషియానోగ్రఫీ. ఒకసారి నేను రీసెర్చి పనిమీదే సముద్ర ప్రయాణం చేస్తున్నాను. సముద్రం మీద పెనుతుఫాను రేగింది. ఓడ గమ్యం తప్పి ఎటో వెళ్ళింది.

"తుఫాను తగ్గేసరికి మేమందరం ఓడతోసహా సురక్షి తంగా నిలద్రొక్కుకోగలిగాం. అయితే తుఫానువల్ల మేం దోవ తప్పాం. అందుకని తిరిగీ వెనక్కు మళ్ళించాం ఓడని.

"మేం లక్షదీవులకు ఎనభైమైళ్ళ దూరంలో ఉన్నా మని, అక్కడక్కడా ఎదురవుతూన్న అతి చిన్న దీవుల వలన తెలుసుకోగలిగాం. ఆ దీవులు ఒక్కొక్కటి మైలూ, రెండు మైళ్ళూ వి స్తీర్ణం మాత్రమే ఉంటాయ్, మన వేపు నదుల మధ్యలో ఇసుక తిన్నెల్లాగ! చాలా దీవుల్లో సంచారమే లేదు!

"ఆ ప్రాంతాల్లో జల రాక్షసులు ఆక్టోపస్‌లు ఎక్కు వగా ఉంటాయట. అక్కడి దీవులు నిర్మానుష్యంగా ఉండటానికి అదికూడ ఒక కారణం. మేం అక్కడ

నుంచి ఏ ప్రమాదానికీ లోనుకాకుండా, బయట పడగలమా లేదా అని భయపడతున్నట్టుగానే, పెద్ద ఆక్టోపస్ మా ఓడని ఎదుర్కొంది.

"ఆక్టోపస్‌కి ఎనిమిది కాళ్ళుంటాయి. ఒక్కో కాలు ఏనుగు తొండం పరిమాణంలో ఉంటాయ్! మూడుకాళ్ళను ఓడలోకి జాపింది, అది నీళ్ళమీద తేలుతూ. ఓడలోని ప్రయాణీకులు హాహాకారాలు చేయసాగారు. ఓడ తాలూకు నావికులు గొడ్డళ్ళు పుచ్చుకొని దాని కాళ్ళను తెగనరికేస్తున్నారు. తెగిపోయిన కాలిని వెనక్కు లాక్కుంటూ, దానిస్థానే మరో కాలుని జాపుతోంది ఆక్టోపస్.

"అలా అరగంట యుద్ధం జరిగింది. మానవ మేధస్సుకీ, ధైర్యసాహసాలకూ పశుబలంగల ఆక్టోపస్‌కీ హోరాహోరీ పోరాటం జరిగాక, ఆక్టోపస్ ఓడిపోయి నీళ్ళలోకి జారుకుని, మునిగిపోయి, అదృశ్యమైపోయింది. అప్పటికి దాని కాళ్ళు అయిదు తెగిపోయాయి. తెగిపోయిన ఖండాలు డెక్ మీద అక్కడక్కడా పడి ఉన్నాయ్.

"నేను ఆసక్తితో దాని కాలిని పరీక్ష చేయసాగాను. అదేసమయంలో ఓడలో నాతోబాటే ప్రయాణిస్తున్న చైనా వ్యాపారస్థుడు చింగ్ చా గూడ నేనున్న చోటికి వచ్చాడు.

"ఆక్టోపస్ తొండాన్ని అటూ ఇటూ త్రిప్పిచూశాను. నా కళ్ళు జిగేల్‌మన్నాయి! తెగిపోయిన తొండానికి అతుక్కుని చిన్న వజ్రం ఎండలో మెరుస్తున్నది. అదేమిటో నేను గ్రహించే లోగానే చైనావాడు దాన్ని గభాల్న లాక్కున్నాడు.. వజ్రాన్ని తన జేబులో దాచేసుకుంటూ, "ఈ విషయం ఎక్కడన్నా బయటపెట్టావో, నీ ప్రాణాలు

దక్కవు!" అని నన్ను బెదిరించాడు. ఆ తర్వాత సముద్రం లోకి వంగి చూస్తూ నిలబడ్డాడు చాలాసేపు!

"జలరాక్షసి ఆక్టోపస్ శరీరానికి అంటుకుని వజ్రం రావటమేమిటా అని నేనూ తలబ్రద్దలు కొట్టుకుని ఆలోచించాను. ఎంతకీ నాకు ఆ మర్మమేమిటో అంతు చిక్కలేదు. ముత్యపు చిప్పలోంచి ముత్యాలూ, పగడాలూ పుట్టినట్టుగా ఆక్టోపస్‌లో వజ్రాలు ఉద్భవిస్తాయా? అది అసంభవం!

"అయితే ఆ విషయం ఆలోచించటానికి వీల్లేకుండా నాకు మరో బెడద వచ్చి పడింది. చైనావాడు నన్ను చంపటానికి ప్రయత్నాలు చేయసాగాడు. డెక్ మీద ఉన్నప్పుడు నన్ను సముద్రంలోకి త్రోయబోయాడు. ఇంకోసారి ఒంటరిగా చూసి పీక పిసకబోయాడు.

"వజ్రం గురించి ఎవరికీ చెప్పనన్నాను గదా! ఇంకా ఎందుకు నాపై కక్ష?" అని వాడ్ని నిలవేసి అడిగాను.

"నీవు అతి నిగూఢమైన రహస్యాన్ని చూశావ్! అది నీతోనే అంతమైపోవాలి!" అన్నాడు చైనావాడు.

"అదేమిటో చెప్పరాదూ? విని నిశ్చింతగా ఛస్తాను."

"మూడు సంవత్సరాల క్రితం చైనానుంచి సిలోన్‌కి ఒక వ్యాపార నౌక బయలుదేరింది. అందులో నిజానికి వ్యాపార సరుకుకన్న, బంగారమూ, వజ్రాలూ మొదలైనవి రవాణా అవుతున్నయ్. సిలోన్‌లో ఉగ్రవాదులు విప్లవాన్ని లేకెత్తించే ప్రయత్నంలో ఉన్నారు. వారికి సహాయంగా ధనం పంపిణీ అవుతోంది ఆ నౌకలో. అయితే ఆ ఓడ గమ్యాన్ని చేరలేదు. ఈ ఓడ రాకను నమ్ముకుని, సిలోన్‌లో తిరుగుబాటు లేవదీయటం, సిరిమావో ప్రధానమంత్రి ఆ ఉద్యమాన్ని అణచివేయటం జరిగిందనుకో! అది వేరే

విషయం! ఆ ఓడను సముద్రపు దొంగలు కొల్లగొట్టారని తెలిసింది. ఆ సమయంలో ఓడ కెప్టెన్ వజ్రాల మూటను, గోనె సంచీడు వజ్రాలను సముద్రంలో జారవిడిచాడట; ఎవరూ చూడకుండా, ఈ ఆపద గడిచాక తిరిగి తెచ్చుకో వచ్చని. అతడు తర్వాత ఆ ప్రదేశాన్ని కనుక్కోలేక పోయాడట, ఎంత వెదకినా! ఇప్పుడు ఈ ఆక్టోపస్ కి అతుక్కున్న వజ్రాన్ని చూస్తే, ఇక్కడే ఈ ప్రాంతాల్లోనే ఆ వజ్రాలు సాగర గర్భంలో దాగి ఉండాలని అర్థమౌతోంది. నేను మళ్ళీ తగిన సాధన సంపత్తితో ఈ ప్రాంతాలకు వచ్చి వాటిని దొరకపుచ్చుకుంటాను. ఈ విషయంలో నీవు నాకు ప్రత్యర్థిలా తోచావు. అందుకే నీవు బ్రతికి ఉండటం నాకు ఇష్టం లేదు'' అని ముగించాడు చైనా వాడు.

''అయ్యా! నా కంతటి శక్తిసామర్థ్యాలు లేవు! నేనో చిన్న రిసెర్చ్ చేస్తూన్న ప్రభుత్వోద్యోగిని మాత్రమే! సముద్రంమీద రిసెర్చ్ చేస్తున్నాను! ఈ విషయంలో మీకు ఏమాత్రం అడ్డు తగలను! నన్ను ప్రాణాలతో వదలండి!'' అని అర్థించాను.

చైనావాడికి నా మాటల్లో గురి కుదిరినట్టుంది. వాడు నా జోలికి రాలేదు తర్వాత! ఎందుకైనా మంచిదని, తర్వాత పోర్టులో ఓడ దిగేశాను, చెప్పాచెయ్యకుండా!''

లక్ష్మణరావు తన కథను ముగించాడు.

సుబ్రమణ్యం సిగరెట్ ని ఆర్పి ఏష్ ట్రేలో పడేశాడు.

''అయితే ఆ వజ్రాలు ఏ ప్రాంతంలో ఉందేదీ నీవు చాలా బాగా గుర్తుపెట్టుకున్నావన్నమాట!'' సిగరెట్ ని యాష్ ట్రేలో పడేస్తూ అడిగాడు సుబ్రమణ్యం.

"అవును! బాగా గుర్తుపెట్టుకున్నాను. ఈ పని చాలా కష్టసాధ్యమనీ, ఖర్చుతో కూడుకున్న పని అనీ నాకు తెలుసు. అందుకే నా బాల్యమిత్రుల్లో అధిక ధనవంతు డెవరా అని ఆలోచించిన మీదటే నీ దగ్గరకు వచ్చాను. ఇందులో ఇంకో అనర్థం కూడా వుంది. ఆ వజ్రాలను వెదికి, దొరకపుచ్చుకునేందుకు చాలా వ్యయమవుతుంది. అదృష్టం వుంటే వజ్రాలు దొరికితే కోటీశ్వరులమై పోతాము! మన రాత బాగుండక అవి దొరకలేదూ, యాభైవేలూ సముద్రం పాలు కావాల్సిందే! ఆ మాత్రం నష్టాన్ని లక్ష్యపెట్టనివాడే ఈ పనిలోకి దిగాలి. అంతటి శక్తిసామర్థ్యాలు నీకున్నా యనే నా అభిప్రాయం!"

సుబ్రమణ్యం మరో సిగరెట్ వెలిగించాడు. రెండు నిముషాలు చకచక దమ్ము లాగాడు.

"వీలైతే ఆ వజ్రాలు చైనావాడికి అందగూడదనే నా ఆశయం. త్వరలోనే వాడు మరో నౌకను కుదుర్చుకుని మందీ మార్బలంతో వస్తాడని నా అభిప్రాయం! వాడికన్న మనం ఎంత ముందుగా పోతే అంత మంచిది!"

"వాడు ఓడలో రావాలన్నా పది పదిహేను రోజులు పడుతుంది కదూ?"

"అవును! మనం ఈ లోపలే అక్కడికి చేరుకోవాల్సి వుంటుంది" లక్ష్మణరావు తలూపాడు.

సుబ్రమణ్యం మాట్లాడలేదు. నోట్లో సిగరెట్ పూర్తిగా కాలిపోయాక అన్నాడు. "బొంబేలో నా స్నేహితుడొక డున్నాడు. అతడికి రెండు నౌకలున్నాయి. ఫ్లయింగ్ బోట్ ఉంది!"

"ఫ్లయింగ్ బోటే? అంటే అది చూడడానికి విమానం

లాగే వుంటుంది కదూ? అది అటు గాలిలోనూ ఎగురగలదు, ఇటు నీళ్ళలోనూ తేలుతూ ప్రయాణించగలదు కదూ?''

''కరెక్ట్! అందులో వెళితే ఒక్క రోజులోనే చేరుకో వచ్చు!''

''అంటే మీరీ పథకానికి ఒప్పుకున్నట్లేగా?''

''అక్షరాలా అంతే! రేపు మనం బొంబేకు ప్రయాణ మవుదాం! ఇక పోతే మన అన్వేషణ విజయమంతమై, వజ్రాలు దొరికితే, మనం ఏ విధంగా వాటాలు పంచు కోవాలీ?'' సుబ్రమణ్యం తను వ్యాపారస్థుడ్ననిపించు కున్నాడు.

''నీ ఇష్టప్రకారమే! పోనీ, పెట్టుబడీ, సాధన సౌక ర్యాలూ నువ్వే సమకూరుస్తున్నావ్ గనుక మూడువంతులు నీవే తీసుకుని, నాకు నాలుగోవంతు వాటా ఇవ్వండి చాలు!''

''ఓకే! ఒప్పుకున్నాను ప్రియమైన నేస్తమా!'' అంటూ సుబ్రమణ్యం కుర్చీలోంచి లేచి, చేయి చాపి, లక్ష్మణ రావుతో కరచాలనం చేశాడు.

## 2

మర్నాడే సుబ్రమణ్యం తన కంపెనీ వ్యవహారాలు చూసుకుని ప్రయాణానికి సిద్ధమయ్యాడు. ఈ లోపలే అతడు ఫోన్‌లో మాట్లాడి బొంబేలోని ప్రసిద్ధ నౌకా వ్యాపారస్థుడివద్ద ఫ్లయింగ్ బోట్‌ని మాట్లాడుకున్నాడు.

అయితే ఫ్లయింగ్ బోట్ కొద్దిగా రిపేరులో వుండటం వలన బొంబేనుంచి వాళ్ళ ప్రయాణం కొంత ఆలస్యం అయేలా తోచింది.

''పోనీ ఒక పని చేస్తే బాగుంటుంది. ఈ లోపల మనం

వర్తమానం పంపిన చోటికి దాన్ని రమ్మంటే సరిపోతుంది!" అన్నాడు లక్ష్మణరావు.

"అదీ నిజమే! మనం ఇంకా ఇంకా ఆలస్యం చేస్తే, ఈ లోగా మన ప్రత్యర్థి చింగ్ చై మనకన్న ముందుగా అక్కడికి చేరగలడు. అన్నట్టు మనం వెళ్ళాల్సిన ఆ ద్వీపం పేరేమిటన్నావ్?"

"ఆ ద్వీపం చంద్రద్వీపం, మూన్ ఐలెండ్ కి ప్రక్కనే వుంటుంది. దాని పేరు ఏమిటంటే, దాని పేరు..."

"పోనీలే గుర్తులేకపోతే! దాన్ని మనం వజ్రాలదీవి అని ఉదహరిద్దాం! ఆ ప్రాంతాల్న మనకు సహాయంగా ఎవరైనా ఉన్నారా? అంటే గైడ్స్ గా గానీ, లేక మనకు వండిపెట్టడం ఇట్లాంటి పనులు చేసేందుకు!"

"లేకేం? చైనావాడి బాధపడలేక నేను చంద్రద్వీపం లోకి దిగేశాను నౌకలోంచి. ఆ ద్వీపంలో ఉన్న రోజుల్లో అక్కడి ఆటవికుల్లో కొందరితో స్నేహం చేసుకున్నాను. అందులో ఇద్దరు భార్యాభర్తలున్నారు. అతడి పేరు బటూవా! అతడి భార్య పేరు గుర్తులేదు కానీ, ఆ పేరుకి చంద్రముఖి అని అర్థం వస్తుంది. వాళ్ళిద్దరికీ లక్షదీవుల్లో తెలీని ప్రదేశం అంటూ లేదు. ఇద్దరూ గజ ఈతగాళ్ళు కూడా!"

"సరే అయితే రేపే మన ప్రయాణం! ఫ్లయింగ్ బోట్ సిద్ధమయాక చంద్రద్వీపానికి రమ్మని కబురు పెడతాను."

మర్నాడు ఒక స్టీమర్ లో బొంబాయినుంచి బయలు దేరారు, సుబ్రమణ్యం, లక్ష్మణరావులు చంద్ర ద్వీపానికి. వారితోపాటు ఇంకా సుబ్రమణ్యం ఆప్తమిత్రులు ఛటర్జీ, మురుగేశన్ లు కూడా ఉన్నారు. నలుగురూ చాలా ఉత్సాహంగా ఉన్నారు.

చంద్ర ద్వీపం ఒక్కటే ఆ చుట్టుపట్ల దీవుల్లోకెల్లా కొంచెం నాగరికతను సంతరించుకున్నది. ఆ దోవంటే వెళ్ళే నౌకలు అక్కడే లంగరు వేస్తుంటయ్, మంచినీళ్ళు నింపుకోవటానికి.

అందువల్ల ఆ ద్వీపంమీద నాలుగైదు బార్-కమ్-రెస్టారెంట్‌లు వెలిసినయ్. లక్ష్మణరావూ, అతడి మిత్రులూ చంద్ర ద్వీపం చేరుకుని ఒక రెస్టారెంట్‌లో దిగారు.

ఆ ద్వీపం మరొకందుకు గూడా ప్రసిద్ధి. ఆటవిక జాతుల్లోని యువకుల్ని ఓడ సరంగులకి దాస్యానికై అమ్మేస్తుంటారు. పదిహేను సంవత్సరాలు వచ్చాయంటే, ఆ యువకుడి తల్లిదండ్రులే వాడ్ని అమ్మకానికి చంద్ర ద్వీపానికి తీసుకవస్తారు. ఒక ఏడాది, రెండేళ్ళు అని గడువు నిర్ణయించుకుని, ఆ కుర్రవాడ్ని ఓడల్లో చాకిరీ చేసేందుకు అమ్మేసి, అందుకు ప్రతిఫలంగా పొగాకూ, సిగరెట్లూ, మద్యమూ ఇలాంటివి తీసుకుంటారు ఓడ సరంగునుంచి.

# 3

లక్ష్మణరావు అండ్ పార్టీ రెస్టారెంట్-కమ్-బార్‌లో కూర్చుని రమ్ సేవిస్తున్నారు. దూరంగా కనబడే సముద్ర తీరాన ఆటవికులు గుంపులుగుంపులుగా చేరి ఏదో చర్చించుకోవటాన్ని చూశారు. బేరర్‌ని పిలిచి "ఏమిటా కోలాహలం?" అని అడిగాడు లక్ష్మణరావు.

"రెండు రోజుల క్రితం చైనా వాడొకడు వచ్చాడు. వాడి ఓడలో పని చేయించుకునేందుకు బటూవా అనే యువకుడ్ని బలవంతంగా ఎత్తుకుపోయారట. వాడికోసం ఆటవికులు గలాభా చేస్తున్నారు" బేరర్ చెప్పాడు.

"అరె! బటూవానే ఎత్తుకుపోయారా? వాడుతేం దే క్షణం గూడా పని జరగదే ఎలాగ?" లక్ష్మణరావు కలవర పడ్డాడు.

"అలా కంగారు పడితే ఎలాగ? ఈ ప్రదేశాలకు వచ్చాక దేనికయినా సిధ్ధపడే వుండాలి. అయితే ముందు బటూవాని ఆ చింగ్ చా గాడి చేతుల్లోంచి రక్షించాలి మనం! అవునా?" సుబ్రమణ్యం నింపాదిగా అన్నాడు.

"అవును! అంతే!" మురుగేశన్ సమర్ధించాడు.

"మన ఫ్లయింగ్ బోట్ రాగానే, డేగలా ఆకాశంలో ఎగురుకుంటూ, ఆ చైనావాడి నౌకను వెదికి పట్టుకుందాం. ఆ తర్వాత బటూవా మన చేతిలోకి వచ్చినట్టే!" అన్నాడు ఛటర్జీ.

వాళ్ళ మాటల్ని వింటూ అక్కడే నిలబడిన బేరర్ పెదవి విరిచాడు. "అది చాలా కష్టం సార్! యముడి చేతిలోబడ్డ మనిషి తిరిగి బ్రతకవచ్చునేమోగానీ,చింగ్ చా చేతిలోబడ్డ మనిషి బ్రతికుండగా బయట పడలేదు" అన్నాడు.

బార్ లో కూర్చున్న మనుష్యులు పెద్దగా మాట్లాడుకుం న్నారు. చేపల మార్కెట్ లోకన్న అధ్వాన్నంగా వుంది అక్కడ జరిగే రణగొణ ధ్వని.

మరో నూతన వ్యక్తి బార్ లో అడుగుపెట్టాడు. అతడు కనుపించటంతోనే బార్ అంతా క్షణకాలం నిశ్శబ్దం అయిపోయింది.

సుబ్రమణ్యం ఈ హఠాత్పరిణామానికి కారణం ఏమిటా అని చుట్టూ చూశాడు.

బేరర్ కళ్ళతోటే సంజ్ఞ చేస్తూ "అతడే చైనా వ్యక్తి, చింగ్ చా!" అన్నాడు మెల్లగా.

తన రాకతో బార్‌లో కలిగిన మార్పుకు గర్విస్తూ ఠీవిగా నడుచుకుంటూ లోపలకు వచ్చాడు చింగ్ చా.

అటుప్రక్క, ఇటుప్రక్క వున్న టేబుల్స్ ముందరున్న వ్యక్తుల ముఖాల్లోకి గ్రుచ్చి చూస్తూ నడుస్తున్నాడు చింగ్ చా.

అతడు బేరర్ దగ్గరకు వచ్చి ఆగిపోయాడు. బేరర్‌ని నఖశిఖ పర్యంతం చూశాడు. బేరర్ ఆకులా వణికి పోయాడు.

"ఏరా పందివెధవా? నిన్న సాయంత్రం నా నాక చుట్టూ తిరుగాడుతున్నావ్! ఒళ్ళు కొవ్వెక్కిందా?"

"లే... లేదు సార్! నేను రానేలేదు స్సార్?" బేరర్ లబో దిబో మన్నాడు.

చింగ్ చా అందర్నీ ఆకర్షించేలా తన ప్రతాపాన్ని చూపించాలి. అందుకే బేరర్‌ని ఎన్నుకుని అతడితో కల్పించుకుని జగడం పెట్టుకున్నాడు.

"నాతోనే అబద్ధమాడతావురా!" అంటూ చింగ్ చా పిడికిలి బిగించి బేరర్ పొట్టలో గుద్దాడు.

బేరర్ బాధతో మెలికలు తిరిగాడు. బార్‌లో అందరూ ఊపిరిబట్టి చూస్తున్నారు. ఈ రోజు బేరర్ హరీ అనడం ఖాయం అనుకున్నారు. అంతేకానీ ఎవరికీ చింగ్ చాని ఆటంక పరచటానికి దమ్ములు లేకపోయాయి.

చింగ్ చా వికటంగా నవ్వుతూ మళ్ళీ మరో దెబ్బ కొట్ట టానికి ఉద్యుక్తుడయాడు.

కూర్చున్న చోటినుంచి లేచాడు సుబ్రమణ్యాం.

"ఏయ్! ఏమిటీ గోల! అతడు మాకు డ్రింక్స్ సర్వ్ చేయటానికి వచ్చాడు! మా ఆనందానికి నీ అంతరాయ

మేమిటి?" చింగ్ చౌ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ కర్క
శంగా అన్నాడు.

చింగ్ చౌ గుర్రుగా చూశాడు. "మిస్టర్! నీవు మాట్లాడ
కుండా కూర్చో!" ఆజ్ఞాపిస్తూ అన్నాడు.

"నీవు చెప్పినట్టు చేసేటందుకు, నీ క్రింద బానిసను
కాదు!"

తనతో ఇంత ధైర్యంగా ఎదురు పలికే నూతన వ్యక్తిని
చూసి చింగ్ చే ఒక్క క్షణం తెల్లబోయాడు.

"ఏయ్! నే నెవర్లో తెలుసా?" అన్నాడు చింగ్ చౌ
మళ్ళీ.

"తెలియకేం బాగా తెలుసు! నీ వెవరివో, ఇక్కడకు
ఎందుకొచ్చావో బాగా తెలుసు! నీ పేరు చింగ్ చౌ ఈ
దీవులన్నీ నీ బాబు సంపాదించినట్టుగా అహంభావంతో
ఉంటావని గూడ తెలుసు!" సుబ్రమణ్యం కోపంగా
చూశాడు.

"అంతే కాదు! నా తడాఖా గూడా తెలుసుకో
బాగా!" అంటూ చింగ్ చౌ చేయిని కోటు జేబులోకి
పోనిచ్చాడు. మరుక్షణంలో తళతళలాడే కత్తి బయటకు
వచ్చింది.

సుబ్రమణ్యం టేబుల్ మీదున్న గ్లాసుని అందు
కున్నాడు. అందులోని ఐస్ వాటర్ ని చింగ్ చౌ ముఖంమీద
కుమ్మరించాడు. చింగ్ చౌ కళ్ళు గట్టిగా మూసుకుని, రెండో
చేతిని ముఖానికి అడ్డం పెట్టుకున్నాడు.

అతడు మళ్ళీ కళ్ళు తెరిచేలోపలే సుబ్రమణ్యం అతడి
డొక్కలో బలంగా గుద్దాడు. చింగ్ చౌ బ్యాలెన్స్ తప్పి
వెనక్కి వాలిపోయాడు. పడిపోతూ దాపునే వున్న
టేబుల్ ను గట్టిగా పట్టుకున్నాడు. కానీ అతడి బరువుకి

టేబిల్ తిరగబడింది. దానిమీదున్న పాత్రలు ఒరిగిపోయి చింగ్ చౌ మీదకు కారినయ్.

"అహా! ఎంత నైస్‌గా కొట్టావ్!" ఎవరో సుబ్రమణ్యాన్ని మెచ్చుకున్నారు.

మరికొందరు పెద్దగా నవ్వారు. అక్కడున్న వారందరికీ చింగ్ చౌ ఎంత క్రూరుడో బాగా తెలుసు. అయినా అందరూ అతడికి భయపడి వూరుకున్నారు. ఈనాటికి చింగ్ చౌకి బుద్ధి చెప్పగలిగిన వ్యక్తి తారసపడ్డందుకు అక్కడున్నవారంతా ఆనందిస్తున్నారు.

చింగ్ చౌ చేతిలోంచి పడిపోయిన కత్తిని అందుకున్నాడు సుబ్రమణ్యం.

"ఉపయోగించటం చేతకానివాళ్ళ దగ్గర ఇలాంటి కత్తులు వుండగూడదు. అది తెలుసుకో!" అంటూ కత్తిని మడిచి, చింగ్ చౌ కోటు జేబులో జారవిడిచాడు.

చింగ్ చౌ ముఖం తుడుచుకుంటూ, తూలుతూ లేచాడు. అతడి కళ్ళు కోపంతో ఎర్రబడినయ్. ఆ చూపుల్లో ద్వేషం నిండి వుంది.

ఒక్క క్షణం సుబ్రమణ్యాంను క్రూరంగా చూసి, చింగ్ చౌ పెద్ద పెద్ద అంగలేసుకుంటూ అక్కడ్నుంచి బయటకు వెళ్ళిపోయాడు.

## 4

బార్‌లోంచి తమ రూమ్‌కేసి వస్తూండగా లక్ష్మణరావు అన్నాడు: "ఆ దుర్మార్గుడితో మనం కయ్యం పెట్టుకోకుండా వుండాల్సింది. ఇక అడుగడుగున మనకూ వాడికీ పోరాటమే."

"ఏడిశాడు. మనతో పోటీకి వాడు చాలడని ఇదో

హెచ్చరిక వాడికి!'' సుబ్రమణ్యం గర్వంగా అన్నాడు.

మరునాడుదయానికి ఫ్లయింగ్ బోట్ వచ్చి చేరింది అక్కడకు.

అప్పటికే చింగ్ చౌ నౌక ప్రయాణమై పోయింది. తనకు అవమానం జరిగిన రాత్రే అతడు లంగరెత్తేసి వెళ్ళి పోయాడు.

ఫ్లయింగ్ బోట్ లో లక్ష్మణరావు, సుబ్రమణ్యం, చటర్జీ మురుగేషన్ లు బయలుదేరారు.

మూడు గంటలు ఆకాశ మార్గాన ప్రయాణించాక, ఓ చిన్న ద్వీపం కనుపించింది వారికి.

''అదే వజ్రాల దీవి. ఈ దీవినుంచి ఉత్తర దిశగా ఎనిమిది మైళ్ళు సముద్రంలో పోతే, వజ్రాలున్న ప్రాంతం వస్తుంది'' లక్ష్మణరావు చెప్పాడు.

క్రమేపీ ఫ్లయింగ్ బోట్ దీవికి చేరువ కాసాగింది. ఆ దీవి చంద్రద్వీపంకంటే ఇంకా చిన్నది. తీరాన కొబ్బరి ఆకులతో కప్పబడిన పాకలు అర్ధవృత్తాకారంలో ఉన్నయ్. దీవి మధ్యలో కొబ్బరి తోటల మధ్య ఇంకా గుడిసెలు ఉన్నయ్.

''మన ఫ్లయింగ్ బోట్ ని ఇక్కడ నీళ్ళమీదకు దించండి. ఈ ప్రాంతంలో సముద్రంలో కొండరాళ్ళేవీ ఉండవు. కనుక మనం ఇక్కడే లంగరు వేయచ్చు.''

ఫ్లయింగ్ బోట్ ఒకసారి దీవినంతా చుట్టి వచ్చింది.

''ఆహా! భూతల స్వర్గంలా ఉంది'' అని అక్కడి వాతావరణాన్ని మెచ్చుకున్నాడు చటర్జీ.

ఫ్లయింగ్ బోట్ నీళ్ళ మీదకు దిగింది నెమ్మదిగా. అప్పటికే ఆటవికులు పోగయారు తీరంలో. వింతగా చూస్తున్నారు ఫ్లయింగ్ బోట్ కేసి.

"ఈ ప్రాంతాల్లోకి విమానాలు రాలేదల్లె వుంది. వింతగా చూస్తున్నారు మనకేసి" మురుగేశన్ అన్నాడు.

లక్ష్మణరావు వాళ్ళకేసి చెయ్యి ఊపుతూ ఏదో అరిచాడు ఆటవిక భాషలో.

ఆటవికులు అతడ్ని గుర్తించారు. నవ్వుతూ చేతులు ఊపుతూ కేరింతలు కొట్టసాగారు.

మరికొందరు పడవలేసుకుని ఫ్లయింగ్ బోటు దగ్గరకు వచ్చేశారు. ఫ్లయింగ్ బోటుకి లంగరు వేసి, లక్ష్మణరావు పడవలోకి మారాడు. తమ వెంట తెచ్చిన లగేజీలోంచి సిగరెట్ ప్యాకెట్లు తీసి ఆటవికులకందరకూ పంచాడు. వాళ్ళ ఆనందానికి అంతు లేదు.

ఆ రాత్రి గుడిసెల మధ్య ప్రదేశంలో నెగళ్ళు మంట వేశారు. వాటి చుట్టూ ఆటవికులు ఆడా మగా నృత్యం చేస్తూ, అతిధులకు వేడుక చేశారు. ఆ తర్వాత విందు జరిగింది.

"లక్ష్మణా! మొత్తానికి ఈ ఆటవికుల్నుంచి మంచి స్నేహాన్నే సంపాదించావ్! నిన్నో మహానాయకుడి క్రింద చూస్తున్నారు" అంటూ నవ్వాడు సుబ్రమణ్యం.

లక్ష్మణరావు ఏదో చెప్పబోయాడు. కానీ అంతలోనే మరో ఆటవికుడు అక్కడికి పరుగెత్తుకు వచ్చాడు. రొప్పుతూ, రోజుతూ, వాళ్ళ భాషలో ఆటవికుల నాయకుడికి ఏదో చెప్పాడు. నాయకుడు ఆత్రుతగా కళ్ళు పెద్దవి చేసుకుని వింటున్నాడు.

లక్ష్మణరావు నాయకుడి వంక చూశాడు. "ఏం జరిగింది? ఏమిటి అతడు చెప్పేది?" అని అడిగాడు.

"చింగ్ చా నౌక లంగరు వేసిందట ఈ దీవి ఒడ్డునే" నాయకుడు నింపాదిగా చెప్పాడు.

తింటున్న భోజనం వదిలేసి లేచాడు సుబ్రమణ్యాం. "పదండి! వాడి అంతు తేల్చి 'బటూవా'ని విడిపిద్దాం" అన్నాడు ఆవేశంగా.

"అది అంత తేలిక పని కాదు. తీరం వెంబడే పోతే పది మైళ్ళన్నా పోవాలి!"

"అది చుట్టూ తిరిగి వెళ్ళే త్రోవ. అంతకన్నా, దీవి మధ్యగా అడ్డం పడిపోతే పోలా!"

"ఆ పని చాలా కష్టం. దారి సరిగా లేదు సరిగదా, పొదలూ, గుట్టలూ అడ్డం ఉన్నయ్. పైగా తోడేళ్ళ బెడద ఒకటి! అలా అడ్డం పడిపోతే, ప్రాణాలతో చెల గాట మాడడమే సుమా!" నాయకుడు అభ్యంతరం చెప్పాడు.

"రాత్రిపూట ఆ దోవంట పోవడం మంచిది కాదంటున్నారు గదా? పోనీ తెల్లారాక బయలుదేరిపోదాం!" మురుగేశన్ తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

"అదేం కుదరదు. మనం ఇప్పుడే పోదాం! రాత్రిపూట అయితే, ఈ దీవుల్లో నరసంచారం ఉండదని, చింగ్‌చా నిశ్చింతగా, అప్రమత్తతతో ఉంటాడు. అలాంటప్పుడే, వాడిపై అకస్మాత్తుగా మెరుపుదాడి చేసి, బటూవాని విడిపించుకోగలం."

లక్ష్మణరావు, మురుగేశన్, చటర్జీ వీరి కెవరికీ కూడా సుబ్రమణ్యాం అభిప్రాయం నచ్చలేదు. కానీ ఆ క్షణంలో సుబ్రమణ్యాంలోని ఆవేశం, ఉద్వేగం చూస్తూంటే అతడు ఎవర్నీ లక్ష్యపెట్టేవాడిలా కనుపించలేదు.

చింగ్‌చా మీద మెరుపు దాడి చేసేందుకు సమాయత్తమైనారు. ఆటవికుల్ని పదిమందిని సాయం తీసుకున్నారు. ఆ పదిమంది దగ్గర విషంలో ముంచిపెట్టిన బాణాలూ,

కత్తులూ ఉన్నయ్. శత్రువు శరీరంలోకి దిగబడంగానే రక్తం తడిసి ఎండిపోయిన విషం ద్రవంగా మారుతుంది. ఆ మనిషి క్షణాల్లోనే నీలం రంగులోకి మారిపోయి, పరలోకం చేరుకుంటాడు.

చంద్రముఖి గూడా ప్రయాణమైంది వారితో. సుబ్రమణ్యం అభ్యంతరం చెప్పాడు.

తన భర్తను ఎప్పుడెప్పుడు చూస్తానా అని ఆమె ఆత్రంగా ఉంది. ఆమె ఆడదైనా ఎంతో నేర్పుగలది, సామర్థ్యం గలది. ఆమె మనవెంట ఉన్నందువల్ల ఇబ్బంది ఏం ఉండదు. పైపెచ్చు ఉపయోగం కూడా!" ఆటవికుల నాయకుడూ లక్ష్మణరావూ ఇద్దరూ వక్కాణించారు.

ఆ విషయం సుబ్రమణ్యానికి నచ్చలేదు. అయినా ఈ చిన్న విషయంమీద వాదోపవాదాలు పెట్టుకుని, తర్జనభర్జనలు చేస్తూ, కాలయాపన చేయటం ఇష్టంలేక, చంద్రముఖిని గూడ తమతో రావడానికి అనుమతించాడు.

నిర్మలాకాశంలో చంద్రుడు మందగొడిగా ప్రయాణిస్తున్నాడు. పిండారబోసినట్లు వెన్నెల విరగగాస్తున్నది. రెల్లు దుబ్బులూ, పొదలూ, గుట్టలూ, పల్లపు ప్రదేశాల్ని ఎక్కుతూ దిగుతూ ముందుకు పోతున్నారు. కొంతమంది ఆటవికులు ముందు దోవతీస్తుంటే, మరికొందరు వెనుక అండగా నడుస్తున్నారు. వారందరి చేతుల్లో కాగడాలున్నయ్, అవసరమైనప్పుడు వెలిగించటానికి సిద్ధంగా.

ఆ దారి ప్రతి అంగుళమూ తెలిసినదానిలా, చంద్రముఖి అందరికన్నా ముందు చకచకా నడుస్తోంది.

## 5

ముందు చకచకా లేడిలా గెంతుతున్న చంద్రముఖి హఠాత్తుగా ఆగిపోయింది.

"ఏమిటి?" అంటూ ముందుకు చూశాడు సుబ్రమణ్యం. దూరాన ఏదో ఆకారాలు కదులుతున్నయ్.

"తోడేళ్ళ మంద!" అన్నాడు మరో ఆటవికుడు.

అప్పటికే అవి మనుష్యుల వాసన పసిగట్టినట్టున్నయ్, గుండెలవిసేలా వికృతంగా అరుస్తూ పరుగెత్తుకొస్తున్నయ్.

ఎన్నడూ ఇలాంటి హఠాత్పరిణామానికి అలవాటుపడి ఎరగని పట్టణవాసులు ఛటర్జీ మురుగేశన్‌లు వాటిని చూస్తూనే, తమకు ఆయువు తీరిపోయింది అనుకున్నారు.

ఆటవికులు దివిటీల్ని వెలిగించారు. వలయాకారంలో దివిటీలు పట్టుకుని నిలబడ్డారు. మిగతావాళ్ళు వలయం లోపల ఆగారు. కొందరు ఆటవికులు చేరువలోకి వచ్చిన తోడేళ్ళ మీదికి బల్లేల్ని విసిరారు.

దీనంగా అరుస్తూ కొన్ని తోడేళ్ళు చచ్చాయి. మిగతావి చచ్చిన తోడేళ్ళ మీదబడి పీక్కు తినసాగాయి.

"ఇక అవి మన జోలికి రావు కాస్సేపటిదాకా! ఈ లోపల మనం తప్పుకుని వెళ్ళిపోవాలి!" అంటూ ఆటవికులు, తోడేళ్ళను తప్పించి దారితీశారు.

మరో అరగంట ప్రయాణించాక అందరూ ద్వీపం ఆవలితీరానికి చేరారు. మరోవేపుగా ఆటవికుల ముఠా తీరంమీద మంటలు వేసుకూర్చుని వినోదిస్తున్నారు. సముద్రంలో చింగ్‌చా నౌక లంగరువేసి ఉంది.

"వాళ్ళంతా చింగ్‌చా మనుష్యులే! కానీ వాళ్ళలో చింగ్‌చా లేడు. వాడు నౌకలోనే మిగిలిపోయి వుంటాడు" అంది చంద్రముఖి, పరిశీలనగా చూశాక.

"మరీ మంచిది. నౌకను ఆవలివైపుగా మనం దాడి చేద్దాం!" అన్నాడు సుబ్రమణ్యం.

తీరాన ఇసుకలో నిలవేసిన బోటుని నీళ్ళలోకి త్రోశారు. లక్ష్మణరావు అండ్ పార్టీ అందరూ అందులోకి ఎక్కారు. తెడ్లువేసి బోటుని నడిపితే చప్పుడవుతుందని, ఆటవికులు కొందరు నీళ్ళలో ఈదుతూ, బోటుని ముందుకు తోస్తున్నారు.

నౌక డెక్ మీద ఎవరో ఆటవికుడు కునికిపాట్లు పడుతున్నాడు. అతడి చేతిలోనూ బల్లెం ఉంది.

త్రాటినిచ్చెన జారుతోంది డెక్ మీదనుంచి. చడీ చప్పుడు లేకుండా అందరూ పైకి ఎక్కారు.

ఆటవికుడొకడు డెక్ మీద కాపలావాడ్ని వెనుకనుంచి కంఠం చుట్టూ తన చేయివేసి గట్టిగా అదిమిపట్టాడు. వాడు కిక్కురుమనకుండా చచ్చి ఊరుకున్నాడు.

సుబ్రమణ్యం ఆటోమేటిక్.ని చేతిలో ఉంచుకుని కేబిన్ వైపు నడిచాడు. కెప్టెన్ గది తలుపు వారగా వేసి వుంది.

దఢాలున తలుపునెట్టి, లోపలకు జొరబడ్డాడు సుబ్రమణ్యం సుడిగాలిలాగ. చటర్జీ, మురుగేశన్లు అతడ్ని అనుసరించారు. వాళ్ళ అందరి చేతుల్లోనూ రివాల్వర్సున్నయ్.

చింగ్ చా తన గదిలో ఆటవిక యువతితో సుఖిస్తున్నాడు ఆ సమయంలో.

సుబ్రమణ్యాన్ని చూస్తూనే అతడి పైప్రాణాలు పైనే పోయినయ్.

"నువ్వా? నాకన్న త్వరగా ఎలా రాగలిగావ్?" అన్నాడు ఆశ్చర్యంతో, భయంతో నోరు వెళ్ళబెడుతూ, చింగ్ చా.

"నీ పరామర్శలు తర్వాత! ముందు బటూవాని అప్పగించు మర్యాదగా!"

"ఓ! మీ రేనన్నమాట ఫ్లయింగ్ బోటులో వచ్చింది. ఆకాశంలో ఎగురుతూ, పక్షిలాంటి కొత్తయంత్రం నీళ్ళ మీదకు దిగిందని ఆటవికులు చెప్పార్లే!"

చింగ్ చౌ ధోరణి చూస్తుంటే అతడేదో కపటోపాయం పన్నుతున్నాడని గ్రహించాడు సుబ్రమణ్యం. ఇలా మాట మార్చి, కాలయాపన చేస్తే, ఈ లోపల తీరం మీదినుంచి అతగాడి మనుషులు తిరిగి రావచ్చేమో!

"లక్ష్మణా! ఈ వెధవని నేను కనిపెట్టి ఉంటాను! నీవూ, చంద్రముఖీ వెళ్ళి, బటూవా ఎక్కడ బందీగా ఉన్నాడో వెదకి పట్టుకోండి త్వరగా" అని పురమాయించాడు సుబ్రమణ్యం.

కేబిన్‌లో గదులన్నీ ఖాళీగానే ఉన్నయ్. చివరి గది మాత్రం తలుపు మూసి ఉంది.

చంద్రముఖి అక్కడ నుంచుని పెద్దగా పిలిచింది. లోపల్నుంచి బదులుగా మరో కేక వినిపించింది. ఆమె ముఖం వికసించింది.

"ఇందులోనే ఉన్నాడు తలుపు తెరవటం ఎలా?" అంటూ చంద్రముఖి లక్ష్మణరావు ముఖంలోకి చూసింది.

లక్ష్మణరావు తన శరీరాన్ని కుంచించుకుని, ఒక్క ఉదుటున వెళ్ళి తలుపుని ఢీకొన్నాడు. తలుపు గడియ విరిగిపోయింది. తలుపు తెరుచుకుంది. లోపల బటూవా కాళ్ళూ చేతులు బంధింపబడి ఉన్నాడు.

చంద్రముఖి చాకుతో అతడి బంధనాల్ని తెగగోసింది.

బటూవాని వెంటబెట్టుకుని తిరిగీ అందరూ బోటులోకి దిగారు. బోటు నీళ్ళలో ప్రయాణం సాగించింది. చింగ్ చౌ డెక్ మీదకు పరుగెత్తుకు వచ్చాడు. పెద్దగా ఏదో అరిచాడు.

ఆ అరుపుకు తీరంమీద మంటలచుట్టూ ఎగురుతున్న ముఠా "ఓహోం! ఓహోం!" అని అరుచుకుంటూ మరో తెప్పలోకి ఎక్కారు. తెప్పను వేగంగా పోనివ్వసాగారు.

బటూవాని తీసుకుపోతున్న బోటువంక చూపుతూ చింగ్ చౌ మళ్ళీ అరిచాడు. అతడి ముఠా తెప్ప గమ్యాన్ని మార్చారు. బటూవా బోటు వెంటబడ్డారు.

"ఏమిటా వెధవ అనేది?" బటూవా వంక చూస్తూ అడిగాడు సుబ్రమణ్యం.

"మన బోటుని ఢీకొట్టి, ముంచేయమని చెబుతున్నాడు!" అంటూ బటూవా చింగ్ చౌ అరుపుకు అర్థం చెప్పాడు.

అంతలోనే చంద్రముఖి బోటులోంచి నీళ్ళలోకి దూకింది. బుడుంగున మునిగిపోయింది. అంతకంతకూ దగ్గరవుతున్న చింగ్ చౌ ముఠా తెప్పదగ్గర తేలింది.

తెప్ప అంచుని పట్టుకుని వ్రేలాడుతూ, తన బలాన్నంతా ఉపయోగించి, తెప్పను గుంజింది. ఆ బరువుకు తెప్ప పూర్తిగా ప్రక్కకు ఒరిగిపోయింది. తెప్పలో ఉన్న వాళ్ళంతా, గట్టుమీదినుంచి చెరువులోకి దూకే కప్పల్లాగ, సముద్రంలో పడిపోయారు.

పెద్దగా నవ్వుకుంటూ చంద్రముఖి మళ్ళీ తమ బోటుని చేరుకుంది.

"ఎంత చాకచక్యంగా వాళ్ళను బోల్తా కొట్టించింది!" అంటూ చంద్రముఖిని మెచ్చుకున్నాడు సుబ్రమణ్యం.

"నేను చెప్పలేదూ, చంద్రముఖి ఎంతో ఉపయోగకారి అనీ" అన్నాడు లక్ష్మణరావు. ఈ లోపల బోటు తీరం చేరుకున్నది.

డెక్ మీదనుంచి చింగ్ చౌ తమ ముఠా వాళ్ళని తిట్టిపోస్తున్నాడు పెద్దగా.

## 6

తాము అనుకున్న దానికన్న తేలికగా, త్వరగా బటూవాని విడిపించుకు రావటం పెద్ద ఘనవిజయంగా భావించి, అందరూ సంతోషించారు; చంద్రముఖి ఆనందానికి అవధి లేదు. బటూవాని విడిపించినందుకు ఆమె చూపుల్లోనే కృతజ్ఞతను వెల్లడిస్తోంది.

"ఈ ప్రథమ విజయానికే మనం సంబరపడి, మైమరచి పోరాదు. తెల్లవారకుండానే మనం ఇక్కడ్నుంచి ప్రయాణమైపోవాలి. వెలుగువస్తే చింగ్ చౌ మళ్ళీ ఏదో అఘాయిత్యం తలపెడతాడు," అన్నాడు సుబ్రమణ్యం.

చింగ్ చౌ పేరు వింటూనే అందరూ హడలిపోయారు. ఆ దుర్మార్గుడి చేతికి అందుబాటులో ఉండటం ఎవరికీ ఇష్టంలేదు. అందుకే ద్వీపంలోంచి, తమకు కావలసిన అవసర సామగ్రిని ఫ్లయింగ్ బోటులోకి చేర్చారు ఆ క్షణం లోనే. తెల్లవారవస్తుండగా ఫ్లయింగ్ బోటు గాలిలోకి లేచింది.

ఛటర్జీ, మురుగేశన్‌లు ఫ్లయింగ్ బోటుని నడుపుతున్నారు. బటూవా వాళ్ళదగ్గరే ఉండి, మార్గం చెబుతున్నాడు.

లక్ష్మణరావు డైవింగ్ సూట్‌ని సరిచేసుకుంటున్నాడు లోపల.

పూర్తిగా తెల్లవారింది.

నిర్మలమైన నీలాకాశాన్ని ప్రతిబింబింప జేస్తున్నదా అన్నట్టుగా ఆకుపచ్చని కాంతిని వెదజల్లుతోంది సముద్రం. స్ఫటికంలా స్వచ్ఛంగా కనబడుతున్న నీటిలో రంగు రంగుల చేపలు తిరుగాడుతున్నయ్. ఫ్లయింగ్ బోట్ మరో చిన్న నిర్మానుష్యమైన దీవిని దాటింది.

ఆ దీవి తీరానికి దగ్గరగా ఆకుపచ్చని నాచు గుట్టలు గుట్టలుగా పెరిగి, నీళ్ళమీద తేలియాడుతున్నయ్, మంచు కొండల్లాగ. ఆ గుట్టలు నానా రకాలుగా ఉన్నయ్. కొన్ని విసనకర్రలా విస్తరించి ఉన్నయ్. మరికొన్ని స్తూపాల్లా, ఇంకా కొన్ని పిరమిడ్ల ఆకారంలోనూ ఉన్నయ్.

ఫ్లయింగ్ బోటులోంచి చూస్తుంటే, తాము దిగిన వజ్రాలదీవి పూర్తిగా కనుపిస్తోంది. కొబ్బరిచెట్లు మినహా ఆ దీవిలో మరో వృక్షంలేదు, రెల్లూ, దుబ్బులూ తప్పించి.

బటూవా సూచనపై ఫ్లయింగ్ బోట్ నీళ్ళమీదకు దిగింది.

లక్ష్మణరావు కంపాస్‌ని, దిక్సూచిని ముందు పెట్టుకుని ఏవేవో లెక్కలు వేస్తున్నాడు.

మరి పదినిముషాలు గడిచేసరికి అందరూ లక్ష్మణరావు చుట్టూ చేరారు. లక్ష్మణరావు సముద్రంలోకి డైవింగ్ చేసే పని ఎంత సాహసంతో కూడుకున్నదో, ఎంతటి ప్రమాదకరమైనదో వివరిస్తున్నాడు.

"నిజానికి ప్రపంచంలో ఇంతకన్న ప్రమాదకరమైన పని మరోటి లేదంటే నమ్మండి! ఇన్స్యూరెన్సు కంపెనీలు గూడ డైవింగ్ చేసేవాళ్ళ జీవితాల్ని భీమా చేసుకోవు. సముద్రపు అగాధాల్లో ఏ ప్రమాదం మనకోసం పొంచి వుంటుందో ఊహించలేం! షార్కులే ఉండచ్చు, ఆక్టోపస్‌లే చుట్టుముట్టవచ్చు. ఎలక్ట్రిక్ చేపలు వెంటపడవచ్చు! అన్నిటికన్నా ప్రమాదభరితమైనవి ఆ వెధవ ఆక్టోపస్‌లే! ఎనిమిది కాళ్ళతో మనిషిని చుట్టివేస్తయ్. మృత్యువు కౌగిలిలోంచి అయినా బయటపడవచ్చునేమో

కానీ, ఆక్టోపస్ చేతుల్లోకి నడిచినవాడు తప్పించుకోలేడు. అగాధంలోకి దూకినవాడికి సాయంగా మరో వ్యక్తి ఏదైనా గొడ్డలిలాంటి ఆయుధంతో దాని కాళ్ళు వరుసగా తెగనరికితే, ఆ వ్యక్తి బయట పడగలడేమో!

"నేను అగాధపు అంచుల్లో ఆక్టోపస్ వాతబడితే, దాన్ని ఎలా ఎదుర్కోవాలో బటూవాకి, చంద్రముఖికి బాగా తెలుసు. నేరుగా దానిమీదనే, నీళ్ళల్లోకి దూకి కత్తులతో, ఆక్టోపస్ కాళ్ళు తెగనరుకుతారు. అందుకే వాళ్ళు మనతో తప్పకుండా ఉండి తీరాలని పట్టుబట్టింది" లక్ష్మణరావు మళ్ళీ ధైర్య వచనాలు పలికాడు.

చంద్రముఖి, బటూవాల వంకకు తిరిగి, ఆటవిక భాషలో వాళ్ళకు ఏవో సూచనలిచ్చాడు లక్ష్మణరావు. వాళ్ళు సరేనని తలలూపారు.

"నాకు కట్టి ఉన్న త్రాటిని రెండుసార్లు గుంజితే, నన్ను పైకి లాగమని అర్థం. అలా కాక నాలుగుసార్లు లాగితే, అగాధంలో నేనేదో ప్రమాదంలో ఇరుక్కున్నానని అర్థం. అప్పుడు మీరు అతి జరూరుగా నన్ను పైకి లాగేయాలి. తెలిసిందా?" ఛటర్జీ, మురుగేశన్‌లకు సూచనలిచ్చాడు, లక్ష్మణరావు.

అందరూ సాయంపట్టి డైవింగ్ సూట్ తొడిగారు లక్ష్మణరావుకి. తలకు మాస్క్ తగిలించారు. మాస్క్ ముఖానికి అద్దంలోంచి అతడి చిరునవ్వు కనిపిస్తున్నది.

లక్ష్మణరావు నడుముకు బలమైన సన్నని త్రాడు కట్టారు. ఆక్సిజన్‌ని సరఫరా చేసేందుకు మరో సన్నని త్రాటిగొట్టం అమర్చబడింది. అతడి బూటుకాళ్ళకు సీసపు దిమ్మలున్నాయ్, అతడు నీళ్ళలో దిగేందుకు బరువుగా.

లక్ష్మణరావు త్రాటినిచ్చెన మీదకు దిగాడు. అందరూ అతడివంకే ఆత్రుతగా చూస్తున్నారు, ఊపిరి పీల్చడం కూడ మరచిపోయి.

సుబ్రమణ్యం సిగ్నల్ ఇవ్వంగానే, అతడు నీళ్ళలోకి జారి అదృశ్యమైపోయాడు. ఫ్లయింగ్ బోటులో కుప్పగా వేసి ఉన్న త్రాటినీ, టెలిఫోన్ కేబుల్‌లాగ చుట్టచుట్టి ఉన్న సన్నని వైర్‌ట్యూబ్‌నీ లోపలకు జారవిడుస్తున్నారు ఛటర్జీ, మురుగేశన్‌లు.

బటూవా, చంద్రముఖీ, ఇద్దరూ వంగి చూస్తున్నారు నీళ్ళల్లోకి అదేపనిగా.

పదినిముషాలు గడిచాయి. జారవిడుస్తున్న త్రాడు క్రిందికి పోలేదు. దాన్నిబట్టే లక్ష్మణరావు సముద్రం అట్టడుగుకు జేరుకున్నాడని తెలుసుకున్నారు ఫ్లయింగ్ బోటులోని వ్యక్తులు.

అరగంట గడిచింది. లక్ష్మణరావుకు కట్టివున్న త్రాడు బాగా ప్రక్కకు మళ్ళింది. అతడు సముద్రంలో తను దిగిన చోటునుంచి, చాలదూరం తిరుగాడినట్టుగా గ్రహించాడు సుబ్రమణ్యం.

ఫ్లయింగ్ బోటులో వ్యక్తులు ఏ హఠాత్పరిణామాని కైనా ఎదుర్కొనేటందుకు సిద్ధంగా ఉన్నారు.

నీళ్ళలోకి జారిన త్రాడుని రెండుసార్లు లాగబడటం గుర్తించాడు ఛటర్జీ.

వెంటనే త్రాడుని చుట్టేసుకునే మర హ్యాండిల్‌ని త్రిప్పసాగాడు. క్రమేపీ లక్ష్మణరావు నీళ్ళమీదకు తేలాడు. ఫ్లయింగ్‌బోట్ త్రాటి నిచ్చెనమీదే నిలబడి పోయాడు.

# 7

"అదేం అక్కడే ఆగిపోయావ్! లోపలకు రా!" అన్నాడు ఛటర్జీ.

"నేను లోపలకు రావటం లేదు. ఒక్కనిముషం రెస్టు తీసుకుని పోదామని వచ్చాను అంతే!"

"ఎలా ఉంది నీళ్ళ అడుగున?" మురుగేశన్ కుతూహలంగా అడిగాడు.

"అద్భుతంగా ఉంటుంది. అదో రంగుల వింతప్రపంచం అనుకో. వివిధరకాల నాచూ, వృక్షజాతులూ, రంగు రంగుల చేపలూ. ఓహ్! చెప్పటానికి మాటలు చాలవనుకో! కానీ నేను దిగినచోట అంతా గుట్టలూ, మెరకాపల్లాలూ ఉన్నయ్. ఏదో చిన్న కొండగూడ ఉన్నట్టుగా ఉంది దాపుల్నే. నేను లోపల దాదాపు అరమైలు వైశాల్యం అంతా గాలించాను. వజ్రాల మూట దొరకలేదు. ఇంకా దక్షిణంగా, కొండవైపు వెళ్ళివస్తాను ఈసారి!" లక్ష్మణ రావు ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు.

అతడికి తన ప్రాణాలమీదకన్నా, వజ్రాల మూట మీదే ఎక్కువ మక్కువలాగుంది, అనుకున్నాడు మురుగేశన్ మనసులో.

సముద్రం ప్రశాంతంగానే ఉంది. అదృష్టం బాగుండి తుఫాను సూచనలేం లేవు, అనుకున్నాడు లక్ష్మణరావు మళ్ళీ నీళ్ళల్లో మునిగిపోతూ.

అందరూ ఫ్లయింగ్ బోటులోంచి నీళ్ళమీదకు వంగి చూస్తున్నారు.

అరగంట గడిచింది. నీళ్ళ అడుగున ఉన్న లక్ష్మణరావు నుంచి ఎటువంటి సంకేతమూ లేదు. క్షణక్షణం జరిగేకొద్దీ, పైనుంచి చూస్తున్నవారిలో ఆతృత ఎక్కువౌతోంది.

మరో పావుగంట గడిచింది. "ఏమిటబ్బా! అతగాడి నుంచి ఏ సంకేతమూ రాలేదే?" మురుగేశన్ తన ఆదుర్దాను వెళ్ళబెట్టాడు.

చంద్రముఖి త్రాటినిచ్చెన మీదకు దిగింది. ఆఖరి మెట్టు మీద నిలబడి, నీళ్ళమీదకు వంగి పరీక్షగా చూసింది.

ఎటువంటి చిమ్మచీకటిలో అయినా పిల్లి స్పష్టంగా చూడగలదు. అలాగే ఈ ఆటవికులు సముద్రం దగ్గర పుట్టి పెరిగిన వారవటంవల్ల, వాళ్ళు పైనుంచే చూసి, నీళ్ళ అడుగున ఏం జరిగేది చెప్పగలరు.

చంద్రముఖి ముభావంగానూ, అదేపనిగా నీళ్ళలోకి చూడటం సుబ్రమణ్యానికి అనుమానాన్ని రేకెత్తించింది.

చూస్తూండగానే చంద్రముఖి తన బొడ్లో దాచుకున్న కత్తిని లాగి పళ్ళమధ్య ఇరికించుకుంది. ఆ తర్వాత దఢాలున నీళ్ళలోకి దూకింది.

కొద్ది నిముషాల్లోనే ఆమె మళ్ళీ పైకి తేలింది.

"ఆక్టోపస్ అతడ్ని చుట్టేసింది. పెద్ద రాక్షసి, చాలా పెద్దరాక్షసి." అంటూ అరిచింది నీళ్ళమీదకు తేలి.

అందరూ దిగ్భ్రాంతి చెందారు. ఇప్పుడేమిటి చేయటం అని కంగారు పడుతున్నారు.

చంద్రముఖి బటూవాతో ఏదో చెప్పింది వాళ్ళ భాషలో. బటూవా పదునైన గొడ్డలి అందుకుని నీళ్ళలోకి దూకేశాడు. అతడి వెనుకే చంద్రముఖి గూడా దూకేసింది.

మళ్ళీ నిస్తబ్దత. ఫ్లయింగ్ బోటులో ఉన్నవాళ్ళు ఆదుర్దాతో చిందులు త్రొక్కుతున్నారు.

"అంతగా ఏదైనా ప్రమాదం వచ్చిన పక్షంలో ఎమర్జన్సీ సిగ్నల్‌ని ఇస్తానని చెప్పివెళ్ళిన వ్యక్తి, గబగబ

నాలుగుసార్లు త్రాటిని లాగితే పొయ్యేదికదా?'' మురు
గేశన్ బాధగా పలికాడు.

"అలా అనకు! కనీసం త్రాడులాగేందుకైనా వ్యవధి లేకుండా, ఆ జలరాక్షసితో పోరాడుతున్నాడేమో! లేక లాగే అవకాశమైనా లేకుండా, అతడి చేతుల్ని గూడ బంధించిందేమో!'' ఛటర్జీ సమర్థించాడు లక్ష్మణరావుని.

అంతలో త్రాడు నాలుగుసార్లు గుంజబడింది.

"త్వరగా! త్రాడుని మరకు చుట్టి, వాడ్ని పైకి లాగండి!'' అంటూ అరిచాడు సుబ్రమణ్యం.

త్రాడుని చుట్టుకునే చక్రం హాండిల్స్‌ని పట్టుకుని త్రిప్పసాగారు ఛటర్జీ, మురుగేశన్‌లు.

హ్యాండిల్ రెండు చుట్లు తిరిగిపోయింది. ససేమిరా ముందుకు తిరగలేదు, ఎంతగా బలం ప్రయోగించినా.

"ఆ రాకాసి జంతువు వాడ్ని గట్టిగా పెనవేసుకుని ఉంటుందంది! అందుకే త్రాడు పైకి రావటం లేదు,'' అన్నాడు సుబ్రమణ్యం.

అతడుగూడ ఇంకో చెయ్యివేసి, ముగ్గురూ హ్యాండిల్ త్రిప్పటానికి యత్నించారు. భయంతో, ఆత్రుతతో వారి ముఖాల్ని స్వేదబిందువులు నిండినా యన్నమాటే గానీ, హ్యాండిల్ మటుకు తిరగనని మొరాయించింది.

సుబ్రమణ్యం ఒక్క క్షణం ఆలోచించాడు. తమ పశు బలం పనికి రాలేదు లక్ష్మణరావుని పైకి లాగేందుకు. యంత్ర బలాన్ని ఉపయోగించి, అతడ్ని ఉన్నచోటు నుంచి కదలిస్తే, ఆ తర్వాత పైకి లాగవచ్చు తేలికగా అనుకున్నాడు.

మరుక్షణంలో సుబ్రమణ్యం పైలట్ సీట్లో కెళ్ళి కూర్చున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేశాడు. ఫ్లయింగ్ బోట్ ముందుకు

కదిలింది. త్రాడు తెగిపోకుండా, ఉండేందుకు అక్కడి కక్కడే గాలిలో పైకిలేచి వలయాకారంలో తిరగ సాగింది ఫ్లయింగ్ బోట్.

నీళ్ళమీద తెల్లగా నురుగు రాసాగింది. ఆ తర్వాత నీళ్ళు పొంగుతున్నట్టుగా బుడబుడ పైకి వచ్చినయ్. వెను వెంటనే చిన్న ఏనుగు పరిమాణంలో ఉన్న జలరాక్షసి ఆక్టోపస్ నీళ్ళమీద తేలింది.

ఆక్టోపస్ ఎనిమిది కాళ్ళలో ఆరు తెగిపోయాయి. ఏనుగు తొండం సైజులో ఉన్న ఆరుకాళ్ళు ఖండఖండా లుగా నీళ్ళమీద తేలుతున్నాయ్.

మిగతా రెండు కాళ్ళలో, ఒక కాలితో లక్ష్మణరావును చుట్టుముట్టి పెనవేసుకుంది. ఒకే ఒక కాలితో పోరాడు తోంది ఆక్టోపస్.

బటూవా తన చేతిలోని పదునైన గొడ్డలితో దాని కాళ్ళను తెగనరుకుతున్నాడు. మరో ప్రక్క చంద్రముఖి తన బాకుతో ఆక్టోపస్‌ని అందినచోటల్లా పొడిచేస్తున్నది.

ఛటర్జీ,మురుగేశన్‌లు చకచకా హ్యాండిల్‌ని త్రిప్పుతూ, త్రాటిని పైకి లాక్కుంటున్నారు, ఈ భీభత్సాన్ని చూడలేం అన్నట్టుగా.

సుబ్రమణ్యం తన రివాల్వర్‌ని తీసి, సినిమా హాలు గేటు మీద రెండువైపులా వెలిగే ఎర్రని దీపాలలా మెరుస్తూన్న ఆక్టోపస్ కళ్ళమీదకు షూట్ చేశాడు, రివాల్వర్ ఖాళీ అయిపోయేదాకా.

జీవం కోల్పోయిన ఆక్టోపస్, నీళ్ళమీద తేలుతోంది. చంద్రముఖి, బటూవా ఇద్దరూ చెరొక చేత్తో లక్ష్మణ రావుని లాక్కొచ్చారు. ఫ్లయింగ్ బోటులో ఎక్కించి, లోపల పడేశారు.

# 8

లక్ష్మణరావు స్పృహలో లేడు. సుబ్రమణ్యం ముందుగా అతడి మాస్క్ వదులుచేసి, తర్వాత డైవింగ్ సూట్‌ని ఊడదీశాడు.

మాస్క్ లోపల అంతా రక్తసిక్తం అయింది.

"అయ్యో! అతగాడు చచ్చిపోయాడల్లే ఉంది!" అని అరిచాడు మురుగేశన్.

ఛటర్జీ కప్‌బోర్డులోంచి బ్రాందీసీసా తెచ్చాడు. రెండుమూడు చుక్కల్ని లక్ష్మణరావు పెదవుల్ని విడదీసి, నోట్లోకి జారవిడిచాడు.

ఫ్లయింగ్ బోటు తీరం వేపుగా వెళ్ళి లంగరు వేసింది.

ఎండ వేడిమిలో, ఇసుకలో పడుకోబెట్టారు లక్ష్మణరావుని. మురుగేశన్ అతడికి యాంటీబయోటిక్ ఇంజెక్షనిచ్చాడు. లక్ష్మణరావుకి భుజంమీదా, చేతులకూ గాయాలయాయి. వాటిని శుభ్రంచేసి మందేసి, బ్యాండేజీ కట్టారు.

లక్ష్మణరావు కళ్ళు తెరిచాడు. "సుబ్రమణ్యం! వజ్రాలు దొరికాయి!" అని అరిచాడు.

అందరూ విభ్రాంతి చెందారు. లక్ష్మణరావుకి తప్పకుండా మతి చలించిందనే అనుకున్నారు. అందుకే సుబ్రమణ్యం ఉలుకూ, పలుకూ లేకుండా చూస్తూండిపోయాడు.

"వజ్రాల సంగతి తర్వాత ఆలోచిద్దాం! ముందు నీ ప్రాణాలు జేరుకునేదాకా విశ్రాంతి తీసుకో!" సుబ్రమణ్యం కసిరాడు.

"నాకింకేం ప్రమాదం లేదు. మన శ్రమ ఫలించింది. వజ్రాల ఆచూకీ తెలిసింది" అన్నాడు లక్ష్మణరావు.

అందరూ అతడివంక నమ్మలేనట్టుగా చూశారు.

లక్ష్మణరావు కళ్ళు పెద్దవిచేసి అందరివంకా మరోసారి వెర్రిగా చూశాడు.

"నా మాటల్లో మీకు నమ్మకం లేనట్టుంది. వజ్రాలు జేబులోనే ఉన్నయ్. కావాలంటే చూపిస్తాను" అంటూ ప్రక్కకు కదలబోయాడు, లక్ష్మణరావు.

"అమ్మా!" అంటూ బాధతో మూలిగాడు. కుడి భుజానికీ, కుడి చేతికి బ్యాండేజీలు కట్టబడి ఉన్నయ్.

"ఛటర్జీ! నా చేయి కదలనివ్వటం లేదు. నీవన్నా నా జేబులో చెయ్యిపెట్టి వజ్రాల్ని లాగు!" అన్నాడు.

ఛటర్జీ యాంత్రికంగా అతడి జేబులో చెయ్యిపోనిచ్చి, మళ్ళీ బయటకు లాగాడు.

అతడి అరచేతిలో రెండు తెల్లని వజ్రాలు ఎండకు మెరిసిపోతూ కనుపించినయ్.

"సరిగా వజ్రాల్ని దొరకబుచ్చుకునే సమయంలోనే, సైంధవుడిలా ఆ రాక్షసి వచ్చి మీద పడింది. జలరాక్షసు లైన ఆక్టోపస్‌ల గురించి నాకు చాలా తెలిసి వచ్చింది అనుభవపూర్వకంగా. సముద్రంలో అట్టడుగున అయితే, అవి నాలుగుకాళ్ళతో దేన్నో కరుచుకుని ఉంటయ్ గట్టిగా. మిగతా కాళ్ళతో అందిన వాటిని పట్టుకుని, నోటిదగ్గరకు చేర్చుకుని స్వాహా చేసేస్తాయి.

"ఈ ఆక్టోపస్ గూడ అలాగే చేసింది. అది నన్ను చుట్టేసింది తన కాళ్ళతో. ఆ సమయంలో నేను రెండు చేతులూ పైకెత్తి హాండ్సప్ పొజిషన్‌లో నిలబడ్డాను. ఎందుకంటే నా చేతుల్నిగూడ అది చుట్టేసిందంటే, ఇక నాకు దానితో పోరాడే అవకాశమూ ఉండదు, ఇటు త్రాడు లాగేటందుకైనా వీలుండదు.

"దానితో నేను పెనుగులాడుతూండగా, బటూవా, చంద్రముఖి ఇద్దరూ వచ్చి కలిశారు. ముగ్గురం కలిసి దాని నాలుగుకాళ్ళు తెగ్గొట్టాం. దాంతో ఆక్టోపస్ తన పట్టు వదిలేసి, మిగతా కాళ్ళతో ఎదుర్కోవడానికి సిద్ధమైంది.

"అప్పుడే మీరు లాగటంవలన క్రమేపీ, ఆక్టోపస్‌తో గూడా పైకి తేలగలిగాం. నీళ్ళమీదికి వచ్చేసరికి మరో రెండు కాళ్ళను తెగగొట్టగలిగాము. అయినా అప్పటికీ అది నన్ను వదలనే లేదు. ఆ తర్వాత కథ మీకు తెలిసిందే!" అంటూ గొప్పగా నిదానంగా తన అనుభవాన్ని వర్ణించి చెప్పాడు లక్ష్మణరావు.

"వజ్రాల సంగతి దేముడెరుగు! తక్షణం ఇక్కడ్నుంచి వెళ్ళిపోదాం పదండి!" భయంతో పలికాడు ఛటర్జీ.

అందుకు లక్ష్మణరావు అభ్యంతరం చెప్పాడు.

"అప్పుడే ఏమయింది. డైవింగ్ చేసేవాడి జీవితంలో మీరు చూసింది ఒకే ఒకరోజు దినచర్య" అంటూ వేదాంతిలా నవ్వాడు.

"అంటే? అంటే మళ్ళీ నీవు సముద్రం అట్టడుగుకి దిగుతానంటావా? ఏం?" అని ఉరిమాడు మురుగేశన్.

"ఇటు సూర్యుడు అటు పొడిచినాసరే, నా ప్రయత్నం మానను. పైగా ఇప్పుడే ఆ పనికి ఇంకా అనువైన సమయం. అంత పెద్ద ఆక్టోపస్ ఉన్నచోట ప్రమాదకారులయిన ఏ ఇతర ప్రాణీ ఉండదు జీవించి. రక్కసి ఆక్టోపస్‌ని మనమే చంపేశాం కనుక, ఇక అక్కడ నిర్భయంగా, మనకు కావలసినంతసేపు సముద్రం అట్టడుగున విహరించవచ్చు."

"అంతే నంటావా?" సందిగ్ధంగా చూశాడు సుబ్రమణ్యం.

"ఇంక మరేమిటి? కంటబడ్డ వజ్రాలను, కోట్ల రూపాయలు విలువచేసే వజ్రాలను చాతకానివాడిలా వదిలేసి రమ్మంటావా?"

అతడి పట్టుదల చూశాక సుబ్రమణ్యం మరేమీ మాట్లాడలేదు.

## 9

ఆ రోజుకు అంతా అక్కడే, ఆ నిర్మానుష్యమైన దీవిలోనే మకాం వేశారు. సీలు చేయబడిన డబ్బాల్లో తెచ్చుకున్న ఆహారాన్ని తిన్నారు.

"సమయానికి పులిమీద పుట్రలా, నా అదృష్టం పాలిటి శనిలా, ఆ రాక్షసి జంతువు మీదపడింది. లేకపోతే ఈ పాటికి వజ్రాలనన్నిటినీ ఏరుకొచ్చి, తిరుగు ప్రయాణ మయ్యే వాళ్ళం!" లక్ష్మణరావు మాటిమాటికీ, తన జేబు లోంచి రెండు వజ్రాలను తీసి చూసుకుంటూ, విచార పడుతున్నాడు.

ఆ రాత్రి అక్కడే నిర్మించుకున్న టార్పాలిన్ టెంట్‌లో, పెద్దగా కంబళ్ళు కప్పుకుని సుఖనిద్ర పోయారు అందరూ. బటూవా మాత్రం మెలకువతో ఉన్నాడు కాపలాగా.

మర్నాడే మళ్ళీ వజ్రాల వేటకై బయలుదేరారు. ఎవ రెంత అభ్యంతరం చెప్పినా లక్ష్మణరావు వినలేదు.

"ఇప్పుడీ ప్రయత్నం విరమించామంటే మళ్ళీ వజ్రాలు విడువబడిన ప్రదేశాన్ని కనుక్కోవటం కష్టమవుతుంది. అయినా నా ప్రాణం గురించి మీ కెందుకు బాధ!" అన్నాడు పైగా.

లక్ష్మణరావు మళ్ళీ డైవింగ్ సూట్ వేసుకున్నాడు. యథాప్రకారం సముద్రపు అగాథంలోకి జారిపోయాడు.

ఒక గంట గడిచింది. అందరూ నీళ్ళమీదకు వంగి చూస్తున్నారు.

త్రాడు రెండుసార్లు లాగబడడం చూసి, మురుగేశన్ హ్యాండిల్ని త్రిప్పసాగాడు. త్రాడు మరకు చుట్టుకుంటోంది. అయితే, ఈసారి గూడ త్రాటిచివర ఏదో బరువుగా ఉన్నట్టు తోచింది అతడికి.

"కొంపదీసి మనవాడ్ని మరో ఆక్టోపస్ పట్టుకోలేదు కదా? దాని బరువుకి త్రాడు బలంగా లాగాల్సివస్తోంది!" మురుగేశన్ తన అనుమానాన్ని వెలిబుచ్చాడు.

"మరేం ఫర్వాలేదు. సముద్రాలమీద తిరిగేటప్పుడు లక్ష్మణరావు చాల జాగ్రత్తగా ఉంటాడు. నావికు లుపయోగించే సిగ్నల్స్ గురించి అతడికి క్షుణ్ణంగా తెలుసు" అన్నాడు సుబ్రమణ్యం.

లక్ష్మణరావు నీళ్ళపైకి తేలాడు. అతడి చేతిలో పెద్ద మూట ఉంది. అతడు సముద్రంలోకి దిగేటప్పుడు ఖాళీ వాటర్ప్రూఫ్ బ్యాగ్ని పట్టుకెళ్ళాడు. వజ్రాలు దాని సగానికి నిండాయి.

"సుబ్రమణ్యంగారూ! ఇదుగో నే చెప్పిన బుట్టెడు వజ్రాలమూట. నా వాగ్దానాన్ని నేను నిలబెట్టుకున్నాను. ఇదంతా మీ చలవే సుమా! మీరుచేసిన సహాయాన్ని జన్మలో మరిచిపోను" లక్ష్మణరావు ఆనందానికి అవధుల్లేవు.

"అలా అనకు లక్ష్మణరావు. స్నేహితుడుగా నీకు సహాయం చేయటం నా విధి. అందుకే పెద్దలంటారు, బంధుత్వం కన్న మిత్రత్వమే మిన్న అని. ఈ నిధి అంతా నాది కాదు! మనది! ఏమంటారు?" అంటూ అందరి ముఖాలవంకా చూశాడు సుబ్రమణ్యం.

ఛటర్జీ, మురుగేశన్‌లకు సంతోషంతో నోటమాటే పెగలటం లేదు.

వజ్రాల మూటను చూస్తూనే చంద్రముఖి "ఓ!" అని కీచుగా అరచింది.

"ఏమయింది?" అనడిగాడు లక్ష్మణరావు.

"ఈ రాళ్ళకోసమేనా మీరింత తెగించింది. వీటికోస మేనా శ్రమపడి ఇంతదూరం వచ్చారు?" అంది చంద్ర ముఖి, విస్తుపోతూ.

ఆమె అమాయకత్వానికి ఏడ్వాలో, నవ్వాలో అర్థం కాలేదు మిగతా వాళ్ళకు.

అంతలోనే అందరి దృష్టినీ ఆకట్టుకునే సంఘటన సంభవించింది.

ఫ్లయింగ్ బోటు ఉన్న చోటునుంచీ మైలుదూరంలో సముద్రం మీద నీళ్ళు పైకి ధారగా లేస్తున్నయ్.

"అమ్మయ్యో! షార్క్ వస్తున్నట్టుగా ఉంది!" లక్ష్మణ రావు అరిచాడు.

"అదృష్టం కదూ? నీవు నీటి అడుగున ఉండగా వచ్చి ఉంటే. నిన్ను మళ్ళీ ప్రాణాలతో చూసి ఉండేవాళ్ళం గాదు!" మురుగేశన్ బదులు పలికాడు.

"త్వరగా! ఇంజన్ను స్టార్ట్ చెయ్యండి. ఫ్లయింగ్ బోట్‌ని షార్క్ కందకుండా నడపండి" లక్ష్మణరావు, సుబ్రమణ్యాం వేపు చూస్తూ అన్నాడు.

సుబ్రమణ్యాం డ్రైవింగ్ వీల్ దగ్గరకి వెళ్ళిపడ్డాడు, ఒక్క గంతులో.

షార్క్ వస్తూన్న వేపు ఎదురు దిశనుండి మరో జల రాక్షసి వస్తూ కనుపించింది. అదీ మరో రకమైన చేప!

అదిగూడ షార్క్ పరిమాణంలో ఉంది. అయితే దాని ముక్కుకు పొడవాటి అంపం ఉంది.

"సందేహంలేదు. దాన్ని 'సా ఫిష్' అంపపు చేప అని పిలుస్తారు" అంది చంద్రముఖి.

జలరాక్షసులు రెండూ తలపడినై నీటిమట్టానికి పైనే. అంపపు చేప దెబ్బకు షార్క్ శరీరంలో గాయాలయినై. ఆ గాయాలనుంచి రక్తం స్రవించి నీళ్ళమీద తేలుతోంది.

"ఆ చేపకున్న అంపం ఎంతటి పదునైనదంటే, అది నౌక అడుగుభాగాన తన అంపంతో కోసి, రంధ్రం చేయ గలదు" బటూవా అన్నాడు నెమ్మదిగా.

పెద్ద శబ్దం చేసుకుంటూ ఇంజన్ స్టార్ట్ అయింది. ఫ్లయింగ్ బోట్ నీళ్ళమీద ప్రయాణం చేయసాగింది.

ఈ కొత్త శబ్దానికి షార్క్, అంపపు చేప ఒక్కక్షణం ఊరుకున్నయ్. ఆ తర్వాత షార్క్ నీళ్ళల్లో మునిగి మాయ మయిపోయింది.

అంపపు చేప మాత్రం ఫ్లయింగ్ బోట్ వెంటబడింది. బోట్ కి దగ్గరగా వచ్చి నీళ్ళల్లో మునిగిపోయింది.

"మన బోట్ చేస్తూన్న శబ్దానికి అది హడలెత్తి పోయింది. అందుకే అది నీళ్ళల్లోకి జారుకుంది!" అన్నాడు మురుగేశన్ సంతోషంగా.

"అయ్యో! బోట్ ని గాలిలోకి లేపండి! అంపపు చేప బోటు అడుగు భాగానికి చేరుకుంటుంది!" బటూవా అరిచాడు.

అతడి మాట పూర్తి అయీ, అవకముందే, ఫ్లయింగ్ బోటు అడుగు భాగంలోంచి పొడుచుకుని పైకి వచ్చింది అంపపు చేపయొక్క అంపం.

భయంతో కీచుగా అరిచాడు మురుగేశన్.

అంపపు చేప తన అంపాన్ని వెనక్కి లాక్కుంది. అది చేసిన రంధ్రంలోంచి సముద్రపు నీళ్ళు ఫ్లయింగ్ బోటులోకి వచ్చేస్తున్నయ్.

అంతలో ఫ్లయింగ్ బోట్ రొద చేస్తూ గాలిలోకి లేచింది.

అంపపు చేప అంపం నీళ్ళమీద తేలింది. తన కోపాన్ని వ్యక్తం చేయటానికి అక్కడ ఫ్లయింగ్ బోటు లేదు. నీళ్ళను అల్లకల్లోలం చేసుకుంటూ అంపపు చేప నీళ్ళల్లో మునిగిపోయింది.

## 10

అరగంట ప్రయాణించాక, ఫ్లయింగ్ బోట్ నిర్మానుష్య దీవి - వజ్రాల దీవికి చేరుకుంది. తీరంలో ఫ్లయింగ్ బోటు లంగరు వేసింది.

తమకు దొరికిన నిధితో దీవిలోకి చేరారు మిత్రబృందం.

"సుబ్రమణ్యంగారూ! ఈ వజ్రాలు నాకు దొరుకుతాయనే నమ్మకం లేదు మొదటినుంచీ. ఎందుకనంటే నాది ఒక దరిద్రపు జాతకం. బంగారం పట్టుకున్నా మట్టి అవుతుంది. అందుకే నా పథకం సఫలం కావటానికి మిమ్మల్ని ఎన్నిక చేసుకున్నాను. బిజినెస్‌లో మీది అదృష్టవంతమైన జాతకం అని గ్రహించాను. మట్టిగూడ మీ చేతిలో బంగారంగా మారుతుంది. కనుకనే భయంకర జలరాక్షసులు ఆక్టోపస్, షార్క్, సాఫిష్ లాంటి వాటి వాతబడకుండా వజ్రాల్ని చేజిక్కించుకుని మరీ బయటపడ గలిగాను" లక్ష్మణరావు ఆవేశంతో చెప్పుకుపోతున్నాడు.

సుబ్రమణ్యం ఆనందానికి అంతులేదు. తను ఊహించిన దానికన్న ఎక్కువగానే వజ్రాలు దొరికినయ్. ఈ దెబ్బతో

తను కోటీశ్వరుడు, కాదు, కాదు, మిలియనీర్ అయిపో తాడు.

"అవునూ! మనం వచ్చిన పని అయిపోయింది గదా! ఇక నేరుగా స్వదేశానికి చెక్కేయగూడదూ?" ఛటర్జి అడిగాడు.

"అలా వీలుకాదు. ఫ్లయింగ్ బోట్ కి అవసరమైన ఫ్యూయల్ లేదు. అందుకోసం మనం చంద్ర ద్వీపానికి పోవలసి ఉంటుంది. పైగా అంపపు చేపవల్ల కలిగిన రంధ్రం మూలంగా, మనం ఎంతోదూరం ప్రయాణించలేం! కనుక ముందుగా ఆ రంధ్రానికి రిపేర్ చేయించాలి, రెండోది ఇండియా చేరుకునేందుకు అవసరమైన ఫ్యూయల్ కావాలి!" మురుగేశన్ బదులు పల్కాడు.

"అవును! అది అన్నింటికన్న ముఖ్యం. అయితే ఈ వజ్రాల మూటతో మనం చంద్ర ద్వీపానికి పోవడం క్షేమకరం కాదు. కనుక ఈ నిధిని ఇక్కడే భూమిలో పాతేద్దాం! బటూవానీ, చంద్రముఖినీ, లక్ష్మణరావునీ ఇక్కడ కాపలాగా ఉంచి, ఫ్లయింగ్ బోటులో మిగతా వాళ్ళం ప్రయాణ మవుదాం! రిపేరు చేయించుకుని, ఫ్యూయల్ నింపుకుని తిరిగి వస్తాం. ఆ తర్వాత ఇక్కడ నుంచే నేరుగా బొంబాయికి ప్రయాణం!" సుబ్రమణ్యాం మాటలకు అందరూ సమ్మతించారు, ఒక్క బటూవా తప్ప.

"నే నిక్కడ ఉండను!మళ్ళీ ఆ చింగ్ చౌ గాడు వచ్చా డంటే నన్ను లాక్కెళ్ళతాడు. నా చర్మం వలిపించి, నా కండల్ని గ్రద్దలకూ, రాబందులకూ ఆహారంగా వేస్తాడు" అని తన భయాన్ని ప్రకటించాడు బటూవా.

"ఏడికాడు.వాడిక్కడికెలా రాగలడు? పోనీ అంతగా భయంవేస్తే నీవు వెళ్ళిపో! నేనూ, చంద్రముఖీ ఇక్కడ

కాపలాగా ఉంటాం" లక్ష్మణరావు మాటలకు చంద్రముఖి తన అంగీకారాన్ని తెలిపింది.

దీవి మధ్యలో కొబ్బరి తోపులో ఇసుకలో గుంట త్రవ్వారు. వజ్రాల మూటలు ఆ గోతిలో వేసి పూడ్చేశారు.

చంద్రముఖినీ, లక్ష్మణరావునీ వదిలేసి, ఫ్లయింగ్ బోటు వెళ్ళిపోయింది.

తీరా ఫ్లయింగ్ బోటు వెళ్ళిపోయాక గానీ, లక్ష్మణ రావుకి ఆకలి వేస్తున్నట్టు గుర్తురాలేదు. ఉన్న కొద్దిపాటి ఆహారపు టిన్నులు బోటులోనే ఉండిపోయాయి.

ఇప్పుడు తమకేమిటి గతి? అతని ఆందోళన తెలుసు కున్న చంద్రముఖి గలగల నవ్వింది.

"కొబ్బరి చెట్లనిండా కాయలున్నయ్. సముద్రం నిండా చేపలున్నయ్. మనకు ఆహారానికి కొరత ఏమిటి?" అంటూ మొగరాయుడిలా గబగబ కొబ్బరి చెట్టుని ఎగబ్రాకింది చంద్రముఖి. ఒక గెలను త్రెంపి క్రిందపడేసింది. కత్తితో పీచుతీసి, రంధ్రం చేసింది. లక్ష్మణరావు కొబ్బరినీళ్ళు త్రాగాడు. లేత కొబ్బరి తిన్నాడు తృప్తిగా.

ఆ తర్వాత చంద్రముఖి అతడ్ని చేయిపట్టుకుని లాగింది. "రా వెళ్దాం!" అంటూ.

"ఎక్కడికి?" లక్ష్మణరావు అడిగాడు.

"అలా సముద్రంలోకి వెళ్ళి చేపలు పడదాం. ఒకవేళ రాత్రిలోపల వాళ్ళు తిరిగి రాకపోతే మనకి ఆహారం ఉండద్దూ?"

తీరాన పాత పడవ ఒకటి బోర్లా పడవేసి ఉంది. చంద్రముఖి ఆ పడవతో అరగంట కుస్తీపట్టి దాన్ని ఉపయోగపడేలా చేసింది.

ఇద్దరూ కలసి పడవను నీళ్ళలోకి నెట్టారు. చేపలుపట్టే గాలాలు తీసుకుని సముద్రంలోకి సాగారు పడవలో.

ఫ్లయింగ్ బోట్ తిరిగి వచ్చేదాకా తమకు ఏదైనా కాలక్షేపం జరగాలి కనుక, తీరిగ్గా ఇద్దరూ పడవలో చేపలు పట్టారు, మధ్యాహ్నం దాకా.

# 11

సముద్రంమీద గాలి ఉన్నట్టుండి పూర్తిగా స్తంభించిపోయింది. ఈ మార్పుకు లక్ష్మణరావు భయం భయంగా చూశాడు.

"గాలి అకస్మాత్తుగా ఆగిపోతే, పెద్ద పెద్ద అలలు కమ్ముకుంటయ్!" అంది చంద్రముఖి.

అంటే అతి త్వరలోనే సముద్రంమీద పెనుతుఫాను రాబోతున్నదని సూచన అన్నమాట.

చంద్రముఖి అతడి చేయిపట్టుకుని లాక్కెళ్ళసాగింది, కొబ్బరి తోటలోకి. వాళ్ళిద్దరూ కొబ్బరిచెట్ల గుంపులోకి చేరేసరికి ప్రచండంగా వాయువు వీచసాగింది. ఆ గాలి ఉధృతానికి మనుష్యులు గూడ ఎగిరిపోయేట్టున్నారు. లక్ష్మణరావు కొబ్బరిచెట్టు మొదలుని గట్టిగా కౌగలించుకుని నిలబడ్డాడు.

ఎక్కడ్నుంచో కొబ్బరిపీచుతో చేసిన చాంతాడుని లాక్కొచ్చింది చంద్రముఖి. కొబ్బరిచెట్టుకు అటు ఇటూ ఇద్దరూ నిలబడి చాంతాడుని తమచుట్టూ కొబ్బరిచెట్టు చుట్టూ మూడు నాలుగు వరసలు త్రిప్పి కట్టివేశారు. ఆ విధంగా తమను తామే కొబ్బరిచెట్టు బోదెకు కట్టివేసుకున్నారు గాలి ఉధృతానికి ఎగిరిపోకుండా.

తుఫాను మొదలయింది. సముద్రంమీద అలలు ఉవ్వెత్తున లేచిపడుతున్నయ్. తుఫాను గాలికి కొబ్బరిచెట్ల

తలలు ఊగిపోతున్నాయ్ భయంకరంగా! హోరుమనే శబ్దం!

దాపులనే ఉన్న మరో కొబ్బరిచెట్టు తలభాగంవరకూ విరిగిపోయింది గాలికి. కొబ్బరిమట్టలతో సహా సుడిగాలిలో ఎగిరే ఆకులా, అలవోకగా ఎగిరి గాలిలో గిరగిర గిరికీలు కొట్టింది. ఆ తర్వాత సముద్రంలో పడిపోయింది.

రెండు గంటలసేపు భీభత్సాన్ని సృష్టించింది తుఫాను. ఆ తర్వాత ఎంత వేగంతో వచ్చిందో అంతే వేగంతో చప్పబడిపోయింది. సముద్రం ఏమీ ఎరగని నంగనాచిలా తిరిగి నిశ్చలంగా ఉండిపోయింది.

ఆకాశంలో ఇంకా మబ్బులు విడిపోలేదు. తుఫాను దెబ్బకు చాలా కొబ్బరిచెట్ల తలలు ఎగిరిపోయాయి. ఇసుక, కొబ్బరి ఆకులు, బొండాలతో నేల కప్పబడింది. వాటి మధ్యగా సముద్రం ఆటూ పోటూలో ద్వీపం మీదకు వచ్చిపడ్డ ఎండ్రకాయలు, పీతలూ, నత్తలూ ఇంకా తిరుగాడుతున్నయ్.

వానకు తడిసి ఉండటంవల్ల లక్ష్మణరావుకు జ్వరం వచ్చినట్టుగా ఉంది. కళ్ళు ఎర్రబారి మండుతున్నయ్. నోరు ఆడారిపోతోంది. అమితంగా దాహం వేస్తున్నది. చంద్రముఖి మాత్రం మామూలుగానే వుంది. ఈ ద్వీపాల్లోని వాతావరణానికి ఆమె బాగా అలవాటు పడిపోయినట్టుంది.

లక్ష్మణరావు అవస్థను పసిగట్టింది చంద్రముఖి. నేల మీద పడివున్న కొబ్బరి బోండానికి తన కత్తితో రంధ్రం చేసి, అతడికి అందించింది. ఆత్రంగా, గటగట త్రాగేశాడు లక్ష్మణరావు. అలా నాలుగైదు కొబ్బరి బొండాలు త్రాగాక అతడికి ప్రాణం చేరుకుంది.

చంద్రముఖి, లక్ష్మణరావు ఇద్దరూ తమ గుడారం వేపుకు నడిచారు. టెంట్ కి వేసిన టార్పాలిన్ త్రాళ్ళు రెండు ప్రక్కల తెగిపోయాయి. టార్పాలిన్ చిందరవందరగా పడివుంది.

దాన్ని సరిచేసి, మళ్ళీ గుడారం నిర్మించారు ఇద్దరూ. లక్ష్మణరావుకి బాగా అలసటగా వుంది. కళ్ళు మూతలు పడుతున్నయ్. టెంట్ లోకి వెళ్ళి మరో టార్పాలిన్ ని పరుచుకుని దానిమీద వాలిపోయాడు.

# 12

లక్ష్మణరావుకు మెలకువ వచ్చేసరికి బాగా ఎండెక్కింది. అంటే తను నిన్న సాయంకాలం అనంగా పడుకుని, మర్నాడు తెల్లవారి బాగా ప్రొద్దెక్కాక లేచాడన్నమాట!

అంతలోనే అతడికి మనుష్యుల మాటలు వినిపించినయ్. అతడి ప్రాణాలు లేచివచ్చినయ్. బహుశా సుబ్రమణ్యం బృందం తిరిగి వచ్చారు కాబోలు అనుకున్నాడు. వాళ్ళ రాకకోసమే తనూ తహతహలాడుతున్నాడు. అతడు లేవబోయాడు.

టెంట్ ముందర ప్రత్యక్షమైన వ్యక్తిని చూడగానే, అతని నవనాడులూ కృంగిపోయాయి. సుబ్రమణ్యాన్ని చూద్దామనుకున్న వ్యక్తికి కాలయముడిలా చింగ్ చౌ దర్శనమిచ్చాడు. టెంట్ గుడ్డ అడుగుభాగం కొద్దిగా లేవనెత్తి సముద్రం మీదకు చూశాడు లక్ష్మణరావు. సముద్రంలో చింగ్ చౌ నౌక లంగరువేసి వుంది.

ఇంతకాలమూ చింగ్ చౌ వజ్రాలున్న చోటుని వెతుకాడు తున్నాడన్నమాట. ఇప్పటికి ఆ ప్రదేశాన్ని గుర్తు

పట్టి, ఈ దీవిలోకి వచ్చాడు. బహుశా ఇంతక్రితం వీచిన తుఫానుకి అతడి నౌకకు మరామత్తులు అవసరం అయి ఉండాలి. అందుకే ఈ దీవికి చేరాడు. దీవిమీది గుడారం అతడి దృష్టిని ఇట్టే ఆకర్షించి ఉంటుంది.

"ఓ! నువ్వేనా? ఆనాడు నన్ను బ్రతిమాలి, ప్రాధేయపడి, ఈ ప్రాంతాలకు రానని చెప్పి తప్పించుకున్నావ్! మాట తప్పి వచ్చావ్ మళ్ళీ. ఈ దఫా నీకు నా చేతిలో చావు తప్పదు" చింగ్ చౌ గలగల నవ్వాడు.

లక్ష్మణరావు నోటమాట రాలేదు.

"ఎక్కడ మీ మిత్రులు!"

"తుఫాను రాకముందే వెళ్ళిపోయారు. నేను చేపలు పట్టటానికి వెళ్ళాను ఆ సమయంలో. వాళ్ళు వెళ్ళిపోయారు నన్ను వదిలేసి! అందుకే ఒంటరిగా మిగిలిపోయాను" నేర్పుగా అబద్ధమాడాడు లక్ష్మణరావు.

"వజ్రాలు దొరకపుచ్చుకునే వెళ్ళారా?"

"లేదు. ఇంకా వాటి అన్వేషణలోనే ఉన్నాం!"

చింగ్ చౌ అతడి కళ్ళల్లోకి గుచ్చి చూశాడు.

లక్ష్మణరావు తనకు ఆయువు తీరిపోయిందనుకున్నాడు. బహుశా చింగ్ చౌ తను అబద్ధమాడుతున్నట్టు పసిగట్టాడేమో! వాడు సైకాలజీలో అనుభవం గలవాడేమో! తన మనసునే చదివేయగలుగుతున్నాడు.

"నాతోనే అబద్ధమాడతావురా! నా నౌకలోని సరంగుల్ని చూశావా? వాళ్ళంతా ఆఫ్రికా దేశానికి చెందిన వాళ్ళు. అక్కడ వాళ్ళు ఏం తిన్నారో తెలుసా? నరమాంసం! దాన్ని రుచిచూసి చాలా రోజులయిందని వాళ్ళంతా గోలపెడుతున్నారు. నిన్ను వాళ్ళకు అప్పజెబుతాను."

లక్ష్మణరావు అయోమయంగా చూశాడు. అతడి కళ్ళు దీవినంతటినీ సర్వే చేసినయ్. అన్నట్టు చంద్రముఖి ఎక్కడ? కనీసం ఆమె అయినా ఈ దుర్మార్గుడి దృష్టిలో పడకుండా తప్పించుకుంటే చాలు!

చింగ్ చౌ కళ్ళు క్యాంప్ చుట్టూ వెదకినయ్. అతడికి అనుమానాస్పదమైనదేదీ కనుపించలేదు. ఆ తర్వాత తన అనుచరులను లక్ష్మణరావుకి కాపలా ఉంచి, ఆ చుట్టుపట్ల నేలను పరీక్షగా చూడసాగాడు.

కొబ్బరిమట్టల్ని ఇవతలకు లాగి, గాలికి ఎగిరిపడిన ఆకూ, అలమునూ ప్రక్కకు తొలగించి మరీ నేలను శ్రద్ధగా చూస్తున్నాడు చింగ్ చౌ. వాడికి బహుశా "కర్ణభేరి" ఉండాలి. లేకపోతే తాము ఇక్కడ వజ్రాలను పాతిపెట్టినట్టు వాడికెలా అనుమానం వస్తుంది?

చింగ్ చౌ ఒకచోట ఆగిపోయాడు. అతడి ముందర చిన్న గొయ్యి ఉంది.

తాము వజ్రాల మూటను పాతిపెట్టింది అక్కడే! ఆ మూటమీద బాగా ఇసుకపోసి పూడ్చారే? తుఫానులో ఆ ఇసుకంతా ఎగిరిపోయింది. తాము త్రవ్విన గొయ్యి స్పష్టంగా కన్పిస్తోంది.

లక్ష్మణరావు ఊపిరి బిగబట్టి చూశాడు. గోతిలోంచి ప్లాస్టిక్ సంచీ కొద్దిగా కన్పిస్తోంది.

నిశిరాత్రిలో గుడ్లగూబ అరుపులా, నిశ్శబ్దంగా వున్న వాతావరణాన్ని చీలుస్తూ వికృతంగా నవ్వాడు చింగ్ చౌ. తన అనుచరులకు ఏదో సంజ్ఞ చేశాడు. కొందరు కళాసీలు ఆ గోతిమీదకు దూకారు. తమ మొరటు చేతుల్తోనే గొయ్యిలోని ఇసుకను పైకి త్రోడివేస్తున్నారు.

ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి కష్టపడి సంపాదించిన వజ్రాల మూట క్షణాల్లోనే చింగ్ చా చేతుల్లోకి మారి పోయింది. లక్ష్మణరావు హృదయాన్ని ఎవరో పిండేసి నట్టయింది. మరోసారి తన దురదృష్టం తనను వికృతంగా పరిహసించింది.

"వజ్రాలు దొరకలేదని బుకాయించావు కదూ?" లక్ష్మణరావువంక తినేసేలా చూస్తూ అన్నాడు చింగ్ చా.

"నా కా విషయమే తెలీదు!"

"పోనీలే! నీ మిత్రులు నాకు చాలా శ్రమ తగ్గించారు. ఇందుకు వాళ్ళు జన్మలో మరువలేనంత విధంగా నా కృతజ్ఞతను తెలియజేస్తాను."

వజ్రాల మూటను తీసుకుని తనను ఈ దీవిమీదే వదిలేస్తాడని ఆశపడ్డాడు లక్ష్మణరావు. కాని చింగ్ చా అతణ్ణి బంధితుణ్ణి చేసి, బోటులో ఎక్కించాడు. తనతో బాటుగా నాకలోకి తీసుకెళ్ళాడు.

"ఇక ఈ వజ్రాల విషయం నీ నోటంట ఎవరికీ తెలియరాదు. అందుకే నీ నోరు శాశ్వతంగా మూసేస్తున్నాను" అన్నాడు చింగ్ చా, తన కళాసీలకు సంజ్ఞ చేస్తూ.

పిశాచాల్లా నలుగురు కింకరులు లక్ష్మణరావుమీదకు లంఘించారు. త్రాడుతో అతడి చేతుల్ని వెనక్కి విరిచి కట్టారు. కాళ్ళు రెండూ బంధించారు. బరువైన ఇనుప కమ్మీని వెనకవైపు చంకల క్రిందుగా దూర్చారు. అతణ్ణి డెక్ అంచుకు లాక్కెళ్ళారు. లక్ష్మణరావు నడుముకి మరో త్రాడు కట్టారు. డెక్ మీదనుంచి నెట్టివేశారు. త్రాడుని జారుస్తూ, అతణ్ణి నీళ్ళమీదకు జారవిడిచారు.

తనను ఈ విధంగా బంధించి సముద్రం అగాధంలో

సమాధి చేయబోతున్నారని ఆలస్యంగా గ్రహించాడు లక్ష్మణరావు. అతడి చంకల్లో ఇరికించి వున్న ఇనుప కమ్మీ బరువుకు అతడు నీళ్ళల్లోకి మునిగిపోతున్నాడు అంత కంతకూ. ఆఖరి క్షణంలో ఎంత గింజుకున్నా ప్రయోజనం లేకపోయింది. సముద్రంలో మునిగిపోయిన వజ్రాలను దొరకబుచ్చుకుని తను లక్షాధికారి అవాలని ఆశపడ్డాడు. ఆ ప్రయత్నం నెరవేరాక కూడా, తను నిస్సహాయుడుగా సముద్రం అగాధంలోకి జేరుకుంటున్నాడు. అతడి చుట్టూ చీకటి అలుముకుంది. కడసారిగా భగవంతుడ్ని తలుచుకుని కళ్ళు మూసుకున్నాడు.

# 13

ఫ్లయింగ్ బోటు మళ్ళీ వజ్రాలదీవి చేరుకుంది. ద్వీపంలో లక్ష్మణరావుగానీ, చంద్రముఖి జాడగానీ కనుపించలేదు సుబ్రమణ్యానికి. టెంట్ ఖాళీగా ఉంది.

అతడి దృష్టి అప్రయత్నంగా కొబ్బరిచెట్ల తోపులోకి మళ్ళింది. ఇసుకలో పెద్దగొయ్యి అతడ్ని పరిహసిస్తూ కనబడింది. మతిపోయినంత పనయింది సుబ్రమణ్యానికి.

గోతిలో పూడ్చిన వజ్రాల మూట ఎలా మాయ మయింది? చంద్రముఖి, లక్ష్మణరావు లేమైపోయారు? కొంపతీసి వాళ్ళిద్దరూ వజ్రాలతో పరారయిపోలేదు కదా?

అలా జరిగి ఉండదు, అసంభవం అనుకున్నాడు సుబ్ర మణ్యం. చటర్జీ, మురుగేశన్, సుబ్రమణ్యం అందరూ ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు.

ముగ్గురూ తీరం మీదకు చూపు సారించారు. ఏదైనా బోటులో వాళ్ళిద్దరూ ప్రయాణిస్తున్న జాడ కనిపిస్తుం దేమో అనే ఆశతో. కానీ వారికి బోటు బదులు పెద్ద నౌక కనుపించింది, ఆ నౌక చింగ్ చౌది.

"ఛటర్జీ! మనం లేనప్పుడు ఆ చైనావాడుగాని, ఈ దీవిలోకి వచ్చి వజ్రాల మూటను అపహరించలేదు గదా?" సుబ్రమణ్యం అనుమానంగా చూశాడు.

"అలా జరిగిన పక్షంలో, లక్ష్మణరావూ, చంద్రముఖీ చింగ్ చా చేతుల్లో బందీలయి ఉండాలి!"

"నిజమే సుమా! ఈ చింగ్ చాగాడు మనకు అడుగడుగునా అవరోధం అవుతున్నాడు. ఈసారి వాడ్ని ప్రాణాలతో వదలగూడదు!" సుబ్రమణ్యం ముఖం కోపంతో జేవురించింది.

అతడు తన మిత్రులిద్దరివంకా చూసి, కళ్ళతోనే సంజ్ఞ చేశాడు.

చింగ్ చా నౌక లంగరు వేసింది అల్లంత దూరాన. బోటుని క్రిందకు దింపారు. చింగ్ చా, మరికొందరు నావికులు నౌకలోంచి బోటులోకి మారారు. బోటు తీరానికి చేరుతోంది.

చింగ్ చా చేతిలో తుపాకీ ఉండటాన్ని గమనించాడు సుబ్రమణ్యం. తన చేతిని జేబులోకి పోనిచ్చి, రివాల్వర్‌ని తడిమి చూసుకున్నాడు మరోసారి.

చింగ్ చా ఏవో దుర్భాషలాడుకుంటూ ఒడ్డెక్కాడు.

"ఒరేయ్ భారతీయుడా? ఆ వజ్రాలెక్కడ?" అని అరిచాడు సుబ్రమణ్యం వంక చూస్తూ.

"నేను అదే అడిగి తెలుసుకుందామనే కుతూహలంతో ఉన్నాను. వజ్రాల మూటను ఇసుకలో గొయ్యి తీసి అందులో కప్పిపెట్టాం. కాపలాగా మనుషుల్ని గూడ ఉంచాం. మనుషులు అయిపులేరు, వజ్రాలు మటుమాయం అయాయి! ఇది ఎవరి పని అయి ఉంటుంది?" సుబ్రమణ్యం తీక్షణంగా చింగ్ చా వంక చూస్తూ అన్నాడు.

చింగ్ చా అదోలా చూశాడు. "మీరు లేనప్పుడు నేను ఈ దీవిలోకి వచ్చినమాట నిజమే! వజ్రాలమూటను వెదికి తీసుకున్నాం. కాపలాగా ఉన్న లక్ష్మణరావుని బందీగా తీసుకెళ్ళాను!" చింగ్ చా నింపాదిగా చెప్పాడు.

"అంటే, లక్ష్మణరావు మీ నౌకలో బందీ అయి, పోయాడు, మిస్టర్ చింగ్ గా! నా తడాఖా అప్పుడు హోటల్లో ఒకసారి చవిచూశావ్! ముందు మర్యాదగా లక్ష్మణరావుని విడిపించి తెప్పించు. లేదా నీవు యమపురికి ప్రయాణం కడతావ్ తెలుసా?"

చింగ్ చా నవ్వాడు వికటంగా. "లక్ష్మణరావు ఇప్పుడు నా నౌకలో లేడు!"

"మరెక్కడున్నాడు?"

చింగ్ చా చేయి జాపి చూపుడు వ్రేలితో సాగర మధ్యమంలోకి చూపించాడు. "మీ లక్ష్మణరావు అక్కడ, అట్టడుగున ఈపాటికి జలచరాలకు ఆహారం అయి వుంటాడు" అన్నాడు.

వజ్రాలు పోయినదానికన్న, లక్ష్మణరావు పోయాడన్న మాట అందరికీ విచారం కలిగించింది.

"అది సరే! పోయినవాళ్ళకోసం తర్వాత విచారించ వచ్చు. ముందు వజ్రాలేం చేశారో చెప్పండి!" చింగ్ చా కోపంగా అరిచాడు తన రైఫిల్ ని బార్ చేస్తూ.

"పోయిన వజ్రాలకోసం మాత్రం విచారించటం దేనికి?" మురుగేశన్ వెటకారంగా అన్నాడు.

"వజ్రాల మూటను నీవే ఎత్తుపోయావని అన్నావు గదా? మళ్ళీ మమ్మల్నడుగుతావేం?" సుబ్రమణ్యం రెట్టించాడు.

"మీతో వాదనకు రాలేదు నేను. వజ్రాలు అప్ప గిస్తారా? లేక మిమ్మల్ని నాశనం చేసేస్తాను" చింగ్ చా వణికిపోతున్నాడు ఆవేశంతో.

"మమ్మల్ని నాశనం చేయడం తర్వాత! ముందు నీ విక్కడనుంచి ఎలా బయటపడతావో చూసుకో! మర్యా దగా నౌకలోంచి వజ్రాల్ని తెప్పించు! లేదా నీ నౌకను గూడ ముంచేస్తాం!" సుబ్రమణ్యం ఏమాత్రం తొణకకుండా చెప్పాడు.

"నా చేతిలో ఏముందో తెలుసా? రైఫిల్! మిమ్మ ల్నందర్నీ పిట్టల్ని కాల్చినట్టుగా కాల్చి పారేస్తాను."

సుబ్రమణ్యం, మురుగేశన్, ఛటర్జీ పొట్ట చెక్క అయ్యేట్టుగా నవ్వారు.

"ఒరేయ్! పంది వెధవా! నీ చేతిలో రైఫిల్ని చూసి ఈ ప్రాంతాల్లో ఆటవికుల్ని బెదిరించినట్టనుకున్నావా ఏం? ముందు వజ్రాల సంగతి చెప్పు!" అంటూ మెరుపులా, కనురెప్పపాటులో తన జేబులోంచి రివాల్వర్ని తీసి చింగ్ చా చేతిమీద కాల్చాడు.

చింగ్ చా చేతిలోని రైఫిల్ క్రింద పడిపోయింది. దాన్ని చటర్జీ అందుకున్నాడు. అతడి చేతికి అయిన గాయంనుంచి రక్తం స్రవిస్తోంది.

ప్రక్కనే ఉన్న ఆటవికు డొకడు గుడ్డను నీళ్ళలో తడిపి చింగ్ చా చేతికి కట్టాడు. నౌకవైపుగా తిరిగి ఈల వేశాడు పెద్దగా.

నౌకలోంచి ఇంకా కొందరు ఆటవిక నావికులు పడ వల్లో ఒడ్డుకు వస్తున్నారు. వారి చేతులలో బల్లేలున్నయ్.

ఛటర్జీ, మురుగేశన్లు ఒడ్డువైపుగా పరుగెత్తారు, తమ ఆటోమేటిక్ రివాల్వర్స్ని గాలిలోకి ప్రేలుస్తూ.

అగ్నిని చూస్తే అడవి జంతువులకు ఎంత భయమో, తుపాకులన్నా, రివాల్వర్లన్నా ఆటవికులకు అంత భయం.

పడవల్లోని ఆటవికులు గభాల్న నీళ్ళలోకి దూకి ఎటు వాళ్ళటు పారిపోసాగారు.

చింగ్ చావైపు గర్వంగా చూశాడు సుబ్రమణ్యం.

"ఇక ఇప్పుడు చెప్పు వజ్రాలెక్కడున్నాయో!"

"వజ్రాలు నా నౌకలోంచి మాయమయాయి! ఏమై పోయాయో ఆశ్చర్యంగా ఉంది. అందుకే ఈ ద్వీపం నుంచి చాలాదూరం వెళ్ళినవాడ్ని గూడ మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చాను వాటికోసం!" చింగ్ చాలో విచారమూ, క్రోధమూ రెండూ కానవచ్చాయి.

"నీవు తిరిగి వచ్చింది వజ్రాలకోసంకాదు! నీ మృత్యువుని కలుసుకునేందు," సుబ్రమణ్యం రివాల్వర్ని గురిపెట్టాడు.

చింగ్ చా ప్రాణభయంతో అతి దీనంగా చూస్తున్నాడు.

# 14

లక్ష్మణరావు అగాధంలో అట్టడుగుకి చేరుకున్నాడు. అతడి కాళ్ళకు నేల తగిలింది. డైవింగ్ లో అనుభవమూ, నేర్పరీ గలవాడు గనుక నీళ్ళలో పడిపోబోయేముందు, ఊపిరితిత్తులనిండా గాలి పీల్చుకున్నాడు. కొద్ది కొద్దిగా వదులుతూ, ఆఖరి క్షణాల్ని ఇంకా పొడిగించుకుంటున్నాడు.

సాక్షాత్తూ అలవైకుంఠంనుంచి విష్ణువు పరుగెత్తుకొస్తే తప్ప తనను ఎవరూ రక్షించలేరని అతడికి తెలుసు. అయినా ఏ ప్రాణి అయినా కొనప్రాణం ఉన్నంతవరకూ

జీవించాలనే తన్నుకులాడుతుంది.

మత్తుగా అతడి కళ్ళు మూతలు పడుతుండగా అతడి ఒంటికి ఏదో మెత్తగా తగిలింది. అతడు ఉలిక్కిపడ్డాడు. షార్క్‌లాంటి ఏ జలచరమో తన్ను స్వాహా చేయటానికి వచ్చి ఉండాలి.

అతడిచుట్టూ ఏదో ఆక్రమించుకుంది. అతడ్ని నెమ్మదిగా లాక్కుంటోంది. వజ్రాల్ని వేటాడేటప్పుడు అతడ్ని కబళించ చూసిన ఆక్టోపస్ గుర్తుకు వచ్చింది లక్ష్మణరావుకి. వెన్నులోంచి భయం జరజర ప్రాకింది. ఆకులా వణికిపోయాడు ఆ భయంతో.

ఇప్పుడు తను మళ్ళీ మరో ఆక్టోపస్ వాత బడ్డాడా?అదే తన కబంధహస్తాల్లో ఇరికించుకుని దాని నోటివైపుకు లాక్కుంటోందా? మామూలు మనిషి అయితే ఈపాటికి ఆ భయంతో గుండె ఆగి మరణించి ఉండేవాడే! కాని లక్ష్మణరావు ఆ ప్రాంతాల్లో అన్ని రకాల అపాయాల్ని ఎదుర్కొన్నవాడవటంవల్ల అతడు ఇంకా నిభాయించుకో గలిగాడు.

యమధర్మరాజు సభను ఊహించుకుంటూ కళ్ళు తెరిచాడు లక్ష్మణరావు. బయట ఎండ వెలుగూ, చల్లని గాలీ తగిలినయ్.

అప్పటికి అతడ్ని ఆవరించిన నీరసం, ఒక విధమైన కోమా సడలిపోయింది. తను ఇసుకలో సముద్ర తీరాన, చంద్రముఖి తొడమీద తల ఉంచి, పడుకుని ఉన్నాడు.

చంద్రముఖి ఏవో ఆకుల్ని అరచేతుల్లో నలిపి, దాని పసురుని వాసన చూపుతోంది అతడికి. అతడికి తెలివి వచ్చిందని గ్రహించగానే, చంద్రముఖి తను కూర్చున్న

చోటునుంచి లేచింది. లక్ష్మణరావు పొట్టమీద రెంఁ
చేతులూ ఉంచి గట్టిగా అదిమింది.

బొళుక్, బొళుక్మని నీళ్ళు కక్కాడు లక్ష్మణరావ
అతడికి తెలియకుండానే, అతడు నీళ్ళు త్రాగేశాఁ
కాబోలు, వాటిని కక్కించేసింది చంద్రముఖి.

"చంద్రముఖీ! నీ ఋణం తీర్చుకోలేను. నాకు మ
జన్మ ఇచ్చావ్!" అన్నాడు నెమ్మదిగా లక్ష్మణరావు.

"అమ్మయ్యా! నీవు బ్రతుకుతావో లేదో అని ఇంద
ట్నుంచీ దిగులుపడి ఛస్తున్నాను. చింగ్ చౌ నా మొగు
ఎత్తుకుపోతే, మీరంతా కలసి, అతడ్ని రక్షించి వ
నాకప్పగించారు. అటువంటప్పుడు మిమ్మల్ని కాపాడ
మాత్రం నా వంతు కాదూ?" అంది చంద్రమ
నవ్వుతూ.

"అవునూ! చింగ్ చౌ వచ్చేసరికి నాకు మెలకువ వ
సింది. ప్రక్కన చూస్తే నీవు లేవు. నీవు ఎక్క
వెళ్ళావ్?"

"చింగ్ చౌ రావడం ముందే పసిగట్టి, నేను సమ
లోకి జారుకున్నాను. ఓడ దగ్గరకు చేరుకుని, ఎ
చూడకుండా ఓడలోకి ఎక్కాను. తర్వాత నిన్ను
వచ్చారు డెక్ మీదకు. ఆ విషయం ముందే పసిగట్టి
నాకలోకి చేరాను. నిన్ను నీళ్ళలోకి జారవిడవం
నేనూ నీ వెనకనే నీళ్ళలోకి దిగాను. ఎలాగైతే
నిన్ను ప్రాణాలతో కాపాడాను. అంతే చాలు నా

కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు లక్ష్మణరావు
వంక.

"ఇంకా ఇక్కడెందుకు? పద ద్వీపంలోకి పోఁ

అన్నాడు లక్ష్మణరావు లేచి కూర్చుంటూ.

"తొందరపడకు! ఆ చైనావాడు ఎందుకో మళ్ళీ తిరిగి ద్వీపంలోకి వచ్చి చేరాడు. వాడు వెళ్ళిపోయేదాకా ఇక్కడే ఉందాం!" అంది చంద్రముఖి.

ఆమె తొడమీద తల వాల్చి నీరసంగా కళ్ళు మూసుకున్నాడు లక్ష్మణరావు.

వాళ్ళు కూర్చున్న చోటినుంచి చింగ్ చా నౌక మాత్రమే కనబడుతోంది.

సుబ్రమణ్యం వచ్చిన ఫ్లయింగ్ బోట్ ఇంకా ఎగువ భాగాన ఉండటంవల్ల, దాని రాకను చంద్రముఖిగానీ, లక్ష్మణరావుగానీ పసిగట్టలేదు.

# 15

చింగ్ చా వాలకం సుబ్రమణ్యంలో ఏమాత్రం జాలిని కలిగించలేదు. పైపెచ్చు చింగ్ చా మొదటినుంచీ తమకు అవాంతరాల్ని తెచ్చిపెడుతూ, పెద్ద అడ్డంకిగా తయారయాడు.

"చింగ్ చా! వజ్రాలెక్కడున్నాయో మర్యాదగా చెప్పవు నీవు! అందుకే నీకు తగిన శిక్ష విధిస్తున్నాను. నిన్ను మా ఫ్లయింగ్ బోటులో తీసుకువెళ్ళి సముద్రంలో తీరంనుంచి రెండుమైళ్ళ దూరాన వదిలేస్తాను. ప్రాణభయంతో ఒడ్డుకు ఈదుకు వస్తావు నీవు. అప్పటికైనా చెప్పాల్సి ఉంటుంది. లేదా మళ్ళీ నిన్ను తీసుకువెళ్ళి అదే పని చేస్తాను" అంటూ సుబ్రమణ్యం తన రివాల్వర్ని చింగ్ చా కణతలకు ఆనించి పెట్టాడు.

వజ్రాలు ఎలా మాయమయిందీ తెలియనే తెలియదని ఎంత మొత్తుకున్నా వినలేదు.

ఆటవికులు నౌక డెక్ మీద నిలబడి నిస్సహాయంగా చూస్తున్నారు. వాళ్ళేమైనా కల్పించుకుందామా అంటే, నాగరిక మనుష్యుల చేతుల్లో రివాల్వర్లున్నాయి. పైగా ఎప్పుడయితే తమ నౌక కెప్టెన్ చింగ్ చా బందీ అయాడో, అప్పుడే వాళ్ళకు గూడ ప్రాణభయం పట్టుకుంది.

చింగ్ చాని బోటులో ఫ్లయింగ్ బోట్ లోకి చేర్చారు' ఫ్లయింగ్ బోట్ గాలిలోకి లేచింది. తీరంనుంచి రెండు మైళ్ళదూరం పోయాక డోర్ తెరిచాడు సుబ్రమణ్యాం.

"చింగ్ చా! వజ్రాలెక్కడ?" కటువుగా అడిగాడు.

"అయ్యో బాబోయ్! నాకేం తెలియదు! మీ జోలికి రాను! నన్ను వదిలేయండి మహాప్రభో!" గగ్గోలు పెట్టేస్తున్నాడు చింగ్ చా.

ఎందరో ప్రాణాల్ని అవలీలగా తీసిన చింగ్ చా తన ప్రాణానికి ముప్పు వచ్చేసరికి, సామాన్య మానవుడికన్న అతి హీనంగా, దీనంగా విలవిల్లాడిపోతున్నాడు.

"ఈ మాత్రానికే నీవు చెబుతావని నేనేనాడూ ఆశించలేదులే!" అన్నాడు సుబ్రమణ్యాం.

చింగ్ చా తలుపుకు దగ్గరగా నిలబడ్డాడు. సుబ్రమణ్యాం హఠాత్తుగా అతడ్ని కాలితో బలంగా తన్నాడు ఫుట్ బాల్ ని తన్నినట్టుగా.

సూలకాయుడైన చింగ్ చా ఫ్లయింగ్ బోట్ డోర్ లోంచి ఎగిరి బయటకు వచ్చాడు. గాలిలో గిరికీలు కొట్టుకుంటూ, అరుస్తూ, నీళ్ళలో పడ్డాడు.

"మన ఫ్లయింగ్ బోటుని తీరానికి నడపండి. ఆ పంది వెధప ఈదుకుంటూ వస్తాడులే! పదండి!" అన్నాడు సుబ్రమణ్యాం.

సుబ్రమణ్యాం ఫ్లయింగ్ బోటులో తీరానికి చేరు కున్నాడు.

ఒడ్డు కెళ్ళి మురుగేశన్‌తో కలిసే సమయానికి ఆటవికు లంతా హాహాకారాలు చేయసాగారు.

"ఏం జరిగింది!" అంటూ సుబ్రమణ్యాం వాళ్ళు చూస్తున్న దిశగా చూశాడు.

సముద్రంలో ఈదుతున్నాడు చింగ్‌చా. అతడికి కొద్ది దూరంలో నీళ్ళు పైకి ఎగజిమ్ముతున్నట్టుగా ఎగసిపడు తున్నయ్.

"సందేహం లేదు! అది షార్క్!" అనరిచాడు మురు గేశన్.

"అతడు అపకారి అయినా అతడ్ని కాపాడడం మన ధర్మం! వజ్రాల సంగతి తర్వాత చూసుకోవచ్చు!" అంటూ సుబ్రమణ్యాం మళ్ళీ ఫ్లయింగ్ బోట్‌లోకి ఎక్కాడు. ఇంజన్‌ని స్టార్ట్ చేశాడు.

ఫ్లయింగ్ బోటు గాలిలో ఎగురుతోంది సముద్రం మీదుగా.

నీళ్ళల్లోంచి చింగ్‌చా గొడ్డులా అరుస్తున్నాడు. ఫ్లయింగ్ బోటులోంచి త్రాటి నిచ్చెనని క్రిందకు జార విడిచారు.

చింగ్‌చా చేయి జాపి త్రాటి నిచ్చెనను అందుకో బోయాడు. కాని కొద్దిలో తప్పిపోయింది.

ఫ్లయింగ్ బోటు ఒక రౌండ్ కొట్టివచ్చి చింగ్‌చాకి చేరువగా నెత్తిమీదే ఎగురుతోంది. చింగ్‌చా త్రాటి నిచ్చెనను పట్టుకున్నాడు గట్టిగా.

ఫ్లయింగ్ బోట్ పైకి లేచింది ఇంకా. సముద్రం మట్టం

మీద అడుగు ఎత్తున, త్రాటి నిచ్చెనను పట్టుకుని గాలిలో వ్రేలాడుతున్నాడు చింగ్ చా.

"నిచ్చెన ఎక్కి పైకి రా! లేదా అలాగే గట్టిగా పట్టుకో ఒడ్డుకు చేరేదాకా!" అని అరిచాడు ఫ్లయింగ్ బోట్ లోంచి.

అంతలోనే షార్క్ నీళ్ళమీద తేలింది. కొద్దిగా పైకి ఎగిరింది. చిన్న గుహలా తన నోటిని తెరిచింది. మళ్ళీ వెంటనే ఆ నోరు మూతపడింది. త్రాటి నిచ్చెనమీద వ్రేలాడుతున్న చింగ్ చా ఎవరికీ కనుపించలేదు. షార్క్ నీళ్ళలోకి మునిగి మాయమయిపోయింది.

అందరూ దిగ్భ్రాంతులై చూస్తూండిపోయారు. ఎవరికీ నోటంట మాట రాలేదు.

చంద్రముఖి, లక్ష్మణరావుల దృష్టిపథంలోకి వచ్చింది ఫ్లయింగ్ బోట్.

లక్ష్మణరావు గభాల్న లేచి నిలబడ్డాడు. జేబుగుడ్డను గాలిలోకి వూపుతూ కేకలు పెట్టాడు.

అతడ్ని చూసిన సుబ్రమణ్యాం ఆనందానికి అవధుల్లేవు. చచ్చిపోయాడనుకున్న వ్యక్తి బ్రతికివస్తే ఎవరికైనా అలాగే ఉంటుంది కదా!

మిత్రులంతా ఒకచోట చేరారు.

"ప్చ్! ఏంలాభం! మన శ్రమఅంతా బూడిదలో పోసిన పన్నీరయింది. భద్రంగా దాచిన వజ్రాల్ని చింగ్ చా ఎత్తుకుపోయాడు. మళ్ళీ అవి మాయమయిపోయాయని ఇక్కడకు తిరిగి వచ్చాడు" సుబ్రమణ్యాం విచారంగా చెప్పాడు.

చంద్రముఖి ఏదో గుర్తుకు వచ్చిన దానిలా చూసింది.

"వజ్రాలా? అవి ఎక్కడకూ పోలేదు. నేను వాటిని భద్రంగా పదిలపరచాను" అంది.

అందరూ ఆశ్చర్యంగా ఆమెవేపు చూశారు నమ్మశక్యం కానట్టుగా.

"ఏమిటీ నీవ నేది?" సుబ్రమణ్యం అడిగాడు.

"అవును! చింగ్ చా నౌకను చూడంగానే నేను సముద్రంలో మునిగిపోయి ఆ నౌకను చేరుకున్నాను. వాళ్ళు ఎలాగూ లక్ష్మణరావును బందీగా తెస్తారని ముందే ఊహించాను. అతడ్ని విడిపించేందుకు వీలుగా, నేను ముందే నౌకను చేరుకున్నాను. ఎవరూ చూడకుండా పైకి ఎక్కి, కెప్టెన్ గదిలో దాక్కున్నాను.

"కొంత సేపటికి చింగ్ చా మూటతో వచ్చాడు. దాన్ని తన గదిలో టేబుల్ మీద భద్రపరచి వెళ్ళిపోయాడు. ఆ మూటను నేను సంగ్రహించాను. దానికి త్రాడుకట్టి, నౌక కిటికీలోంచి సముద్రంలోకి జారవిడిచాను. ఆ తర్వాత మెల్లగా తప్పించుకుని వచ్చి, లక్ష్మణరావుని రక్షించాను" చంద్రముఖి కళ్ళు త్రిప్పుకుంటూ చెప్పసాగింది.

లక్ష్మణరావు గూడ తనను చింగ్ చా ఏ రకంగా అగాధంలోకి పడత్రోసిందీ వివరించాడు.

"అయితే ఇప్పుడా వజ్రాల మూటను వెదకి తేగలవా? లేదా ఎక్కడ జారవిడిచావో తెలిపితే, మళ్ళీ మేం తిప్పలు పడతాం!" అనడిగాడు సుబ్రమణ్యం.

"మీకా శ్రమ అక్కరలేదు. ఇదివరకు ఆ నౌక లంగరు వేసిన చోటు నాకు బాగా గుర్తే!" అంటూ చంద్రముఖి లేడిలా పరుగెత్తింది. తీరాన ఎత్తైన రాయి ఉంది. దాని మీదకు ఎక్కి అక్కడ్నుంచి నీళ్ళలోకి దూకింది.

"సముద్రం అంటే భయమే లేదు. నీళ్ళలో చేపపిల్ల కన్న చాకచక్యంగా ఈదగలదు!" ఛటర్జీ ఆమెను మెచ్చుకున్నాడు.

పావుగంట గడిచింది. చంద్రముఖి నీళ్ళమీదకు తేలింది. ఆమె భుజాన మూట వ్రేలాడుతోంది.

చంద్రముఖి ఒడ్డుకు రాగానే, ఆమె ఆడదనే విచక్షణ లేకుండా, అందరూ ఆమెను చేతులమీద పైకెత్తేసారు. తమ భుజాలమీద కూర్చోబెట్టుకుని ఆమెను ద్వీపంలోకి తెచ్చారు గోలగా అరుచుకుంటూ.

"చంద్రముఖీ! మేం బ్రతికి ఉన్నన్నాళ్ళూ నీ పేరు స్మరిస్తూనే ఉంటాం!" అన్నాడు లక్ష్మణరావు.

"మీరు చేసిన సహాయం ముందు నా సహాయం ఏపాటి? నా భర్త బటూవాను నాకప్పగించారు. ఈ చుట్టుపట్ల ద్వీపవాసులకు చింగ్ చా పీడ విరగడచేశారు."

అందరూ ఆమె ఔదార్యాన్ని మెచ్చుకున్నారు.

మరో గంటలో ఫ్లయింగ్ బోట్ భారత భూభాగం వేపుగా ప్రయాణం సాగించింది.

ఫ్లయింగ్ బోట్‌కి టాటా చెప్పి, ఆనందంగా కొబ్బరి తోపుల్లోకి పరుగిడారు బటూవా, చంద్రముఖీ.

—: ఐపోయింది :—

# తమాషా దొంగలు

ఏ. వీ. మోహన్రావ్

బల్లపైనున్న ఇంటర్ కాన్ మ్రోగింది.

చూస్తున్న ఫైలు ప్రక్కకు నెట్టి, ఎడంచెయ్యి ముందుకు చాచి రిసీవరు అందుకొని "యస్!" అన్నాను.

"మిమ్మల్ని చూడాలని ఒకతను వచ్చాడు. బిజీగా వున్నారనీ, అడ్రసిచ్చి వెళ్తే, అపాయింట్ మెంట్ ఫిక్స్ చేసి, ఫోన్ ద్వారా తెలియపరుస్తానని చెప్పాను. అలా వీల్లేదంటూ మొండిగా కూర్చున్నాడు. ఏంచెయ్యాలో చెప్పండి!" అడిగింది నా సెక్రెటరీ వనజ.

అనకూడదుగానీ వనజ వనలక్ష్మిలా, వసంతశోభంతా నింపుకుని, నిండైన యవ్వనపు టందంతో, ఎదుటవాళ్ళను కవ్విస్తూ, కసెక్కిస్తూ వుంటుంది.

"ఏం పని చెప్పాడా?" అడిగాను.

"లేదు! పర్సనల్ అంటున్నాడు" అందామె.

"పేరు మొదలైన వివరాలు కనుక్కున్నావా?"

"ఆఁ! ప్రకాష్ అట. 'తృప్తి' సూపర్ బజార్‌లో పని చేస్తున్నాడట."

"ఆల్ రైట్!" సెండ్ హిమ్ ఇన్!" అని ఫోన్ క్రేడిల్ పైన పడేశాను.

అలాంటి పేరు నే నింతకుముందు విన్నట్లు లేదు. కానీ 'తృప్తి' సూపర్‌బజార్ గురించి మాత్రం విన్నాను. అన్ని రకాల వస్తువులూ సరసమైన ధరలకు దొరికే ఆరంతస్తుల మార్కెట్ అది.

అక్కడ పనిచేసే ప్రకాష్ నన్ను కలుసుకోవాలని ఎందుకొచ్చి వుంటాడాని ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఎదురుగా వున్న ఫ్లష్‌డోర్ నెట్టుకొని ఒక ఆకారం లోనికొచ్చింది. పాతిక సంవత్సరాలుంటాయి ఆ శాల్తీకి అనుకున్నాను. హిప్పీలా జుట్టు పెంచి వున్నాడు. ఎర్రటి సిల్కు షర్టు నల్లటి పాంటులో టక్ చేసుకొని, వెడల్పాటి బెల్టు పెట్టుకొని వున్నాడు. బొద్దుగా పెరిగిన మీసాలు పిల్లిగడ్డంలో కలసిపోయాయి. కళ్ళను దాచిపెడుతూ, పెట్టుకున్నాడు నల్లటి కళ్ళద్దాలు.

"నా పేరు ప్రకాష్! రావచ్చా!" అడిగాడు గుమ్మంవద్ద నిలుచునే.

"రండి! మీ కోసం వెయిట్ చేస్తున్నాను" అన్నాను నేను.

అతను వచ్చి నా కెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"'భాజా' పత్రికలో మీరు రాస్తున్న విషయాలు జనాన్ని, ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నాయి. సంఘంలో పేరుకున్న అవినీతినీ, లంచగొండితనాన్ని, ఆశ్రిత పక్షపాతాన్ని, దానివల్ల అధికారులు పొందుతున్న లాభాల్ని చాలా వివరంగా రాస్తున్నారు. మీ ఖలేజాకు నా జోహారులు!" అన్నాడతను.

అలాంటి పొగడ్తలు నాకు కొత్తకాదు.

మూడు మాసాల క్రితం, మద్రాసు మహానగరంలోనే కాదు, అఖిల భారతదేశంలో, పెద్ద పత్రికల అధిపతి, జలాల్, ప్రత్యేకంగా నన్ను పిలిపించి, ఎడిటరుగా నియమించి ప్రారంభించిన పత్రిక 'భాజా'. దాన్ని నడపడంలోని ఉద్దేశ్యం క్రుళ్ళి కంపుకొడుతున్న సమాజాన్ని ఆ మూలాగ్రం కడిగి, జాతీయ జీవనాన్ని పవిత్రమైన మార్గాల్లో నడిపించేందుకు అవసరమైన ప్రజాభిప్రాయాల్ని కూడగట్టడం. అందులో నేను రాసిన ప్రతివిషయానికీ ప్రజలనుండి మద్దతు లభిస్తూనే వుంది.

"నన్ను పొగడడానికని, మీ పనులు మానుకుని, ఇంత దూరం పనిగట్టుకుని వచ్చారన్నమాట!" అన్నాను.

"కాదు! మీతో మరో ముఖ్యమైన విషయం ప్రస్తావించాలని వచ్చాను!" అన్నాడు ప్రకాష్.

"ఏమిటది?"

"మీరుంటున్న బంగళాకు మా సూపర్ బజార్ చాలా దగ్గరలో వుంది!" అన్నాడు అతను.

"తెలుసు!" ఆ విషయం నాకెందుకు చెప్తున్నాడో అర్థంగాక అన్నాను.

"ఆ ప్రాంతాల నివసించే చాలామంది ధనవంతులు

మా వద్దనే వచ్చి షాపింగ్ చేస్తుంటారు. వాళ్ళల్లో మీ శ్రీమతి కూడా వుంది'' అన్నాడు.

''ఐ. సీ. అవన్నీ ఆమె చూసుకుంటుంది. నిజంగా నేనాట్టే ఇంటి విషయాలు పట్టించుకోను!'' అన్నాను.

''మా సూపర్ బజార్‌లో అమ్మకాలు బాగున్నా ప్రతి సంవత్సరం నష్టం వస్తూంది. ఆ నష్టం రావడానికి ముఖ్యమైన కారణం చాలా వస్తువులు దొంగిలించబడటమేనని ఈ మధ్యనే తెలుసుకున్నాం. కొంత డబ్బు ఖర్చుపెట్టి, క్లోజ్‌డ్ సర్క్యూట్ టి. వి. ఏర్పాటు చేశారు యజమానులు. నేను దానికి ఫోటోలు తీసే కెమెరాను తగిలించాను'' అన్నాడు ప్రకాష్.

వీటన్నింటి గురించి మా పత్రికలో ఏదన్నా ఆర్టికల్ రాయమంటాడేమోనని, అనుకున్నాను.

''దాంతో తీసిన కొన్ని ఫోటోలు తెచ్చాను. చూడండి!'' అంటూ ఒక పెద్ద కవరు నా ముందుకు తోశాడు.

నేను ఫ్లాప్ తీసి, లోనున్న ఫోటోల్ని వెలుపలికి లాగి ఒక్కొక్కటే చూడసాగాను. నా దృష్టి ఉన్నట్టుండి ఒక ఫోటోపైన ఆగిపోయింది. అందులో వున్నది ఎవ్వరో కాదు. నా భార్య జూలీ. జెస్సోర్ దువ్వెనతీసి దొంగతనంగా హాండ్ బ్యాగ్‌లో పెట్టుకొంటూ వుండగా తీసిన ఫోటో అది. ఆమె చూపులు చూస్తేనే తెలుస్తుంది దొంగతనం చేస్తున్నట్లు.

ఇంకొన్ని ఫోటోలు చూశాను. జూలీ వున్న స్నాప్స్ మరో రెండు దొరికాయి. నాకు మతిపోయినట్లయింది.

''మీరు కంగారుపడకండి! మీ భార్యతో పాటు ఇంకొంతమంది అందమైన ధనవంతుల భార్యలు కూడా వున్నారు'' అన్నాడతను.

ఆ విషయం అతను చెప్పకుండానే నా కర్థమయింది ఆ ఫోటోలు చూస్తుంటే. మా బంగళాకు ప్రక్కనే వున్న రామారావుగారి భార్య రజని, వీధి చివరి పచ్చ మేడలోని కపూర్ గారి భార్య షీలా, ఇద్దరినీ గుర్తుపట్టగలిగాను.

ఫోటోలన్నీ బొత్తిగాపెట్టి అతని ముందుకు తోశాను.

"చూశారుగా? ఏమంటారు?" అన్నాడు ప్రకాష్.

"నాచేత ఏమనిపించాలని తెచ్చారివి?" అడిగాను నేను.

"ఎందరో గొప్పవాళ్ళ అవినీతి నేరాలను, అసభ్యపు జీవితాలను, అందమైన కథల్లా తీర్చిదిద్ది, ప్రచురిస్తున్నారు మీ పత్రికల్లో. మీకున్న పేరూ ప్రతిష్ఠా నాకు తెలుసు. మీ శ్రీమతి ఫోటో మీరు చూసిన ఫోజులో ఏదైనా పేపరులో పడితే ఎలా వుంటుందంటారు?" అడిగాడు ప్రకాష్.

అతను నన్ను ఆ ఫోటో సాకుగా బ్లాక్ మెయిల్ చెయ్యాలని వచ్చాడని వూహించాను.

"వాటికి ప్రచారం లేకుండా చూసే పూచీ నాది. దానికి కొంత ఖర్చవుతుంది. పెట్టుకుంటారా?" సూటిగా అడిగాడు ప్రకాష్.

"ఏమాత్రం?" అడిగాను.

"ఎంతోనా? పదివేలు! చాలు! ఆ ఫోటో పాజిటివ్ లతో సహా, నెగటివ్ లు కూడా ఇచ్చేస్తాను. మీ శ్రీమతి మళ్ళీ ఇటువంటి పనులు చెయ్యకుండా చూసుకోండి. అనవసరమైన ఖర్చులు... ఇలాటివి... ముందు ముందు తగలకుండా వుంటాయి" అన్నాడు ప్రకాష్.

"అంత మొత్తం నా దగ్గరలేదు. ప్రస్తుతంలో సమ కూడదు కూడా! కొంత టైం కావాలి!" అన్నాను.

"మనసుండాలి! మార్గం దొరుకుతుంది!"

"నా పరిస్థితి నాకన్నా నీకెక్కువ తెలుసా?"

"తెలుసు! మీ ఆవిడ ఎడంచేతికి ఆరుగాజులున్నాయి. మెళ్ళో రవ్వల నెక్లెసుంది. చెవులకు రవ్వల దుద్దులున్నాయి. అవన్నీ అమ్మితే నేనడిగినదానికన్నా ఎక్కువే వస్తుంది!" అన్నాడు ప్రకాష్.

వాడిమీద నాకు కోపం ముంచుకొచ్చింది. ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో కొన్న ఆ నగలకు ఇంకా సగానికిపైనే డబ్బు కట్టాలన్న విషయం నాకు తెలుసుగానీ వాడికి తెలీదుగా! డబ్బు ఇవ్వనని మొరాయిస్తే, నా పరువు బజారున వేసేస్తాడు. ఆ తర్వాత పదిమందిలో తలెత్తుకొని తిరిగే వీలు కూడా వుండదు.

"నిన్నెక్కడ కలుసుకోవాలి!" అడిగాను.

జేబులోంచి ఒక కార్డు తీసి పడేశాడు టేబుల్ పైన. దాన్ని అక్కడే వుంచి చూశాను.

"ఇవాళొస్తారా?" అడిగాడు ఆశగా.

"రాను! రేపు!!" అన్నాను.

"రాత్రి పది తర్వాత రండి. రివాల్వర్లు, కత్తులు, లాంటివి తేకండి. అవి నా దగ్గరా వున్నాయి. నలుగురు రౌడీలను వెంటపెట్టుకొచ్చి చంపుదామనుకున్నారంటే, నేను చచ్చాక కూడా మీ పరువు బజారుకెక్కే ఏర్పాట్లు చేసి మరీ వుంచుతాను" అన్నాడు.

"అలాంటిదేమీ వుండదు!" అన్నాను.

"మంచిది! వస్తాను! రేపురాత్రికి పదిగంటలకు వొంటరిగా పదివేలు పట్టుకురండి! ఫోటోలు నెగటివ్‌లు పట్టుకుపోండి!" అంటూ లేచి వెళ్ళిపోయాడు గదిలోంచి.

నాకు జూలీపైన కోపం ముంచుకొచ్చింది.

ఇంటర్ కామ్ బజ్జర్ నొక్కాను.

"హల్లో!" అంది నా సెక్రెటరీ వనజ.

"నేను అర్జెంటు పనిమీద వెళ్తున్నాను. ఎవరైనా వచ్చి అడిగితే ఎక్కడికి వెళ్ళింది తెలీదని చెప్పు!" అన్నాను.

"అలాగే! ఒకవేళ బాస్ మిమ్మల్ను చూడాలంటే!" తన అనుమానం వ్యక్తం చేసింది.

"ఆయనకూ అదేమాట చెప్పు!" అన్నాను.

"ఓ. కే!" అంది వనజ.

ఫోన్ పెట్టేశాను.

బ్రాండ్ కేస్ సర్దుకున్నాను. ప్రక్కనున్న అల్మైరాలో హాంగర్ కు తగిలించిన కోటుతీసి కుడిచేతిపైన వేసుకొని వెలుపలికొచ్చాను.

ఎలివేటర్ ను వదలేసి, మెట్లమీదుగా దిగి క్రింది కొచ్చాను.

## 2

కారు పోర్టికోలో ఆపి, డోర్ తెరచుకుని దిగాను.

హాల్లోకి అడుగుపెట్టాను.

జూలీ డబుల్ సోఫాలో కూర్చునుంది. ఆమెకెదురుగా వున్న సోఫాల్లో ముగ్గురు ఆడవాళ్ళున్నారు. అందరి చేతుల్లోనూ వున్న గ్లాసుల్లోంచి బిస్కెట్ బ్రాందీ పసుపు పచ్చగా మెరుస్తూంది.

"మీ హబ్బీ!" అందొకామె జూలీతో.

"దట్స్ ఓకే! లెటజ్ కారి ఆన్;" అంటూంది జూలీ.

మెల్లెక్కుతూ "జూలీ!" అని పిలిచాను.

"వాట్ డియర్!" అడిగింది త్రాగుతూనే.

"ఓమారు పైకి రా!" అన్నాను.

అందరూ గొల్లున నవ్వారు ఆ మాటల్లో ఏమర్థం స్ఫురించిందోనని. నాకు ఏడుపొస్తూంది జరిగిన సంఘటన తలచుకొని. వెనక్కి తిరిగి చూడకుండా పైకి వెళ్ళి పోయాను.

కోటు తీసి ప్రక్కన పెట్టాను.

పాంట్ కున్న లెదర్ బెల్ట్ లాగి సోఫాపైన వేశాను.

జూలీ పైకొచ్చింది.

నాకోసం గ్లాసునిండా పోసుకొచ్చింది బ్రాందీ.

"తీసుకో!" అంది గోముగా, మత్తెక్కిన కళ్ళతో నా కేసి చూస్తూ.

"వద్దు! నువ్వలా కూర్చో! అర్జంటుగా మాట్లాడాలి!" అన్నాను.

"ఇప్పుడా! సారీ! క్రింద నా ఫ్రెండ్సంతా వున్నారు. నా కంపెనీ లేకుండా త్రాగలేరు. వాళ్ళను పంపాక వస్తాను. తీరగ్గా తెల్లవారిందాకా మాట్లాడుకుందాం!" అంది జూలీ.

నాకు కోపం ఎక్కువయింది.

"నోరు మూసుకొని కూర్చో!" అన్నాను కర్కశంగా.

నా గొంతులోని కాఠిన్యానికి అదిరిపడినట్లు బిత్తర చూపులు చూసింది జూలీ. ఆ తర్వాత కూర్చుంది.

"నీకిదేం రోగం?" అడిగాను ప్రకాష్ దగ్గరనుండి అతను చూడకుండా తస్కరించి తెచ్చిన ఫోటో ఆమె ముందుకు చూస్తూ.

దానికేసి చూసి భయపడిపోయింది. కళ్ళలోకి ఎక్కి తైతక్కలాడిన మత్తుమాయమై, దాని స్థానే భయం చోటు చేసుకోవడం గమనించాను.

"మీ కక్కడిదిది?" అడిగింది జూలీ.

"నా ప్రశ్నకది జవాబు కాదు!" అన్నాను.

"ఆ రాస్కెల్ నెగటివ్‌లు, పాజిటివ్‌లు మాత్రం ఇస్తున్నానన్నాడు!" అంది జూలీ.

"ఎవరు? ప్రకాష్ సంగతేనా నువ్వు చెప్పేది?" అడిగాను.

"కాదు రాజేష్!" అంది.

"అవి ఇచ్చినందుకు ఎంత వసూలు చేశాడు నీదగ్గర!" అడిగాను.

"వసూలా? అలాంటిదేమీ లేదు!"

"నాన్సెన్స్! నాకు చెప్పే కథలు నిజం చెప్పు" అరచాను మేడ పైకప్పు దద్దరిల్లేలా.

"ఎంతో నా! రెండొందలిచ్చాను" అంది జూలీ.

అవి నమ్మదగ్గ మాటలు కాదని నాకే కాదు, ఆమె కూడా తెలుసు. నిజం కక్కించాలన్న కక్ష నాలో వటవృక్షంలా పెరిగింది.

"నాదగ్గరకొచ్చిన మనిషి పదివేలు తెమ్మన్నాడు. లేకుంటే పేపర్లలో వేయించి మన బ్రతుకులు అల్లరిపెడతా నన్నాడు. నన్నేం చెయ్యమంటావ్?" అడిగాను నన్ను నేను తమాయించుకొని.

"డబ్బు తీర్చే సమస్యల్ని, తీర్చుకోవడం తప్ప చేసేదేముంది?" అడిగింది జూలీ.

"ప్రస్తుతం నా దగ్గర డబ్బులు కూడా లేదు. పైగా

అప్పులు కూడా వున్నాయి. నీ భేషజానికీ, సరదాలకు, విందులు వినోదాలకు నా సంపాదనంతా హారతి కర్పూరంలా అయిపోతూంటే, బ్లాక్ మైలర్‌కు కూడా తెచ్చి ఇవ్వడం ఎలా?'' అడిగాను.

''ఆడదాన్ని నన్నడిగితే ఏం చెప్పగలను?'' అంది ఉదాసీనంగా జూలీ.

''చెప్పొద్దు! నీ నగలు తెచ్చివ్వు. అవి అమ్మి అతని మొహాన డబ్బు కొడతాను!'' అన్నాను.

''అవి బ్యాంక్‌లో పెట్టాను.''

''ఎప్పుడు?''

''నిన్న!''

''నాకు చెప్పలేదేం?''

''దొంగతనాలు ఎక్కువగా అవుతున్నాయట మన చుట్టుప్రక్కల బంగళాల్లో. మా స్నేహితులు చెప్పారు బ్యాంకులో దాచమని'' అంది జూలీ.

''దట్స్ ఓకే! రేపు వెళ్ళి తీసుకుందాం. నువ్వెళ్ళి మీ ఫ్రెండ్స్‌కు ఇంకా స్తోత్రం చెయ్యి. బట్టలు ఇక్కడే విప్పి వేసుకోమను. నగ్నంగా రోడ్లో ఊరేగుతూ వెళ్ళమను ఇళ్ళకు. గెటవుట్!'' అని అరచాను.

అలాంటి అవకాశంకోసం ఎదురు చూస్తుంది కాబోలు ఒక్క ఉదుటున పరుగెట్టింది క్రిందకు.

జూలీ వెళ్ళాక ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఆ ఫోటోలు చూపించి ముందుగానే జూలీ దగ్గర డబ్బు రాబట్టాడు ఆ రాజేష్ ఎవరో. నా దగ్గరకు మళ్ళీ అవే ఫోటోలతో వచ్చాడు ప్రకాష్ డబ్బుకోసం. అంటే ఇద్దరూ ఒకరే అయివుండాలి. లేకుంటే ఇద్దరిలో ఒకతను దీని వెనుకనున్న బ్రెయిన్.

పోలీసులకు రిపోర్టు చేద్దామనిపించింది.

వాళ్ళకూ, నాకు సంబంధ బాంధవ్యాలు అంత బాగా లేవు. ఈమధ్య పోలీసు డిపార్టుమెంటు పట్టే లంచాల గురించే సవివరంగా వార్తలు సేకరించి ప్రచురించాము. అవకాశం దొరికితే నన్ను కమ్ముల వెనక్కి త్రోసి అల్లరి పెట్టాలని చూస్తున్నారు వాళ్ళు. నా డ్రైవింగ్ లైసెన్సు రోజుకు పదిసార్లన్నా అడిగి చూస్తూ వుంటారు పోలీసులు.

క్రింద గానాబజానా జరుగుతూనే వుంది. ఇలా డబ్బునూ, కాలాన్నీ వృథా చేస్తూ, అదే జీవితమని మురిసిపోయే ఈ సొసైటీ లేడీస్ అంటే నాకు మంట. కానీ జూలీని సహిస్తున్నాను. ఆమెపై ప్రేమతో కాదు, ఆమెను వదిలేశానన్న అపఖ్యాతి తెచ్చుకోవడం ఇష్టంలేక!

మెరిసేదంతా బంగారుమనుకునీ, విరిసిన ప్రతి పువ్వులోనూ పుప్పొడి వుంటుందనీ మోసపోయిన వాళ్ళల్లో నేనూ ఒకడ్ని. జూలీ అందాన్ని చూచి, అంత అందమైన మనసుంటుందనుకుని వెంటబడి వేధించి పెళ్ళాడాను. ఆ తర్వాత ఆమె అసలు విలువలు తెలిశాయి. చెయ్యగలిగింది లేక సరుకుపోవడం మొదలుపెట్టాను.

జూలీపైనుంచి నా దృష్టి బ్లాక్ మెయిలర్ పైకి వెళ్ళింది.

ప్రకాష్ సామాన్యుడు కాదు.

నన్నూ, జూలీని పట్టుకొన్నట్లే, మిగిలిన వాళ్ళనుకూడా పట్టి వేధిస్తుంటాడనిపించింది. వెంటనే నాకు రామారావూ, కపూర్ గుర్తుకొచ్చారు. ఈపాటికి వాళ్ళవద్ద కూడా డబ్బు డిమాండ్ చేసుంటాడు.

ఒక్కొక్కరమే, అతని డబ్బుల్లో పడి, పాపర్లు కావడంకన్నా, అందరం కలిసి ఒక ప్లాను ఆలోచించి మా జోలికి రాకుండా వుండే మార్గం కనిపెట్టలేక పోతా మానిపించింది.

అయితే అసలీ విషయం వాళ్ళతో ఎలా జెప్పాలి అన్నది పెద్ద సమస్యయి కూచుంది. నాకై నేను వెళ్ళి అడిగితే తమ శ్రీమతులు అలాంటివారు కాదని, నేనెదు ర్కొంటున్న సమస్యలాంటి సమస్య ఏదీ వాళ్ళను నిద్రా హారాలు లేకుండా చెయ్యడం లేదని బుకాయించగలరు. వాళ్ళ నోటంటే విషయం రాబట్టాలనుకున్నాను. అందు కేదయినా దారి దొరుకుతుందని ఆలోచించసాగాను.

జూలీ అంతకుముందొచ్చినప్పుడు వదలి వెళ్ళిన బ్రాందీ గ్లాసు కనుపించింది. తీసుకుని గడగడ తాగేశాను.

ఆ రసం గొంతులోకి జారగానే గుండెల్లో అంతకు ముందుదాకా లేని ధైర్యమేదో పుట్టుకొచ్చినట్లయింది.

లేచి హాలంతా అడుగులతో అటూ ఇటూ పొడవు కొలిచాను పది నిముషాలు. క్రిందనుండి ఏవిధమైన శబ్దం రాలేదు. బహుశా అందరూ తాగి పడుంటారనుకున్నాను.

డ్రెస్ చేసుకొని క్రిందికొచ్చాను.

ఎవ్వరూ లేరక్కడ.

జూలీ మాత్రం సోఫాలో అర్ధనగ్నంగా పడివుంది.

తలుపులు దగ్గరకంటూ మూసి, వెలుపలనుండి గొళ్ళెం పెట్టి కారెక్కాను. తిన్నగా రామారావు ఇంటి ముందుకు పోనిచ్చాను. బంగళానిండా లైట్లు వెలుగుతున్నాయి. కిటికీలగుండా పడుతున్న వెలుతురును చూసి ఆ విషయం పసిగట్టాను.

గేటు తెరచుకొని లోనికి వెళ్ళాను.

మెయిన్ డోర్ ప్రక్కనున్న కాలింగ్ బెల్ నొక్కేందుకు చెయ్యెత్తాను. నా వీపుమీద ఏదో చెయ్యి పడింది.

తక్కున వెనక్కి తిరిగిచూశాను.

రామారావు కనుపించాడు.

నా ప్రయత్నం విరమించుకొని అతనికేసి చూశాను.

"ఏమిటింత రాత్రప్పుడు వచ్చారు? నా కోసమేనా?" అడిగాడు రామారావు.

"మీకోసమే!" అన్నాను.

"నా వైఫ్ మీ యింట్లోనే వుందా?"

"లేదు! ఇంతకుముందే వచ్చినట్లుంది అక్కడ్నించి, మీతో కొద్దిగా మాట్లాడాలి! అలా వెళ్దాం వస్తారా?' అడిగాను అతన్ని.

"రహస్యమా?" అడిగాడు రామారావు.

"అలాంటిదే!" అన్నాను నేను.

"పదండి!" అంటూ గేటు వైపు నడిచాడు రామారావు.

# 3

నేను స్టీరింగుముందు కూర్చున్నాను. రామారావుగారు నా ప్రక్కనే వున్నారు. కారు స్టార్టుచేశాను. కొంత దూరం వచ్చాక, 'కపూర్'గారి బంగళా ముందాపాను.

"ఎందుకాపావు?" అడిగాడు రామారావు.

"కపూర్ గార్ని కూడా పిల్చుకొస్తాను" అన్నాను.

"ఆయనెందుకు?"

"చెప్తాను. ఆయన్ను గూడా రానీండి!" అన్నాను.

అర్థంగానట్లు రామారావు నాకేసి అయోమయంగా జూశాడు.

నేను కారుదిగి వెళ్ళి, గేటు తీసుకొని లోనికి వెళ్లాను. కపూర్‌గారు లాన్‌లో కుర్చీ వేసుకుని, పేపరు చదువుతున్నారు మెర్క్యురీ లైటు వెలుగులో.

నా ఉనికిని తెలియజేస్తూ దగ్గాను చిన్నగా.

ఆయన తలెత్తిచూసి "మీరా? రండి" అన్నాడు కపూర్ ఆప్యాయంగా.

"అలా వెళ్దాం రండి! మీతో కొద్దిగా మాట్లాడాలి!" అన్నాను.

"ఏమిటి విశేషం" లేచే ప్రయత్నం చెయ్యకుండానే అడిగాడు.

"చెప్తాగా! రండి! ఇప్పుడే వచ్చేద్దాం!" అన్నాను.

కపూర్‌గారు పేపరు పారేసి అలానే లేచి నా వెంట వచ్చాడు. కారు డోర్ తీశాను. ఆయన ఎక్కి వెనుక సీట్లో కూర్చున్నాడు.

"రామారావుగారూ మీరా?" అడిగాడు కపూర్ నా ప్రక్కనున్న మనిషిని.

"అవునండీ! బావున్నారా? ఎలా వుంది వ్యాపారం?" అడిగాడు రామారావు.

"బాగుంది. ఏమిటీ హడావుడి?" అడిగాడు కపూర్.

"ఏమో? నాకు తెలీదు!" అన్నాడు రామారావు.

కారు స్టార్టు చేశాను.

"కొంపదీసి మామీద ఏదైనా ఆర్టికల్ రాయబోతున్నావా మీ పత్రికలో" అడిగాడు కపూర్.

"అబ్బే! అలాంటిదేమీ లేదు!" అన్నాను.

"అయితే మమ్మల్నెక్కడకు తీసుకెళ్తున్నావ్?" అడిగాడు రామారావు.

అంతలోనే లజ్ కార్నర్ కివతల అమృతాంజన్ వారి పార్కు ప్రాంతాని కొచ్చింది కారు. అక్కడ ఆపాను.

ముగ్గురం దిగి లోనికెళ్ళాం.

బాగా ప్రొద్దుపోవడంవల్ల జనం అంతగా లేరు.

నిర్మానుష్యంగా వున్న ఒక మూలకు నడిచాను. వాళ్ళిద్దరూ నన్ను అనుసరించి వచ్చారు. అందరం కూర్చున్నాం.

చెప్పటం మొదలెట్టాను.

"నేను మద్రాసు వచ్చి మూడు మాసాలపైన కొద్ది రోజులయింది. మీకన్నా పరిచయస్తులు, నాకెవ్వరూ లేరు. మనం మన శ్రీమతుల ద్వారా సుపరిచితులం. నేనొక పెద్ద సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. బహుశా మీ ఇద్దరు కూడా అలాంటి సమస్యను ఇంతకుముందే ఎదుర్కొని వుండివుండాలి! లేదా ఇవాళో, రేపో, ఎదుర్కోవలసిన అగత్యం కలుగుతుంది" ఆపాను చెప్పటం.

"మాకేం సమస్యలు లేవు!" అన్నారిద్దరూ ముక్త కంఠంతో.

"మీకు 'తృప్తి' సూపర్ బజార్ తెలుసా?"

"తెలుసు!" అన్నారు వాళ్ళు.

"అక్కడ పనిచేస్తున్నానని చెప్పుకొంటూ రాజేష్ అన్న పేరుతోనున్న వ్యక్తిగానీ, లేక ప్రకాష్ అనే మనిషిగానీ మీ దగ్గరకు వచ్చాడా?"

"రాలేదే!" అన్నాడు రామారావు.

"ఎందుకొస్తాడు?" అడిగాడు కపూర్.

జూలీ చేసిన దొంగతనం, దాని తాలూకు ఫోటోల విషయం, ప్రకాష్ వచ్చి పదివేలిమ్మని అడిగిన వైనం వివరంగా చెప్పాను.

"అయితే అది మీ సమస్య! మాకేం సంబంధంలేదు!" అన్నారిద్దరూ.

"అవును! కానీ అతని దగ్గరున్న ఫోటోల్లో మీ శ్రీమతులు కూడా వున్నారు, దొంగతనాలు చేస్తూ."

"నువ్వు చూశావా?" అడిగాడు కపూర్.

"ఆఁ!" అన్నాను.

"నా భార్య అలాంటిది కాదే! ఆమెకు ఏ విషయంలోనూ నేను ఎదురు చెప్పను. కావలసినంత డబ్బు తీసుకెళ్తుంటుంది. అందువల్ల అలాంటి నీచానికి పాల్పడవలసిన అవసరం ఆమెకు లేదు!" అన్నాడు రామారావు.

"అవసరాలతో ప్రసక్తి లేదీ పాడు పనులకు. ఇది ఒక విధమైన జబ్బు. డబ్బుగల వాండ్లలోనూ వుంటుంది ఎక్కువగా."

"మానుంచి మీకేం సాయంకావాలి! అతనడిగిన పది వేలూ మమ్మల్ని చెరో ఐదువేలు సర్దమని అడిగేందుకు, ఈ లేనిపోని కట్టుకథలు చెప్పి, మమ్మల్ని మీరు బ్లాక్ మెయిల్ చెయ్యాలనుకున్నారా?" అడిగాడు కపూర్.

"నాన్సెన్స్! ఆ ప్రకాష్ అసాధ్యుడిలాగున్నాడు. అతని ఆట కట్టించేందుకు మనం ముగ్గురం కలసి ఏదైనా ప్లాన్ ఆలోచించాలన్న ఉద్దేశ్యంతో ఇక్కడికి తీసుకొచ్చాను. బ్లాక్ మెయిల్ చెయ్యాలనికాదు!" అన్నాను.

రామారావు కపూర్ కేసి చూశాడు.

కపూర్ కూడా రామారావు వైపు చూశాడు.

ఇద్దర్నీ గమనించసాగాను.

"పాపం నిజంగా మీరు పెద్ద చిక్కుల్లోనే పడ్డారు. మావల్ల మీకేం సాయంకావాలో చెప్పండి. చేస్తాం!' అన్నారిద్దరూ.

"మీకు అవసరం, ప్రయోజనం లేనప్పుడు ఇందులో తలదూర్చడం అనవసరం. నా తిప్పలు నేను పడతాను. మీరు వెళ్ళండి!" అన్నాను ఉడుక్కుంటూ. నాకన్నా వాళ్ళు తెలివిగల వాళ్ళేమోననిపించింది. నేను దూరం ఆలోచించకుండా, వీళ్ళతో కలిసి కట్టుగా వుండి, కట్టు దిట్టమైన పథకం తయారుచేసి ప్రకాష్ పని పట్టించాలని తయారుచేసి ప్రకాష్ పని పట్టించాలని దురాశపడ్డానేమో ననిపించింది కూడా. దానికన్నా, నా రహస్యం వీళ్ళకు చెప్పినందుకు బాధపడ్డాను.

జీవితంలో మొదటసారిగా నా తెలివితేటలపైనున్న నమ్మకం సడలిపోయింది.

మెల్లగా లేచాను.

నాతోపాటు వాళ్ళూ లేచారు.

"రండి! మిమ్మల్ని డ్రాప్ చేసి వెళ్తాను" అన్నాను.

అందరం కారెక్కాం.

"ఎలా గొడవ వెలుపలికి పొక్కకుండా చూసుకోండి! తెలిస్తే అందరూ మిమ్మల్ని చూసి నవ్వుతారు!" అన్నాడు రామారావు ఉచిత సలహా పారేస్తూ.

"ఆమె ఇలాంటి పొరపాటు చేసి వుండవలసింది గాదు!" అన్నాడు కపూర్.

నాకు చిర్రెత్తుకొచ్చింది. జూలీ చేసింది తప్పయినా, వీళ్ళ పెళ్ళాలు చేసిన తప్పులు కప్పెట్టుకొని నా భార్య గురించి వ్యాఖ్యానించడం నాకు నచ్చలేదు.

"ఆమె సంగతి నేను చేసుకొంటాను. ఈ సమస్య మీకు ఎదురయినప్పుడు నా సలహాకు రాకండి. మీ దారి మీరు చూసుకోండి!" అన్నాను.

వాళ్ళేమీ మాట్లాడలేదు.

కారు మా వీధిలోకి రాగానే ఇద్దరూ దిగిపోయారు.

నేను తిన్నగా ఇంటికొచ్చాను.

జూలీ అలానే పడుకుని వుంది. ఆమెను కదపకుండా పైకి వెళ్ళిపోయాను. మెయిన్ డోర్ మూసి గొళ్ళెం పెట్టి.

# 4

ఆఫీసు గదిలోకి అడుగుపెట్టాను మరుసటిదినం.

నా వెనకనే వచ్చింది వనజ.

"మార్నింగ్!" అంది నేను కూర్చోగానే.

"గుడ్ మార్నింగ్! కూర్చో!" అన్నాను.

ఆమె చీర అందంగా సర్దుకుని కూర్చుంది.

"ఎనీ న్యూస్!" అన్నాను సిగరెట్ వెలిగించుకుంటూ.

"మీరు వెళ్ళాక బాస్ ఫోన్ చేశారు. అర్జంటుగా మాట్లాడాలన్నారు. లేరని చెప్పాను. కాస్త చికాకుపడ్డారు. ఏదో అవసరమైన పనిమీద వెళ్ళారని సర్ది చెప్పాను. ఇవాళ వచ్చి కలవమన్నారు. మధ్యాహ్నం ఢిల్లీ వెళ్తారట. వెళ్ళేముందు మిమ్మల్ని చూడాలన్నారు" అంది వనజ.

"అలాగే! మరో అరగంటలో వెళ్దాం!" అన్నాను.

"ఫోన్ చేసి చెప్తాను వస్తున్నామని!" అంది.

"అలాగే!" అన్నాను.

వనజ లేచింది వెలుపలకు వెళ్ళేందుకు.

"జేమ్స్ వచ్చాడా?" అడిగాను.

"వచ్చాడు. పంపనా?" అడిగింది.

"పంపు. అర్జంటుగా మాట్లాడాలి!" అన్నాను.

ఆమె వెళ్ళిపోయింది.

ఆలోచిస్తూ కూర్చున్నాను.

జేమ్సు మా పత్రిక తరఫున పనిచేసే ఇన్వెస్టిగేటర్. ఉక్కునరాల మనిషతను. చూచి రమ్మంటే కాల్చి వస్తాడు. అంతకుముందో డిటెక్టివ్ ఏజన్సీలో పని చేశాడు. చాలా విషయాలపైన నేను రాసిన ఆర్టికల్స్‌కు అవసరమైన సాక్ష్యాధారాల్ని అతనే సంపాదించాడు. అతనికి నేనంటే అభిమానం. నాకూ అతనంటే చాలా గౌరవం.

"మార్నింగ్ సర్!" అంటూ వచ్చి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు జేమ్స్.

"మార్నింగ్. నాకు అర్జంటుగా ఒక పని చేసి పెట్టాలి" అన్నాను.

"ఏం పని చెప్పండి!"

"అభిరామపురంలో వుండే 'తృప్తి' సూపర్ బజారు పేరు బహుశా నువ్వు వినే వుంటావ్! అక్కడ ప్రకాష్ అనే అతను పని చేస్తున్నాడు. కొందరు రాజేష్ అని పిలుస్తారతన్ని. అతన్ని గురించి తెగలిగిన సమాచారం మొత్తం కావాలి నాకు." అన్నాను.

"అలాగే! కానీ దానివల్ల మనకు పెద్ద ప్రయోజనముంటుందనుకోను." అన్నాడు జేమ్స్.

"అంటే..." అతని ఉద్దేశ్యం అర్థంగాక చూశాను.

"మీరివాళ పేపరు చూడలేదా?" అడిగాడు జేమ్స్.

"లేదు! నిద్ర లేచేసరికి లేటయింది."

"మీ సెక్రటరీని తెమ్మనండి. చూద్దురుగాని!"

"నీ మాటల్లో మిస్టరీ నాకు అర్థం కావటంలేదు. ఏముంది పేపర్లో? నువ్వే చెప్పరాదూ!" అన్నాను.

"ఆ ప్రకాష్ అనే వ్యక్తిని వేకువ ఝామున ఎవరో రివాల్వరుతో కాల్చి చంపారుట. పోలీసులు రంగంలోకి

దూశారు. ఇంకా ఏవిధమైన సాక్ష్యాధారాలు దొరక లేదు.'' అన్నాడు జేమ్స్.

''రియల్లీ!'' అడిగాను ఆశ్చర్యంగా.

''అవును.'' అన్నాడు నిశ్చలంగా నా కళ్ళకేసి చూస్తూ.

''అతను చచ్చినంత మాత్రాన, అతన్ని గురించి తెలుసుకోవలసిన అవసరం ఆగదు. నువ్వేలాగైనా నాకు అతని పూర్తి వివరాలు కావాలి! తెస్తావా?'' అడిగాను.

''తెస్తాను. కానీ ఎందుకనేది తెలుసుకోవటం నా అల వాటు. ఆ సంగతి మీకూ తెలుసు.''

''ఇప్పుడిప్పుడే చెప్పలేను. కానీ చెపుతాను సమయం చూసి'' అన్నాను.

జేమ్స్ ఆ విషయం గురించి పట్టుదల వహించలేదు. లేచి వెళ్ళిపోయాడు.

వనజ ఫోన్లో చెప్పింది కారు సిద్ధంగా వుందని.

సూట్ సర్దుకొని, తయారుచేసిన ఆర్టికల్స్ తీసుకుని గది వెలుపలికొచ్చాను.

వనజ రెడీగా వుంది.

నేను ముందూ, ఆమె వెనుకా నడవసాగాం.

ఆమె నడక కూడా అందంగా, అలవోకగా, పిల్లగాలి తెమ్మెరలకు కదిలే పంట చేలపై కనుపించే తెరలుగా వుంటుంది.

ఇద్దరం కారెక్కాం.

కారు ఊరికి మూలగానున్న అన్నానగర్ వైపు పరు గెత్తసాగింది.

'జలాల్ మేన్షన్స్' ముందు ఆగింది.

విశాలమయిన డ్రాయింగ్ రూంలో కూర్చునివున్నాడు జలాల్. అతని వయస్సు యాభై దాటి వుంటుంది. అయినా దిట్టంగా కనుపిస్తాడు. ఆయన శ్రీమతి, మనుమూ బేగం కూడా వుందక్కడే.

"పోయినవారం మీరు పబ్లిక్ వర్క్స్ డిపార్టు మెంటులో లంచాల తీరుతెన్నుల గురించి రాసిన ఆర్టికల్ చాలా బాగా వచ్చింది. నాకు ముఖ్యమంత్రి దగ్గరనుండి నాలుగైగు ఫోన్లు వచ్చాయి. ఇలాంటివి రాయవద్దని ప్రతిమ లాడుతున్నారు. వీలుకాదని చెప్పాను. పోలీస్ డిపార్ట్ మెంటు గురించి నువ్వు తయారుచేసిన వివరాలు చూశాను. బాగున్నాయి. పైవారం దాన్ని ప్రచురించే ఏర్పాటు చేస్తావా?" అడిగాడు జలాల్ నన్ను చూడగానే.

"మరీ అంత తొందరపడడం మంచిది కాదేమోనని పిస్తూంది. మరో రెండు వారాలు ఆగితే ఎలా వుంటుం దంటారు." అడిగాను అనుమానిస్తూ.

"ఏం! ఏమైనా కాంప్లికేషన్స్ ఉన్నాయా?"

"అలాంటివేమీ లేవు! మనదగ్గర వేరే మాటర్ వుంది. అదయ్యాక వేస్తే బాగుంటుందేమోననిపిస్తూంది. అదీగాక పోలీసులతో వ్యవహారం. ఒకటికి రెండుసార్లు, అన్ని విషయాలు తిరిగి సరిజూసుకోవడం మంచిది కూడాను" అన్నాను.

"ఆల్ రైట్! అలాగే కానీ! నేనివాళ ఢిల్లీ వెళు న్నాను. హోం సెక్రెటరీ అర్జంటుగా రమ్మని కబురు పంపాడు. మనదగ్గరున్న వివరాలు బహుశా వాళ్ళకు కావాలనుకుంటాను. వాట్ని ఆధారంగా పెట్టుకొని, అవినీతిపరులపైన కఠినమైన చర్యలు తీసుకోవాలని చూస్తు న్నట్లు తెలిసింది" అన్నాడు జలాల్.

"గుడ్ న్యూస్!" అన్నాను.

"మరో విషయం! నీకు ఇంతకు ముందోసారి చెప్పాను. మనం నడిపే పత్రిక 'భాజా' నడుపుతున్న నేనెంత, అవినీతికీ, ధర్మానికీ దూరంగా వున్నానో, దాని సంపాదకుడివిగా నువ్వూ అలాగే వుండాలి. మనగురించి మరొకరు వేలెత్తి చూపే అవకాశం ఇవ్వగూడదు. అది జరిగిననాడు, మనం ఆత్మహత్య చేసుకోవటం వినా మరో మార్గముండదు. నావల్ల ఏం సహాయం కావలసినా చెప్పు చేస్తాను" అన్నాడు జలాల్.

"నేను బాగున్నాను. నాకేం ప్రస్తుతం అవసరంలేదు!" అన్నాను.

'ఆల్ రైట్! నువ్వెళ్ళవచ్చు!" అన్నాడు జలాల్.

# 5

ఆఫీసుకు తిరిగివచ్చాక నాకు ప్రకాష్ ఆకస్మికమరణం సంగతి గుర్తొచ్చింది.

పోలీసులు కేసులెలా పరిశోధించేది నాకు బాగా తెలుసు. ముందురోజు నా దగ్గరకొచ్చిన విషయం గురించి తెలుసుకోవడం పెద్ద కష్టమేమీ కాదు వాళ్ళకు.

తీరా తెలుసుకొని వచ్చాక, ప్రకాష్ నా దగ్గరకెందుకొచ్చిందీ చెప్పే వీలులేదు. ఆ విషయం చెప్పానంటే ముందు నన్నే అనుమానిస్తారు. అసలే నాపైన పోలీసు డిపార్టుమెంటుకు కోపంగా వుంది. వీలైనన్నివిధాల ఇబ్బంది పెట్టే అవకాశంకోసం ఎదురుచూస్తున్నారు.

బల్లపైనున్న ఫోన్ మ్రోగింది.

రిసీవరు తీశాను.

"మిస్టర్ రఘూ!" అడిగింది అవతలివేపు కంఠం.

"యస్!" అన్నాను నేను.

"నా కంఠం గుర్తుచిక్క లేదా! రామారావును మాట్లాడు తున్నాను" అన్నాడతను.

"మీరా? ఏమిటి విశేషం?" అడిగాను.

"మొత్తానికి నువ్వు గుండెలు తీసిన బంటువయ్యా! ఆ ప్రకాష్‌గాడ్ని శాస్త్రా పైకి పంపించావ్?" అన్నాడు రామారావు.

నాకు ముచ్చెమటలు క్రమ్ముకొచ్చాయి. రాత్రి వీళ్ళతో నా బాధ చెప్పడం తప్పయిపోయిందని తెలిసింది. నన్నే అడగగలిగిన మనిషి మరెవరికైనా ఆ మాటే చెప్ప కుండా వుంటాడన్న గ్యారంటీ ఏమీ కనుపించలేదు.

"ఎవరు చెప్పారు మీకు?" అడిగాను.

"ఒకరు చెప్పడ మేమిటి! నాకు తెలుసుగా?" అన్నాడు రామారావు.

"అయితే ఇప్పుడెందుకు ఫోన్ చేశారు?"

"నీతో బేరం కుదుర్చుకోడానికి."

"బేరమా?" అడిగాను అర్థంగాక.

"అవును. రాత్రికి నిన్న మనం కలుసుకున్న పార్క్‌కు రా! నీ కోసం కాచుకుని వుంటాను పదిగంటల తర్వాత!" అని ఫోన్ పెట్టేశాడు రామారావు.

నాకు తల గిర్రున తిరిగిపోయింది.

ఫోన్ క్రేడిల్ పైన పడేశాను.

రాత్రి నేను తొందరపడకుండా వుండి వుండవలసిం దనిపించింది. ఇప్పుడు దాన్ని గురించి ఆలోచించడంకన్నా, నాకు నేనై ఈ ఊబిలో ఇరుక్కుపోకుండా వుండే మార్గం కోసం అన్వేషించసాగాను.

ఇంటర్‌కామ్ బజర్ మ్రోగింది.

"సార్!" వనజ కంఠం వినిపించింది.

"ఎంత సేపయింది వచ్చి?" అడిగాను.

"ఇప్పుడే! మీతో మాట్లాడాలని సర్కిల్ ఇన్ స్పెక్టర్ ఈశ్వరరావుగారు వచ్చారు. వెయిట్ చేస్తున్నారు. పంపేదా?" అడిగింది వనజ. నా గుండె ఒక్క క్షణం కొట్టుకోవడం మానేసింది.

"ఎందుకొచ్చారో తెలుసా?"

"తెలీదు!"

"ఆల్ రైట్! పంపించు." అన్నాను.

రెండు నిముషాల తర్వాత ఫుల్ యూనిఫాంలో వున్న ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం, గుమ్మంలో ప్రత్యక్షమైంది.

"ప్లీజ్ కమిన్!" అన్నాను కూర్చొనే.

అతను వచ్చి కూర్చున్నాడు నా కెదురుగా వున్న కుర్చీలో.

"మా డిపార్టుమెంట్ గురించి మీకంత సదభిప్రాయం లేకున్నా, మీరంటే వ్యక్తిగతంగా నాకు అంతులేని అభిమానం, గౌరవం వున్నాయి," అన్నాడు ఈశ్వరరావు.

"థాంక్స్!" అన్నాను.

"మీ దగ్గరకోసారి వచ్చి కంగ్రాచ్యులేషన్స్ చెప్పి వెళ్ళాలని చాలా రోజులనుంచి అనుకుంటూ వుండి పోయాను. వీలుకాలేదు. ఇప్పుడో చిన్న పని తగిలి, మీ దగ్గరకు రావలసి వచ్చింది." అన్నాడు ఈశ్వరరావు.

"ఏం పనిమీదొచ్చారు?" అడిగాను.

"తృప్తి, సూపర్ బజార్‌లోని సూపర్‌వైజర్‌గా పని చేసే ప్రకాష్ అనే వ్యక్తిని ఎవరో కాల్చి చంపారు.

అతని గురించి వాకబు మొదలెట్టాం. అతను నిన్న ఇక్క డికి వచ్చి మీతో కొంతసేపు మాట్లాడి వెళ్ళినట్లు తెలిసింది. అతన్ని గురించి మీరేమైనా వివరాలు చెప్ప గలరా?'' అన్నాడు ఈశ్వరరావు.

అతను నా దగ్గరకు రాలేదని బుకాయించి లాభం లేదు. ఏం చెప్పినా నాపైకి అనుమానం రాకుండా చూసుకోవాలని ఆలోచించి నిర్ణయించుకొన్నాను.

''అతనెవరో నాకు తెలీదు! నిన్ననే వచ్చాడు. ఆ సూపర్ బజార్ ప్రైవేట్ వ్యక్తులు నడుపుతున్నారు. అక్కడ కల్తీ సామానులెలా అమ్మేదీ, తూకం తగ్గించి ఎలా ఖాతాదార్లని మోసం చేసేదీ, ఇండియాలో తయారయిన వస్తువుల్నే, పాకింగ్ మార్చి ఫారిన్ గూడ్సు క్రింద ఎలా చెలామణీచేసి అమ్ముతున్నదీ, తనకు తెలుసుననీ, అన్నీ వివరంగా రాసిస్తాననీ అన్నాడు. నన్ను 'భాజా'లో ఆ సమాచారం వివరంగా రాసి ప్రచురించమన్నాడు. దాని వల్ల కనీసం, ప్రజలు జాగ్రత్తపడతారని అతని ఊహ!'' అన్నాను.

''మీరేమన్నారు?'' అడిగాడు ఇన్ స్పెక్టర్.

''చూద్దామన్నాను.''

''అంటే అతనికీ, మేనేజిమెంటుకూ ఏదో రగడ జరిగి వుండాలి. అందుకే అతను వాళ్ళ రహస్యాల్ని రచ్చకీడ్చి, వాళ్ళను అల్లరిపాలు చెయ్యాలని ఆలోచించుకొని, మీ దగ్గరకు వచ్చివుంటాడు. ఈ విషయం తెలిసిన ప్రొప్రయిటర్లు అతన్ని చంపించి వుండాలి! ఏమంటారు?'' అన్నాడు ఈశ్వరరావు నాకేసి చూస్తూ.

''ఏమో? నేనెలా చెప్పగలను'' అన్నాను.

"అతన్ని ఇంట్లోనే కాల్చి చంపారు. మేము ఇల్లంతా తనిఖీ చేశాం. చిన్న ఫోటో స్టూడియో వుంది. ఖరీదైన కెమెరా వుంది. కానీ పాజిటివ్‌లుగానీ, నెగటివ్‌లుగానీ, ఒక్కటీ దొరకలేదు. అతని సామానంతా గాలించాం. లాభంలేకపోయింది. మాకన్నా ముందే సామానన్నీ ఎవరో వెతికినట్లు చిందరవందరగా పడున్నాయి. ఇది విచిత్రంగా లేదూ!" అడిగాడు ఈశ్వరరావు మళ్ళీ.

"ఏది?" అర్థమయినా, కానట్లు నటించాను.

"ఫోటోలూ, నెగటివ్‌లూ, లేకుండటం" అన్నాడు.

"ఆఁ! విచిత్రంగానే వుంది!" అన్నాను.

"సూపర్‌వైజర్‌గా పనిచేసే మనిషి, ఇంట్లో చిన్న ఫోటో స్టూడియో నడపటం, ఇల్లంతా చిందరవందరగా వుండడం, ఎవరో రివాల్వర్‌తో అతన్ని కాల్చి చంపడం లాటివి చూస్తుంటే, బ్లాక్ మెయిలింగ్ కేసులా గూడా అనిపిస్తూంది. కాదంటారా?"

"నేను అనటానికి ఏముంది? వీటిల్లో మీకు అపారమైన అనుభవం వుందిగా!" అన్నాను.

"వస్తానండీ! మీరు మాకు చెప్పటానికి మరచిపోయిన విషయమేదైనా గుర్తొస్తే మాకు ఫోన్ చేయండి. వచ్చి కలుసుకుంటాను." అంటూ లేచి, నాతో కరచాలనం చేసి వెళ్ళిపోయాడు ఈశ్వరరావు.

తలుపు మూసుకున్నాక రక్కన కూలబడ్డాను కుర్చీలో గండం గడిచినందుకు.

ఇంతకూ, ఆ ప్రకాష్ ముందురోజు నాకు చూపించిన ఫోటోలూ, తన దగ్గరున్నాయని చెప్పిన నెగటివ్‌లు ఏమయి వుంటాయని ఆలోచించసాగాను. హత్య చేసిన

మనిషే వాట్ని చేజిక్కించుకొని వుండాలి. అంటే నా రహస్యం కూడా అతని చేతుల్లో వుంది. పోలీసులకన్నా ముందు నేను హంతకుణ్ణి పట్టుకోవడం అవసరమనిపించింది. దానికి తగిన ప్రయత్నాలెలా చెయ్యాలని ఆలోచించసాగాను.

## 6

మళ్ళీ ఫోన్ మ్రోగింది.

అయిష్టంగా, అలసటగా, భయంతో అందుకున్నాను రిసీవరు.

"మీ మిసెస్ లైన్లో వుంది. కనెక్ట్ చేసేదా?" అడిగింది వనజ.

"ఊఁ!" అన్నాను.

మరుక్షణంలో జూలీ కంఠం వినిపించింది "హల్లో" అంటూ.

"ఆఁ! నేనే! ఏమిటి హడావుడి?" అడిగాను.

"మీ రివాల్వరు ఎక్కడ పెట్టారు?" అడిగింది జూలీ.

"నా గదిలో బీరువాలో."

"అది మన ఇంటిముందున్న తోటలో పూలమొక్కల మధ్య దొరికింది. తెరచిచూస్తే అందులో ఒక తూటా తక్కువుంది" అంది జూలీ.

"నోర్ముయ్! ఈ విషయం ఫోన్లోనా చెప్పేది. నే వస్తాను. అందాకా నోరుమూసుకుని వుండు!" అన్నాను కంగారుపడుతూ.

"సరే! త్వరగా రండి!" అంటూ ఫోన్ పెట్టేసింది.

నా కణతలు వేడెక్కాయి. ఈశ్వరరావు వచ్చి ప్రకాష్‌ను రివాల్వరుతో ఎవరో కాల్చిచంపారని చెప్పాడు. ఇప్పుడు నా రివాల్వరులో ఒక తూటా తక్కువుందని జూలీ ఫోన్ చేసింది.

నా మెడచుట్టూ ఎవరో పెద్ద ఉరి బిగిస్తున్నట్లు అర్థం చేసుకొన్నాను.

నాకున్న ఒకే ఒక ఆశాకిరణం జేమ్స్. అతను సంపాదించుకొచ్చే సమాచారంలోంచే, హంతకుడెవరయి వుంటాడో ఊహించాలి నేను. అతన్ని పోలీసులకు పట్టివ్వాలి. అంతకుముందుగానే అతనివద్దనున్న ఫోటోల్ని కాజెయ్యాలి. ఇదీ నా ప్లాను. ఎంతదాకా నెరవేరుతుందో నమ్మకంగా మాత్రం తెలియటంలేదు.

వనజ లోనికి వచ్చింది.

నా అనుమతికోసం ఎదురు చూడకుండానే కూర్చుంది.

ఆమె ప్రవర్తన వింతగా తోచింది. ఆశ్చర్యపోతూ ఆమెకేసి చూశాను.

"మీ రెందుకో కంగారుపడిపోతున్నారు. అది వ్యక్తిగత విషయమే అయినా, సెక్రటరీగా, మీ మంచి చెడ్డలు చూడటం నా విధి. నా అవసరం ఏదన్నా వుంటే చెప్పండి. సాయం చేస్తాను!" అంది వనజ.

మాట్లాడకుండా చూశాను ఆమెకేసి.

"ఆ ప్రకాష్‌ను మీరు హత్యచేశారా?" అడిగింది సూటిగా వనజ.

"లేదు!" అంటూ "అయినా ఇదంతా నీకెలా తెలిసింది?" అడిగాను కోపంగా.

"మీ సెక్రెటరీని, అవసరం లేకున్నా తెలుస్తాయి కొన్ని. రివాల్వరు గురించి మీ ఆవిడ ఇంతకుముందు నాతోనే గడగడ వాగేసింది. నాకు తెలిసిన మరికొన్ని విషయాలు చెప్తాను. వినండి. ప్రకాష్ హత్య పాయింట్ ముప్ఫయి ఎనిమిది కాలిబర్ రివాల్వరుతో జరిగింది. మీ

రివాల్వరు కూడా ఆ జాతిదే! ముందు దాన్ని వదలించు కోవడం వివేకమనిపించు కుంటుంది'' అంది వనజ.

నిముషనిముషానికీ నా రహస్యం తెలిసినవాళ్ళు ఎక్కువ కావడం నాకు కంపరం కలిగింప జేస్తూంది.

''అవును'' అన్నాను నెమ్మదిగా.

''అఁ! అదీ మీరు ప్రయత్నిస్తే ఎవరైనా పట్టుకోవచ్చు. అందువల్ల దాన్ని తెచ్చి నాకివ్వండి. నేను ఊరవతల ఏ మురుగు కాల్వలోనో పారేస్తాను!'' అంది వనజ.

ఆమె నాకోసం అంతసాహసం చేసేందుకు సిద్ధమవడం సంభ్రమంలో ముంచెత్తింది.

''వద్దు! అనవసరంగా నా గురించి మీరు లేనిపోని గొడవల్లో చిక్కుకోవటం నాకిష్టంలేదు!'' అన్నాను.

''నాకు మీరంటే ఇష్టం. అందుకనే ఇష్టపడుతున్నాను కష్టాలనైనా కొని తెచ్చుకోవడానికి'' అంది వనజ.

''నాకు పెళ్ళయింది!'' అన్నాను, నావల్ల ఆమె పొంద గలిగేదేమీ లేదని చెప్తూ.

''నాకు కాలేదు! అయినా నాకు మీపైనున్న ఇష్టం పెళ్ళిని ఆశించేది కాదు! అదోరకం పిచ్చి. నా దృష్టిలో మీరో హీరో! హీరోలను పూజించే మనస్తత్వం నాది. ఐ వర్‌షిప్ యూ!'' అందామె.

''ఎక్కడకు తెచ్చిమ్మంటావ్?''

''ఎక్కడికో వద్దు! ఇప్పుడు ఇంటికివెళ్ళి పట్రండి. నాకు ఇచ్చేసి, మీరు నిశ్చింతగా నిద్రపోండి!'' అంది వనజ.

''ఓ. కే!'' అంటూ లేచాను.

# 7

ఇల్లు చేరేసరికి జూలీ ఆత్రుతగా ఎదురుచూస్తూంది.

"ఎక్కడ పెట్టావ్?" అడిగాను ఆమెను.

"కనుపించిన చోటే వదిలేశాను" అంది జూలీ.

"పద! చూపించు" అన్నాను.

ఆమె ముందు నడిచింది. నేను వెంట వెళ్ళాను. గులాబీ చెట్టు మొదట్లో నల్లటి రివాల్వరు పడుంది. జేబురుమాలు మడతలువిప్పి దానిపైన వేశాను. రుమాలుతోనే పట్టుకొని అలాగే కోటుజేబులో పెట్టుకున్నాను.

"రాత్రి నీతో తాగితందనాలాడిన వాళ్ళల్లో ఎవరైనా దీన్ని దొంగిలించుకు పోయుంటారా?" అడిగాను.

"ఛీ! మీదంతా అనుమానం. వాళ్ళలాంటి మనుషులు కాదు!" అంది జూలీ.

"నోర్ముయ్! నువ్వూ, వాళ్ళూ అంతా దొంగలే! దువ్వెనలు, పౌడరు సీసాలు దొంగిలించగలిగిన వాళ్ళకు రివాల్వరు దొంగిలించడం పెద్ద విషయం కాదు!" అన్నాను.

"దీంతో అవసరం ఏముంది?"

"నీలాగే వాళ్ళనూ ఫోటోలు తీశాడు ప్రకాష్. డబ్బిమ్మని బెదిరించి వుంటాడు. ఇవ్వకుంటే వాళ్ళ భర్తల దగ్గర బేరం పెడతానని చెప్పివుంటాడు. దాంతో బెదిరి ఈ పనికి పాల్పడి వుంటారు" అన్నాను.

"ఏమో?" అంది జూలీ ఎటూ తేల్చుకోలేక.

"ఆ గొడవలు నాకు వదిలెయ్యి. నువ్వు ఎవ్వరితో అనకు. మన పరువు బజారున పడుతుందని మాత్రమే భయపడ్డాను ఇంతదాకా! ఇప్పుడు మనం కూడా జైల్లో పడేట్లుంది."

"మనం అంటే ఇద్దరమూనా? నాకేం కర్మ! నేను ఎవ్వర్నీ చంపలేదు!" అంది జూలీ.

దానికేమీ సమాధానం చెప్పలేదు. ఆమెతో మాట్లాడటం కూడా అనవసరమనిపించింది. కారెక్కి మళ్ళీ ఆఫీసుకేసి పోనిచ్చాను. ఇరవై నిముషాల్లో ఆఫీసు చేరుకున్నాను.

అప్పటికే గంట ఐదుదాటింది. అందరూ వెళ్ళిపోయారు. వనజ గదికేసి చూశాను. టైప్ చేసుకుంటూ వుంది. తిన్నగా నా గదిలోకి వెళ్ళి ఇంటర్‌కామ్‌లో పిలిచాను. ఆమె వచ్చింది.

జేబురుమాలులో చుట్టిన రివాల్వరు తీసి అలానే పెట్టాను టేబుల్ పైన. ఆమెకూడా దాన్నలాగే తీసుకుని హ్యాండ్‌బాగ్‌లో దోపుకుంది.

"జాగ్రత్త!" అన్నాను.

"నాకు మరీమరీ చెప్పనవసరం లేదు! మీరు నిశ్చింతగా వుండండి!" అంటూ లేచి వెళ్ళిపోయింది.

నా గుండెలు చక్కబడ్డాయి. పైనున్న పెద్ద బరువేదో తొలగిపోయినట్లు తేలికగా అనిపించింది.

# 8

అందరూ వెళ్ళిపోయినా నేనేదో పనున్నట్లు ఆఫీసులోనే కూర్చున్నాను. నిజానికి నాకు పెద్ద పనిలేదు. ఇంటికి వెళ్ళడానికి మనస్కరించలేదు. జేమ్స్‌కోసం ఎదురు చూస్తున్నాను. అతను వచ్చి చెప్పగలిగే వివరాలపైనే నా భవిష్యత్తు ఆధారపడి వుంది.

గంటలు ముందుకు జరుగుతున్నాయి.

వాచీ చూసుకున్నాను. ఎనిమిదైంది.

జేమ్స్ వస్తున్న జాడమాత్రం లేదు. అతని ఇంటి అడ్రసు నాకు తెలుసు. వెళ్దామనుకున్నాను. గబగబ కాగితాలన్నీ సర్ది, సూట్ తొడుక్కుని, బ్రీఫ్ కేస్ చేత పెట్టుకొని, ఆఫీసు వెలుపలికొచ్చి కారెక్కాను.

కారు రివ్వున దూసుకుపోసాగింది టి. నగర్ వైపు. రామన్ స్ట్రీట్‌లోని పదహారవ నెంబరు ఇంటిముందు ఆపాను కారు. దిగి లోనికివెళ్ళి, వరండాలోంచి వున్న మెట్లెక్కి పైకి వెళ్ళాను.

జేమ్స్ గది తలుపులు లోపలనుండి మూసివున్నాయి. లైటు వెలుగుతూంది. దాని కాంతి, తలుపు పైనున్న వెంటిలేటరు ద్వారా నడవాలో పడుతూంది.

మెల్లగా తలుపు తట్టాను.

"ఎవరు?" అడిగిందో ఆడగొంతు లోనుంచి.

"జేమ్స్‌కోసం వచ్చాను. ఉన్నాడా?"

"లేదు! మీ రెవరో చెప్పండి" అంది అదే గొంతు మళ్ళీ.

"నా పేరు రఘు! 'భాజా' పత్రిక ఎడిటర్ని" అన్నాను.

"అతనొచ్చాక చెప్తాను" అందా గొంతు మళ్ళీ.

జేమ్స్ బాచెలర్ గా వున్నాడు. అతనికి పెళ్ళికాలేదు. అతని గదిలోకి ఆడమనిషి ఎలా వచ్చిందాని ఆశ్చర్య పోయాను. ఒక వేళ అతని చెల్లెలో, బంధువుల అమ్మాయో, అయివుండవచ్చనుకుని, ఆమెగురించి ఆలోచనలు మాని "ఎప్పుడొచ్చేదీ చెప్పాడా జేమ్స్!" అడిగాను.

"లేదు!" అందామె తలుపు తెరవకుండానే.

ఇది కొంత వింతగా తోచింది నాకు. అంతలోనే సర్దు కున్నాను, రాత్రిళ్ళు పరాయి మగవాళ్ళతో ఒంటరిగా

వుండి మాట్లాడేందుకు ఆమె భయపడుతుందేమోనని.

"వెళ్ళొస్తాను!"అని చెప్పి క్రిందికొచ్చి కార్లో కూర్చున్నాను.

పదిగంటలకుపైన మళ్ళీ నాకు ఎంగేజిమెంటుంది రామారావుతో. అందాకా వేరేపనేం లేదు. కార్లోనే కూర్చుని వెయిట్ చేద్దామని అనుకున్నాను జేమ్సుకోసం.

సిగరెట్ కాల్చుకుని కూర్చున్నాను.

అరగంటపైనే గడిచింది.

చుట్టుప్రక్కల మేడల్లో వున్నవాళ్ళు నన్నూ, నా కారును చూస్తున్నట్లు అనుమానం వేసింది.

జేమ్స్ వుంటున్న ఇంట్లోంచి ఒక ఆడమనిషి రావడం గమనించాను. ఆమె లైటు క్రిందకు రాగానే పోల్చుకున్నాను. నా కళ్ళు బైర్లు క్రమ్మాయి. ఆశ్చర్యంతో అవాక్కయిపోయాను.

ఆమె ఎవరో కాదు! రామారావు భార్య రజని. ఆమె ఆమె జేమ్స్‌వద్ద కెందుకొచ్చిందాని ఆశ్చర్యపోయాను! బహుశా ఇద్దరికీ సంబంధముండి వుండాలి!

రోడ్డెక్కింది నడుస్తూ.

నేను కారు స్టార్టు చేసి ముందుకు పోనిచ్చి ఆమె వోరగా ఆపాను. ఆమె నాకేసి చూసింది. గజగజ వణికిపోయింది.

"కారెక్కండి! మిమ్మల్ని ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాను.

"అఖ్ఖర్లేదు!" అంది రజని.

"అలా అనకండి! మనం చాలా మాట్లాడుకోవాలి! అలా నాతో మాట్లాడనంటే మీ రహస్యం కాపాడుతా

నని హామీ ఇవ్వలేను!'' అన్నాను.

ఏమనుకొందో తప్పుకొన కారెక్కింది.

ముందుకు పోనిచ్చాను.

''జేమ్స్ నీ ప్రియుడా!'' అడిగాను.

అవుననిగానీ, కాదనిగానీ అనలేదు.

''ఆ విషయంలో నాకు ఇంటరెస్టులేదు! ప్రకాష్‌ను నీకు తెలుసుగదూ?''

''తెలుసు!'' అంది రజని.

''నిన్ను బెదిరించాడా?''

''ఊఁ!''

''ఎంతివ్వమన్నాడు?''

''పాతిక వేలు!'' అంది రజని తలొంచుకొనే.

''మీవారి కీ విషయం తెలుసా?''

''జేమ్స్ విషయం తెలీదు! ప్రకాష్ సంగతి తెలుసు. నేనే చెప్పాను. డబ్బివ్వమన్నాను. ఆయన ఇవ్వనన్నాడు. వాడ్ని తనతో మాట్లాడమన్నాడు.''

''అతనితో చెప్పావా ఆ విషయం?''

''చెప్పాను!''

''ప్రకాష్ కలుసుకున్నాడా మీవార్ని!''

''ఆఁ!'' అంది రజని.

కారు పోతూనే వుంది.

''కపూర్ భార్య షీలాను కూడా బెదిరించాడా ప్రకాష్?''

''బెదరించాడు. కానీ ఆమె గుట్టు చప్పుడు కాకుండా డబ్బిచ్చింది. భర్తకు కూడా తెలియనివ్వలేదు!'' అంది రజని.

"అసలీ పాడు పనులు మీరెందుకు చేశారు?" అడిగాను విసుగ్గా, కారును కాస్త స్లోచేసి.

"ఇలా చెయ్యడంలో పెద్ద థ్రిల్ వుంటుంది. దొంగతనంగా వస్తువు తీసుకొని దాచి షాపు వెలుపలకు వచ్చేదాకా కలిగే భయం, ఆ తర్వాత వెలుపలికొచ్చాక అనుభవించే ఆనందం, అంత సాహసం చేసి సాధించిన వస్తువును చూసుకున్నాక మనస్సుకు కలిగే ఆహ్లాదం వర్ణనాతీతం. మా ఫ్రెండ్ లీనా ప్రోత్సాహం. కాని ఫలితం ఇలా వుంటుందనుకోలేదు" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"ఆ ప్రకాష్‌ను ఎవరు చంపారో తెలుసా?"

"తెలీదు!"

"పోనీ ఎవరు చంపివుంటారో ఊహించగలవా?"

"అదే నా ఊహాకందని విషయం!"

"ఆఖరి ప్రశ్న అడుగుతున్నాను. నిజం చెప్పు. రాత్రి నువ్వు మా యింట్లో వున్నావ్. వెళ్ళేముందు నా గదిలో బీరువాలో దాచిన రివాల్వరు దొంగిలించుకుపోయావా?" అడిగాను.

"లేదు!" అంది ఖచ్చితంగా.

"పోనీ షీలా చేసి వుంటుందా?"

"తెలీదు! బాగా మత్తులో వున్నాను."

అంతలో మా యిళ్ళున్న రోడ్ వచ్చింది. ఆమెను వాళ్ళ ఇంటిముందు డ్రాప్ చేశాను. కార్ను ముందుకు పోనిచ్చాను. ఇంటికి తాళం వేసుంది. జూలీ ఎటు వెళ్ళిందాని ఆలోచించసాగాను. కాసేపు తోటలో చెట్లమధ్య తచ్చాడాను.

# 9

నా మెదడు పదునెక్కింది. రజని చెప్పిన సమాచారం ఆధారంగా ఆలోచనలు రేగుతున్నాయి.

వీళ్ళ స్నేహితురాలు లీనా అందర్నీ దొంగతనాలకు ఎందుకు ప్రోత్సహించింది?అందులో ఆమె స్వార్థమేమైనా వుందా? ఊహించాను. ఆ ప్రకాష్‌కూ, లీనాకు సంబంధముండి వుండాలి! అతనికి కేసులు చూపించేందుకే లీనా ఇలాంటి పథకం తయారుచేసి వుంటుందనుకున్నాను.

ఓమారు లీనాను కలుసుకుంటే...!

అదే సరయిన మార్గమని తోచింది. కారెక్కి రామారావు ఇంటికెళ్ళాను.

బజ్జర్ నొక్కగానే రజని వచ్చింది.

నన్ను చూసి భయంతో కంపించిపోయింది.

"రామారావు లేడుగా?" అడిగాను.

"లేడు!" అందామె.

"లీనా అడ్రసు కావాలి!" అన్నాను.

చెప్పింది రజని.

వెలుపలకొచ్చి కారెక్కాను.

రజని చెప్పిన అడ్రసుకు పోనిచ్చాను. అదో చిన్న పెంకుటిల్లు. తట్టాను తలుపు. వెంటనే తెరుచుకున్నాయి. బజారురకం మనిషిలాంటి స్త్రీ ఎదురుగా నిలుచుంది.

"లీనా నువ్వేనా?" అడిగాను.

"యస్! మీరెవరు?"

"చెప్తాను!" అంటూ లోనికి నడిచాను.

ఇద్దరం కూర్చున్నాం. నా గురించి చెప్పుకొన్నాను.

"ఆ ప్రకాష్ తెలుసా?" అడిగాను.

"తెలుసు! నా ప్రియుడతను."

"అతను తీసిన ఫొటోలు, నెగటివ్‌లు ఏమయినాయి?"

"నీకెక్కువాలా?"

"కావాలి?"

"ఎంతిస్తావ్?"

"ఎంత కావాలి?"

"ముందు అడ్వాన్సుగా నాకో బాటిల్ బ్రాందీ కావాలి! అది త్రాగాక మాట్లాడుదాం?" అంది లీనా.

"బార్‌కు పోదామా?" అన్నాను.

"పద!" అంటూ లేచింది.

ఇద్దరం కారెక్కి బార్‌కొచ్చాం! రెండు బాటిల్స్ ఖాళీచేసింది లీనా. ఇద్దరం తిరిగి గదికొచ్చాం.

"ఆ ఫొటోల సంగతేమిటి?" అడిగాను.

"ఇస్తాను! ఫ్రీగా యిస్తాను. కానీ నువ్వు నాకో సాయం చెయ్యాలి. వీటికన్నా ఖరీదైన ఫొటోలు నెగటివ్ లున్నాయి. ప్రకాష్ నాకిచ్చాడు. వాట్ని ఆంధ్రా బ్యాంక్ సేఫ్టీ లాకర్‌లో దాచాను. వాట్ని కాస్త అమ్మి పెట్టాలి. దాదాపు రెండు లక్షలన్నా వస్తుంది. ఆ డబ్బు నాకివ్వు. నీ ఫొటోలు ఇచ్చేస్తాను!" అంది లీనా.

"నన్ను, నీ వ్యాపారంలోకి దింపుదామనా?" అడిగాను.

"కాదు! నేను నీకు సాయం చెయ్యవలసిన అవసరం ఉన్నప్పుడు, నువ్వు నాకు సాయంచేసేందుకు వెనుకాడకూడదు! ఏమంటావ్?" అడిగింది లీనా.

"ఎవరికమ్మాలి?" అడిగాను.

"మీ పత్రిక యజమాని జలాల్‌కు. ఆ ఫొటోలు అతనికి సంబంధించినవి" అంది లీనా.

"అందులో వున్న స్త్రీ ఎవరు?"

"నేను చెప్పను. నువ్వే చూడు ఫొటోలు. తెలుస్తుంది!" అంది లీనా.

"అతను నా బాస్! అతనితో ఎలా మాట్లాడగలను?" అడిగాను.

"నువ్వయితే ఎవ్వరూ అనుమానించరు? అందుకే ఈ పనికి సరయిన మనిషివనిపిస్తూంది" అంది లీనా.

వేరే ఆలోచించే అవకాశం కనుపించలేదు.

ఆమె దగ్గర బ్యాంక్ కు ఆథరైజేషన్ లెటర్ తీసుకున్నాను. మరుసటిదినం వస్తానని చెప్పి బయలుదేరాను.

"ఆ డబ్బుతో పారిపోదామని ప్రయత్నించావంటే నీ బ్రతుకు రచ్చకీడ్చే ఫొటోలు నా దగ్గరున్నాయి. మరచిపోకు!" హెచ్చరించింది లీనా.

మాట్లాడకుండా కారెక్కాను.

రామారావు గుర్తొచ్చాడు. కారును పార్క్ కేసి పోనిచ్చాను.

"ఎందుకు కలుసుకోవాలని పిలిచారు?" అడిగాను ఎదురుగా కూర్చుంటూ.

"ఆ ప్రకాష్‌ను హత్యచేశావ్! చాలా సంతోషం, మరి మా ఫొటోలు ఇచ్చెయ్యి. నీకో కానుక ఇస్తాను!" అన్నాడు రామారావు.

"ఏమిటది?" అడిగాను.

"నువ్వు కాల్చిన తూటా ప్రకాష్ గుండెల్లోంచి వెలుపలకొచ్చి పడింది. పోలీసులకన్నా ముందు నేనే దాన్ని పట్టుకొన్నాను. నీ కోసం తెచ్చాను. ఫొటోలు ఇస్తే, దాన్ని నీకిస్తాను. లేకుంటే తిన్నగా పోలీసులకందజేస్తాను!" అన్నాడు రామారావు.

"దాన్ని తెచ్చావా?" అడిగాను.

"లేదు! నీ దగ్గర ఫోటోలు సిద్ధంగా వుండవని తెలుసుగా. అందుకని తేలేదు!" అన్నాడు.

"దాన్ని నీ దగ్గరే వుంచు! రేపు కలుద్దాం! నేను వాటి కోసమే ప్రయత్నం చేస్తున్నాను. దొరకగానే ఇస్తాను" అంటూ లేచాను. అతనూ లేచాడు. ఇద్దరం కారెక్కాం. రామారావును ఇంటిదగ్గర డ్రాప్ చేశాను. నేను ఇంటికి వెళ్ళి పడుకున్నాను. జూలీ అంతకుముందే మత్తుగా పడి నిద్రపోతూంది.

# 10

తెల్లారాక, జూలీ నిద్రపోతూండగానే బయలుదేరాను. తిన్నగా జేమ్స్ ఇంటికి వెళ్ళాను.

నే వెళ్ళేసరికి కాఫీ త్రాగుతున్నాడు.

నన్ను చూడగానే నవ్వి" రాత్రి నేనొచ్చేసరికి బాగా లేటయింది. అందుకని మిమ్మల్ని కలుసుకోలేదు!" అన్నాడు.

"నేను చెప్పిన పనేమైనా చేశావా?" అడిగాను.

తను తెలుసుకొంది క్లుప్తంగా చెప్పాడు. లీనా గురించి కూడా చెప్పాడు. అతనివల్ల నాకేం క్రొత్త సమాచారాలు తెలియలేదు.

అక్కడ్నుంచి బ్యాంకుకు వెళ్ళి, సేఫ్టీ లాకర్ లోంచి కవరు తీసుకొన్నాను. కవరుతో సహా తిన్నగా ఆఫీసు చేరుకున్నాను.

విజిటర్స్ రూంలోనే ప్రత్యక్షమైనాడు సర్కిల్ ఇన్ స్పెక్టర్ ఈశ్వరరావు. అతన్ని చూసి భయం పుట్టింది.

"రండి!" అంటూ గదిలోకి పిలుచుకుపోయాను.

నా వెంట వచ్చాడతను.

"మళ్ళీ ఒక హత్య జరిగింది!" అన్నాడు కూర్చుంటూ ఈశ్వరరావు.

"ఎవర్ని హత్య చేశారు?"

"లీనా అనే అమ్మాయిని. ఆమె ప్రకాష్ ప్రియురాలు. అతన్ని చంపిన రివాల్వరుతోనే, ఈమెనూ చంపారు. ఆ రివాల్వరు పరిశోధనపైన మీదని తేలింది. అందుకే వచ్చానిక్కడకు" అన్నాడు.

"చిత్రంగా వుందే! నా రివాల్వరు నా యింట్లో బీరువాలో వుండాలి!" అన్నాను.

"ఉందో, లేదో తెలుసుకుంటారా?" అడిగాడు.

వెంటనే యింటికి ఫోన్ చేశాను.

జూలీ లైన్లోకి రాగానే ఈశ్వరరావు చెప్పిన వివరాలు చెప్పి, రివాల్వరుందో లేదో చూడమన్నాను. రెండు నిమిషాల తర్వాత ఆమె లేదని చెప్పింది. ఆ విషయం ఈశ్వరరావుకు చెప్పాను.

"ఎవరికైనా ఇచ్చారేమో గుర్తుంచుకోండి!" అన్నాడు ఈశ్వరరావు అనుమానంగా చూస్తూ.

"లేదు! ఆ మధ్య ఒకమారు సర్వీస్ చేయిద్దామని తెచ్చాను. మళ్ళీ తిరిగి బీరువాలో పెట్టానో లేదో తెలీదు. బహుశా కారు డాష్‌బోర్డులో మరచిపోయి వుంటానేమో?" అన్నాను.

"ఎన్నాళ్ళయింది జరిగి?"

"నాల్రోజుల నాటి మాట."

"ఎక్కడెక్కడో తిరిగుంటారు. కార్ను ఎన్నో చోట్ల పార్కు చేసుంటారు? ఎవరైనా దొంగిలించే అవకాశం వుంది. ఎవర్నని అనుమానించడం? మీరు ఆలోచించండి.

ఎవరిపైనన్నా అనుమానం కలిగితే తెలియపరచండి. మా ప్రయత్నాలు మేమూ చేస్తాం!'' అన్నాడు ఈశ్వరరావు లేస్తూ.

"అలాగే!'' అన్నాను.

"నాదొక చిన్న సలహా! నిజం నిప్పులాంటిది. దాచు కున్న కొద్దీ గుండెల్ని కాల్చివేస్తుందది. అది మంటలా మండి అందరికీ కనుపించేముందే, వెలికి చెప్పి ఆర్పుకోవడం, వివేకం! ఇదీ ఆలోచించండి!'' అని వెళ్ళిపోయాడు.

నాపైన అతనికేదో అనుమానముందనిపించింది.

నేను రివాల్వరును పారెయ్యమని వనజకిచ్చిన వైనం గుర్తొచ్చింది. ఆమె పారేసుంటే అది ఎవరికో చిక్కి వుండాలి. దాంతో మళ్ళీ లీనాను హత్య చేసివుండాలి!

ఎక్కడో పారేసిన రివాల్వరు, లీనాను చంపవలసిన అవసరం వున్న వ్యక్తికి మాత్రమే దొరకటం కాకతాళీయ మేమో ననుకున్నాను. నా మెదడింకా వేగంగా ఆలోచించసాగింది.

ఇంటర్ కామ్ లో పిలిచాను వనజను. ఆమె లోని కొచ్చింది. కూర్చోమన్నట్లు చేత్తో సంజ్ఞ చేశాను. కూర్చుందామె.

"నిన్న నీకిచ్చిన రివాల్వరు ఏం చేశావ్?'' అడిగాను.

"మీతో చెప్పాగా, కూం నదిలో పారేశాను!'' అంది వనజ.

"ఆ మాట నిజమేనా?'' అడిగాను.

"మీ కెందుకొచ్చిందా అనుమానం!''

"ఆ రివాల్వరుతో ఇవాళో హత్య జరిగిందని తెలిసింది!''

ఆమె మొఖంలో రంగులు మారిపోయాయి. తలుపు

తోసుకొని జేమ్స్ లోనికొచ్చాడు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి.

"మిస్టర్ రఘూ! నువ్వు నిన్న లీనాను కలుసుకున్నావ్ కదూ!" అడిగాడు.

"నీకెవరు చెప్పారు?"

"అవసరముంది గాబట్టి తెలుసుకున్నాను."

"అయితే ఏమంటావ్?"

"ఆమె నీకు ఫొటోలిచ్చింది కదూ!" అడిగాడు మానంగా. నాకు ఈ గొడవంతా కాస్త కాస్త అర్థమైంది.

"ఇచ్చింది" అన్నాను.

"అవి కావాలి!" అన్నాడు జేమ్స్.

"నా దగ్గర లేవు" అన్నాను.

"మర్యాదగా ఇచ్చెయ్యి. లేకుంటే..." అంటూ జేబులోంచి రివాల్వరు తీశాడు జేమ్స్.

దాన్ని చూడగానే నాకు మతిపోయింది. కారణం ఆ రివాల్వరు నాది కావటం.

"ఇక్కడే వున్నాయి. ఇస్తాను. తీసుకో!" అన్నాను.

అతను రివాల్వరు దించాడు.

నేను బ్రీఫ్ కేస్ తీసి కవరు వెలుపలకు లాగాను. దాని ఫ్లాప్ ఊడదీసి ఫొటోలు చేతికి తీసుకున్నాను.

వాటిలో వనజా, జలాల్ వున్నారు. అన్ని ఫొటోలు దాదాపు ఒకే రకమైన గదిలో తీసివున్నాయి.

నాకు పిచ్చిపట్టేటట్లు వుంది.

అతనా ఫొటోలను లాక్కున్నాడు.

"ఈ ఫొటోలకోసం జలాల్ ఆదేశం పైన నేనూ, వనజా, కొన్ని రోజులనుంచి ప్రయత్నిస్తున్నాం. నిన్ను జైలుకు పంపించడం, ఫొటోలు చేజిక్కించుకోవడం

రెండూ ఒకే దెబ్బకు జరగాలన్నాడు జలాల్. రివాల్వరు దొంగిలించాం, నేను ప్రకాష్ దగ్గరకు వెళ్ళి బెదరించాను. అతను ఫోటోలు ఇవ్వలేదు. కాల్చిపారే కాను. ఆ తర్వాత ఇల్లంతా వెతికాను. ఒక్కటీ కనుపించ లేదు. రివాల్వరు తెచ్చి నీ యింట్లో వేశాను. దాన్ని నువ్వు వనజకిచ్చావ్. లీనా అంతు తేల్చుకోనేందుకు అది మళ్ళీ ఉపయోగిస్తుందని తీసుకుని వెళ్ళాను. భయపెట్టాను. రివాల్వరు చూపించేసరికి భయపడి మొత్తం నీ కిచ్చినట్లు చెప్పింది. అందుకే వచ్చాను. ఈ రివాల్వరు పోలీసులకు చేరే ఏర్పాట్లు చేసి వుంచాను. దాంతో నువ్వు జైలుకు పోతావ్. కేసు ముగుస్తుంది.'' అన్నాడు జేమ్స్.

నాకు వనజపైనే కాదు, మనుషులందరిపైన అసహ్యం వేసింది. ఇలాంటి నీచుల మధ్య వుండటంకన్నా, చెయ్యని నేరం సాకుతో, జైల్లో వుండటమే మేలనిపించింది.

అదే నిముషంలో తలుపు తోసుకొని లోనికొచ్చాడు ఈశ్వరరావు, చేతిలో రివాల్వర్ తో. జేమ్స్, వనజ నివ్వెర పోయారు.

నేను ఏ విషయమూ పట్టించుకోకుండా అలాగే కూర్చు న్నాను. నా మెదడు ఎప్పుడో మొద్దుబారిపోయింది.

మరో నిముషంలో జేమ్స్‌ను చొక్కా పట్టుకుని బైటకు లాక్కుపోతూన్న ఈశ్వరరావుని మాత్రం గమ నించాను.

ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నట్లు లెటరు రాసి, సీట్లోంచి, బయటికి కదిలాను.

—: ఐ పో యిం ది :—

# రహస్యం కావాలి!

## కురుమద్దాలి విజయలక్ష్మి

సాయంత్రం ఆరుగంటల సమయం—

స్ట్రీట్ లైట్స్ గప్పున వెలిగాయి.

రంగూన్ పెద్ద బజారు ఆ వెలుగులో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. ఉండి ఉండి తుప్పర పడుతున్నది. అయినా షాపులు కిటకిటలాడుతున్నాయి. బజారులో జనం, షాపుల్లో జనం నేల ఈనినట్లున్నారు.

రెయిన్ కోటు ధరించి, చప్పుడు చేయని మెత్తని బూట్లు, తలపై ఈవెనింగ్ హేటు, చేతిలో బరువుగా ఉన్న సూట్ కేసు. వేగంగా ముందుకు అడుగులేస్తున్నాను.

ఎవరయినా నన్ను గమనిస్తారేమో అని, టోపీ ముఖం మీదకు లాక్కొని తలవంచుకుని ముందుకు సాగాను.

అరగంట నడిచి చిన్న సందులోకి ప్రవేశించాను.

పేరుకి చిన్న సందయినా జనం రాకపోకలు ఎక్కువ గానే ఉన్నాయి. చైనావాడు నడుపుతున్న చిన్న హోటల్ ఎక్కడో, అని గమనిస్తూ పది అడుగులు వేశానో, లేదో ఆ హోటల్ కనపడింది.

హోటల్ ముందున్న నాలుగు మెట్లు ఎక్కి హోటల్లో ప్రవేశించాను.

హోటల్ అంత రష్‌గా లేదు.

నన్ను చూస్తూనే బట్లర్ చకచక నా వద్దకు వచ్చాడు. "రండి సార్! మీకు కావలసినవి వేడిగా రెడీగా ఉన్నాయి" అన్నాడు వినయంగా.

చేతినిండా పనిలేని బట్లర్‌ని చూస్తుంటే, హోటల్ పరిస్థితి అంతంత మాత్రంగా నడుస్తున్నదని తెలిసి పోతున్నది.

నాకేం అక్కరలేదు అన్నట్లు చిరునవ్వుతో తల అడ్డంగా తిప్పాను.

నేనెందుకొచ్చానో బట్లర్‌కి అర్థంకాలేదు. అయోమంగా చూచాడు.

"అర్జంట్‌గా మేనేజర్‌ని కలుసుకొని మాట్లాడాలి. ఆ కౌంటర్‌లో ఉంది హోటల్ మేనేజరేనా?"

"అవును. అతనే మేనేజరు, ఓనరు సమస్తం" అన్నాడు బట్లర్, నన్ను కిందనుంచి పైదాకా పరీక్షగా చూస్తూ.

"అతడి పేరు?"

"వాంగ్ యూచూ."

"థాంక్స్."

గబగబ కౌంటర్ వేపు నడిచాను.

నేను బట్లరు మాట్లాడటం అంతవరకు గమనిస్తున్న వాంగ్ యీచూ నన్ను చూడనట్లు ముఖం పక్కకు తిప్పి, నిదారుగా కూర్చున్నాడు కుర్చీలో.

"మిష్టర్ వాంగ్ యీచూ, అర్జంట్ గా రూం కావాలి" అన్నాను.

"మా హోటల్లోని మొత్తం రూమ్స్ పది. ఆ పది ఎప్పుడో ఫిలప్ అయిపోయాయి. సారీసర్. మరో చోట ప్రయత్నించండి."

"అర్జంట్ అని ముందే చెప్పాకదా! నే ఎప్పుడు ఈ వూరొచ్చినా పెద్ద హోటల్స్ లోనే దిగుతాను. కాని... ప్రస్తుతం ఓ మారుమూలగా ఉన్న చిన్న హోటల్లో చిన్న గది ఉంటే చాలు. అన్నట్లు మీ హోటల్లో రూమ్ రెంట్ ఎంత?"

"రోజుకి అయిదు."

"అహా."

దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టి, 'ఈ విషమ సమస్యనుంచి తప్పించుకోటం ఎట్లా అబ్బా!' అన్నట్లు మునిపంటితో పెదవి కొరుకుతూ నొసలు ముడివేశాను.

వీడు ఎలాంటి రకమూ? అని వాంగ్ యీచూ నన్నే గమనిస్తున్నాడు.

"మిష్టర్ వాంగ్ యీచూ! రోజుకి పాతిక ఇస్తాను. రూమ్ చూడండి. రూమ్ ఇరుకయినా ఫరవాలేదు సర్దుకు పోతాను."

"రోజుకి పాతికా?" నోరు తెరిచాడు వాంగ్ యీచూ.

"ఆc. పాతిక, అక్షరాలా పాతిక ఇస్తాను."

వాంగ్ యీ చూ ముఖంలో బాధ చోటు చేసుకుంది.

"ఒకే ఒక్క రూమ్ నాలుగు రోజులనుంచీ ఖాళీగా వుంది? గంటకు క్రితమే ఒకతను వారంరోజులకు బుక్ చేసుకున్నాడు."

"మీరుండేది ఎక్కడ?"

"మేడమీద. కింద హోటలు పైన మేముండే హౌస్."

"రోజుకి యాభై ఇస్తాను. మీరుండే హౌస్‌లో చిన్న గది వుంటే ఇవ్వండి. సరీగా ఒక నెల మాత్రమే ఉంటాను. అవసరం, అర్జంట్" అవసరం, అర్జంట్ అన్న మాటలు నొక్కి పలుకుతూ అన్నాను.

వాంగ్ యీ చూ ఆలోచనలో పడ్డాడు. నెలకి ఎంత పెద్ద మొత్తం అవుతుందో ఆలోచించి లెక్క వేశాడు. చాలా పెద్ద అంకె కళ్ళముందు కదులాడింది. వెంటనే దీనిలో ఏదయినా మోసం ఉంటుందా అని చిన్న అనుమానం ప్రవేశించింది.

వాంగ్ యీ చూని పరిశీలనగా చూస్తున్న నాకు అతని మనస్తత్వం బాగా అర్థం అయింది. డబ్బు మనిషి. నాకు కావలసింది అదే.

"అర్జంట్, అన్నమాట మీకు అనుమానం కలిగించి ఉంటుంది. అవునా?" వాంగ్ యీ చూ కళ్ళల్లోకి గుచ్చి చూస్తూ అన్నాను.

"అబ్బెబ్బె! అదేం లేదు. మీకు తప్పక రూమ్ కావాలంటున్నారు. నాకూ ఇవ్వాలనే ఉంది. ఎలాగా, అని ఆలోచిస్తున్నాను. పైన మేముండేది నాలుగు గదులు. సామానుతో నిండివుంటాయి ఆ గదులు నాలుగు..."

"మీ రెంతమంది ఉంటారు?"

"నేనూ, నా వైఫ్. సామానే ఎక్కువ?"

"ఇహ మీరేం చెప్పొద్దు. మీ ఇరువురే కాబట్టి ఎలాగో అలా ఓ నెల సర్దుకోండి" అంటూ సూట్ కేస్ కొద్దిగా తెరిచాను.

వాంగ్ యీచూ చూపులు తెరిచిన నా సూట్ కేస్ పై పడ్డాయి. సూట్ కేస్ నిండా కొత్తరూపాయల కట్టలు. మేలి ముత్యాలహారం. విలువయిన రత్నాలు రెండు ఉన్నాయి. సూట్ కేస్ మాత్ర కొద్దిగా తెరిచినా సూట్ కేస్ లో ఏముందో చూచే ఉంటాడు. ఈ విషయం గమనించాను.

వాంగ్ యీచూ చేతిలో "ఎడ్వాన్స్" అంటూ నాలుగు పెద్ద కాగితాలు సరికొత్తవి పెట్టాను. "ఇప్పుడే వస్తాను" అంటూ ఓ పక్కనే ఉన్న మేడమెట్లకేసి వెళ్ళి వేగంగా మెట్లు ఎక్కుతూ పైకి వెళ్ళాడు వాంగ్ యీచూ.

నా సంభాషణ ఎవరైనా విన్నారా? నన్నెవరయినా గమనిస్తున్నారా? అని నలువైపులా చూచాను.

ఎవరి దోవన వారు తినటం, తాగటంలో మునిగిపోయి ఉన్నారు. తృప్తిగా శ్వాస పీల్చుకున్నాను.

తుప్పర్లు పడుతున్న వాన పెద్దదయింది.

వాంగ్ యీచూ నిరాశగా అతి నెమ్మదిగా నడుస్తూ వచ్చాడు. కౌంటర్ వద్దకు రాంగానే తల వంచుకుని నా నోట్లు నా చేతిలో ఉంచుతూ, "సారీ! రూమ్ ఇవ్వటానికి నా వైఫ్ వప్పుకోవటంలేదు. కాని..." అర్థోక్తిగా ఆగిపొయ్యాడు.

"సంశయించవద్దు. చెప్పండి," ఆతృతగా అడిగాను.

"నా వైఫ్ సంగతి మీకు తెలియదు. అనుమానం పెద్దమ్మ. పెద్దపెద్ద హోటల్స్ కిచ్చే చార్జ్ ఇచ్చి మనింట్లో

ఉంటానంటే ఏదో పెద్ద కారణం ఉండే ఉంటుంది. మీరేమో ఆ హోటల్లో పడివుంటారు. మనింట్లో గది ఇవ్వటమంటే ఆలోచించాల్సిన విషయం. అతనంతగా ప్రాధేయపడుతున్నాడంటున్నారు గాబట్టి ఎడ్వాన్స్ ఇచ్చిన డబ్బు వదులుకొని ఏరోజు కారోజు ఓ గంట కూడా ఆలస్యం కాకుండా డబ్బు ఇస్తాడేమో కనుక్కోండి అంది. మీ అవసరంకొద్దీ ఇప్పటికే రూం రెంట్ ఎక్కువిస్తున్నారు. ఇంకా ఎడ్వాన్స్ వదులుకోమంటే ఏం బాగుంటుంది చెప్పండి. నా వైఫ్ సంగతి చెప్పా కదా! మొండిది. ఆశ ఎక్కువ. దయచేసి మరోచోట ప్రయత్నించండి,'' అన్నాడు వాంగ్ యీచు.

నా మనసు తేలికపడింది.

''మనం చాలా తేలికగా తీసుకునే విషయాలు ఆడవాళ్ళు సీరియస్‌గా తీసుకుంటారు. రూపాయొస్తే మనం సంతోషపడతాము. ఆడవాళ్ళకు రూపాయి వచ్చే చోట అయిదు రూపాయిలొచ్చినా తృప్తిపడరు. సిల్లీ ఎడ్వాన్స్ తిరిగి ఇవ్వక్కరలేదు. తొందరగా రూమ్ ఖాళీ చేయించండి. కాస్త విశ్రాంతి తీసుకోవాలి'' చేతిలో ఉన్న నోట్లు వాంగ్ యీచూ ముందు వుంచాను.

వాంగ్ యీచూ ముఖం వికసించింది.

''అలా ఛయిర్‌లో కూర్చోండి. మీకు కావలసినవి తెప్పించుకుని తినండి. గది కాళీ చేయించమని చెప్పి వస్తాను. అన్నట్లు మీ పేరు?''

''పనికర్,'' పేరు చెప్పి సూట్‌కేస్ అందుకుని ఛయిర్ దగ్గరకు నడిచాను.

వాంగ్ యీచూ కౌంటర్‌వద్ద వేరే మనిషిని ఉంచి, మేడపైకి వెళ్ళాడు.

'హోటల్లో స్థానం సంపాదించాను. ఫరవాలేదు' అనుకున్నాను. బేరర్‌ని పిలిచి స్వీటు హాటు తెమ్మని పురమాయించాను.

టిఫెన్ తినటం పూర్తయింది. వేడి టీ చప్పరిస్తున్నాను. వాంగ్ యీచూ వచ్చాడు. "గది ఖాళీ అయింది. రండి పైకి వెళదాం," అన్నాడు.

చూ ముందు, వెనుక నేను మెట్లెక్కి, నాకోసం ఏర్పాటు చేసిన రూములో ప్రవేశించాము.

రూమ్ చిన్నదయినా బాగుంది. ఆ రూమ్ అంతకు క్రితం సామానుతో నిండిలేదని రూమ్ చూస్తూనే గ్రహించాను. చిన్న మంచము, ఓ ఛయిర్, స్టూలు, స్టూలుమీద మంచినీళ్ళ కూజా, డ్రస్సింగ్ టేబుల్, వంకీన వేలాడుతున్న టర్కీటవల్, రూమ్‌కి అందమైన కర్‌టెన్ వేలాడుతున్న చిన్న కిటికీ. అన్నివిధాలా నాకు అనువుగా వుందా రూమ్.

"నా కోసం శ్రమపడి నీట్‌గా రూమ్ ఇచ్చారు. థాంక్స్" అన్నాను కోటు విప్పుకుంటూ.

"దానిదేముంది. మీరు డబ్బు పెట్టారు. ఈ మాత్రమయినా శ్రమపడి రూమ్ సర్ది ఇవ్వకపోతే మా మాట పోదా?"

స్త్రీ కంఠం విని గుమ్మంవైపు చూచాను.

"నా వైఫ్ చుంగ్‌చాంగ్. శ్రమంతా ఆమెది," అన్నాడు చూ.

చూ భార్య చుంగ్‌చాంగ్‌కి ముప్పై ఏళ్లు ఉంటాయి. ఆమెని అందెక తెలతో పోల్చవచ్చు. చూ మాత్రం చూడటానికి వృధ్ధాప్యం మీద పడిన వాడిలా కాస్త వంగి,

కళ్ళకింద ముడతలు పడి వికారంగా ఉంటాడు. చాంగ్ ధృడంగా అందంగా ఆకర్షణీయంగా వుంది. చాంగ్, చూకి తగ్గ భార్య కాదనిపించింది.

"ఈ రాత్రికి నాకేం అవసరం లేదు. దండిగా టిఫెన్ తిన్నాను. అలసిపొయ్యానేమో నిద్ర ముంచుకు వస్తుంది. పడుకుంటాను. తెల్లవారిందాకా లేపకండి. నేనే లేచి గది లోంచి బైటకు వస్తాను. అన్నట్లు...మీకు మళ్ళీ శ్రమ కలిగిస్తున్నాను. నా సైజు కొలతలు చెపుతాను. రేపు ఉదయం పది లోపల నే చెప్పినటువంటి డ్రస్‌లు ఖరీదైనవి రెడీమేడ్ షాపులో తెప్పించి ఇవ్వండి. డబ్బు గురించి ఆలోచించవద్దు ఎంతయినా సరే ఇస్తాను. అన్నట్లు ఇంకో విషయం. సాధారణంగా నా గది విడచి బైటికి రాను. ఎప్పుడయినా ఓసారి నా ఇష్టం వచ్చినప్పుడు అలా బైటికి వెళ్ళొస్తాను. మీల్స్‌కి, టిఫెన్‌కి మాత్రం కిందకొచ్చి వెళుతుంటాను. ఓకే. నాకు కావలసింది రూమ్. మీకు కావలసింది మనీ. ఆపై చెప్పవలసింది ఏమీ లేదు. గుడ్ నైట్." అన్నాను నోటివద్ద చిటిక వేసుకుంటు ఆవులించి.

చూ, చూ భార్య చాంగ్ ముఖముఖాలు చూసుకున్నారు.

"గుడ్ నైట్," గొణుగుతూ అని చూ, చాంగ్ బైటకు వెళ్ళిపోయారు.

తలుపులు వేసి గడియలు బిగించాను. నే తెచ్చిన సూట్‌కేసు తలగడపక్కనే ఉంచాను. లాగు జేబులో ఉన్న పిస్టల్ బైటకు తీశాను. తలగడకింద దాచాను. మంచమెక్కి తలగడమీద ఓ చెయ్యి ముడిచి చేలిమీద పడుకున్నాను.

చాంగ్, చూలు డబ్బు మనుషులు. ఇహపై నా చేతిలో మనుషులు. అయినా, నా జాగ్రత్తలో నేను ఉండాలి. మేకప్ బాక్స్ నా సూట్ కేసులో ఉంది. దుస్తులు చూ చేత తెప్పించుకుంటాను. ఇంకేం కావాలి? చాంగ్ ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేటట్లుంది. జాగ్రత్తగా ఉండాలి. నే ఉన్న పరిస్థితి అలాంటిది.

ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నాను.

## 2

ఉదయం వాంగ్ యీ చూకి పదిహేను వందలిచ్చాను. రకరకాల డ్రస్‌లు కాక అవసరమయినవి కొన్ని లిస్ట్ రాసిచ్చి తెప్పించమన్నాను. ముఖ్యంగా నా రూమ్‌కి వేసుకోటానికి గోద్రెజ్ తాళంకప్పకూడా ఆ లిస్ట్‌లో ఉంది.

మార్నింగ్ టిఫెన్‌కి కిందకు వెళ్ళలేదు. మంచంమీద నుంచి లేవకుండానే, "టీ" ఒకటి పంపమని చెప్పాను చూకి.

చుంగ్ చాంగ్ కంగారుగా నా గదికి వచ్చింది.

"టిఫెన్ అక్కరలేదా? పోనీ ఇక్కడకు పంపమంటారా? ఆరోగ్యం సరీగాలేదా?" అని అడిగింది.

"ఈ పనికర్ ఉక్కుమనిషి. నా ఆరోగ్యానికొచ్చిన చింత ఏమీలేదు. దయచేసి నే పిలవంది తలుపులు తోసుకుని అలా నా రూమ్‌లోకి రాకండి" నిర్లక్ష్యంగా అన్నాను.

చాంగ్ ముఖం ముడుచుకుని అవతలికి వెళ్ళిపోయింది.

నాలో నేను నవ్వుకున్నాను.

ఓ గంట తరువాత చూ నాకు కావలసినవి తీసుకుని గది తలుపులు తోసి లోపలికి వచ్చాడు.

"మీరు లోపలికి వచ్చేముందు 'రావచ్చా?' అని ముందుగా నన్నడిగి రండి మిస్టర్ వాంగ్ యీ చూ!" అంటూ వార్నింగ్ ఇచ్చాను.

నేనున్న పరిస్థితులలో నా గురించి తెలుసుకోవాలని భార్యాభర్తలు ఇరువురు ప్రయత్నిస్తారు. నా గురించి ఒక్క ముక్క తెలుసుకున్నా అదెంత ప్రమాదకరం? నా ప్రాణానికే ముప్పు!

"ఇకపై అడిగి లోపలకి వస్తాను" అన్నాడు చూ తెచ్చినవన్నీ నాముందు పెట్టి.

అన్నీ పరిశీలించి తృప్తిగా తల ఆడించాను.

"పాతిక రూపాయలు మిగిలాయి" డబ్బు నా ముందు ఉంచుతూ అన్నాడు చూ.

"మిగిలినవి తీసుకోవటం నాకు అలవాటు లేదు. ఇంకా డబ్బు పడితే ఇచ్చేవాడిని. సరే. ఇక మీరు వెళ్ళవచ్చు. మీల్స్‌కి కిందకొస్తాను."

పాతిక రూపాయలు జేబులో కుక్కుకుని సంతోషంగా బైటకు వెళ్ళిపోయాడు చూ.

తలుపులు వేసి గడియ బిగించాను.

# 3

హోటల్ కి వచ్చి నాలుగు రోజులయిపోయింది.

టిఫెన్ కి, మీల్స్‌కి కిందకొచ్చి వెళుతున్నాను. మిగిలిన సమయమంతా గది విడిచి బైటకు రావటం లేదు. ఆ రోజు వార్నింగ్ ఇచ్చిన దగ్గరనుంచి అనవసర విషయాలు నన్నడగటంలేదు. అనుమతి లేనిది నా గదిలోకి దూరటం లేదు. ఏ రోజు రూమ్ రెంట్ ఆ రోజు ఇచ్చేస్తున్నాను. చూకి ఓ పక్క డబ్బు ముడుతున్నందుకు సంతోషం

మరో పక్క నన్ను చూస్తుంటే అయోమయంగాను ఉంది.

మీల్స్‌కి కిందకు వస్తూ నా గది తలుపులకు తాళం వేసి ఓ జేబులో వేసుకున్నాను. తాళం వేస్తున్న నన్ను చూచి పక్కగది గుమ్మంలో నుంచున్న చాంగ్ లోపలి కెళ్ళింది.

గదిలోంచి బైటకువస్తే తలుపుకి తాళం వేస్తున్నాను. మొదట్లో అది చూచి, "పైకి ఎవరూ రారు. గదికి తాళం వేయకపోయినా ఫరవాలేదు. నే చూస్తూంటాను" అంది చాంగ్.

"నా అలవాటు కేపనీ విరుద్ధంగా చేయను" అని గబగబ కిందకు వచ్చాను.

అప్పటినుంచి చాంగ్ గదికి తాళం వేస్తుంటే బైట నుంచున్నది కూడా లోపలికి వెళ్ళిపోతుంది.

నవ్వుకుంటూ కిందకు వచ్చాను.

యాభైమందికి సరిపడ ఛయిర్స్ ఉంటే ఆ ఛయిర్స్ సగం నిండగా ఎప్పుడూ చూడలేదు నేను. ఈ పూట మూడువంతులు ఛయిర్స్ నిండిపొయ్యాయి జనంతో. బేరర్స్ చకచక అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఓ పక్కగా ఖాళీగా ఉన్న టేబుల్ వద్ద కూర్చున్నాను. ఎప్పుడూ నాకు సప్లయిచేసే బట్లర్ నాకు కావలసిన ఆహారం తెచ్చి నా ముందు ఉంచాడు. తల వంచుకుని తింటూ కూర్చున్నాను. నా టేబుల్ కి అటువైపు కుర్చీలో ఎవరో కూర్చున్నట్లయి, తలఎత్తి చూచి, తిరిగి రుచిగల మాంసాహారం తినటంలో పడ్డాను.

చిన్న జిప్ బ్యాగ్ టేబుల్ మీద ఉంచి అతను కావలసినవి తెప్పించుకుని ఆతృతగా తినేసి, బిల్ చేతిలోకి తీసుకుని వెళ్ళిపోయాడు కౌంటర్ వైపు.

పదినిమిషాల తరువాత "టక్, టక్" తలుపు తడుతున్న శబ్దం వినవచ్చింది.

లేచి వెళ్ళి తలుపులు తీశాను.

వాంగ్ యీ చూ, అతని వెనుక భార్య చుంగ్ చాంగ్ నుంచుని ఉన్నారు.

"మీతో మాట్లాడాలి. గదిలోకి వస్తాము."

"ఇప్పుడా?"

"అవును. ఇప్పుడే. అర్జంట్ గా మాట్లాడాల్సిన పని ఉంది."

"ఒన్ మినిట్" అని వాళ్ళ ముఖానే తలుపువేసి లోన గడియ బిగించాను. లోపల సర్దవలసినవి సర్ది, పాంట్ జేబులో పిస్టల్ ఉంచుకుని తలుపులుతీసి, ఇరువురిని మర్యాదగా లోపలికి ఆహ్వానించాను.

"మీరు చేస్తున్న పనులేవీ మా కర్థంకావటం లేదు" ముఖం గంటుపెట్టుకుని చూ అన్నాడు.

"నా పనులు మీ కర్థంకాక పోవటంవల్ల నాకూ' మీకూ ఎటువంటి నష్టంలేదే? ముఖ్యమైన లెక్కకాగితాలు చూచుకుంటున్నాను. మీ రెందుకొచ్చారో చెపితే?"

"మా హోటల్ మంచి పేరుతో నాలుగు కాలాలపాటు ఉండాలా? అక్కరలేదా?"

"ఉండాలనే కోరుతున్నాను."

"మరి... ఇందాక మీ రేం చేశారు? అతనెవరో జిప్ బ్యాగ్ వదిలి వెళితే అది మీరుపైకి తీసుకువచ్చారు. నే గమనించాను. అతనెవరో తరువాత వచ్చి, మీ హోటల్లో దొంగలున్నారు బ్యాగ్ పోయింది, అంటే హోటల్ అల్లరయిపోదా?"

"ఓస్. ఆ విషయం గురించా మీరు అడగటానికి వచ్చింది? అతను రాడు. వస్తే నా గదికి పంపండి, బ్యాగ్ ఇచ్చి పంపుతాను" గట్టిగా చెప్పాను.

"ఆ బ్యాగ్ నాకు ఇవ్వండి. అతనొస్తే నేనే అందజేస్తాను."

"మీకా శ్రమక్కరలేదు. వెళ్ళండి."

"మీ వరస నాకేం నచ్చలేదు" చాంగ్ అంది మధ్యలో కలగజేసుకుని.

"ఎందుకనో?" ఓరగా చూచాను చాంగ్ వైపు.

చాంగ్ మాట్లాడలేదు.

"నావల్ల మీ హోటల్‌కి పేరు పోయినప్పుడుగాని, నేను ఏ రోజు రెంట్ ఆ రోజు ఇవ్వనప్పుడుగాని మీరు నాతో గట్టిగా మాట్లాడండి. మీకు కాని విషయాలలో మీరు తలదూర్చవద్దు. ఇహ మీరు వెళితే నా పని చూచుకుంటాను."

చూ, చాంగ్‌లు ముఖముఖం చూచుకున్నారు. ఏమనుకున్నారో నెమ్మదిగా లేచి అయిష్టంగా గదిలోంచి బైటకు వెళ్ళారు.

# 4

తుపాకి తూటాలు కాలిపిక్కకు, జబ్బకు తగిలినచోట రక్తం కారకుండా, బనీనువిప్పి కాలికి కర్‌చీఫ్ చేతికి కట్టాను. కుంటుకుంటూ హోటల్‌లో ప్రవేశించాను. కోటు పాంటు ముదురు స్నఫ్ కలర్‌వి కాబట్టి రక్తం అంటినా కనబడదు.

కౌంటర్ ముందున్న టేబుల్‌పై చెయ్యి ఆనించి, "నా కోసం ఎవరయినా వచ్చారా మిస్టర్ వాంగ్ యూచూ?" అడిగాను.

"అదేమిటి కోటుమీద ఎర్రగా రక్తంలాగుంది? మీ ముఖం నీరసంగా వుంది? బజారు వెళ్ళివస్తానని చెప్పినప్పుడు బాగానే ఉన్నారే?" చూ కంగారుగా నన్ను పరీక్షగా చూస్తూ అడిగాడు.

"నే అడిగిందేమిటి? మీరు చెప్పేదేమిటి?" చూ ముఖంలో తీవ్రంగా చూస్తూ అడిగాను.

"అహా...ఆ...ఆ... మీరెళ్ళిన అరగంటకి ఒకతను వచ్చాడు. కుడికన్ను మెల్ల. పాలిపోయిన రంగుతో ఆరడుగు లెత్తునున్నాడు. మీ రూపం వర్ణించి... అతని పేరు పదేకర్. మీ హోటల్‌లో రూమ్ బుక్ చేసు కున్నాడా?" అని అడిగాడు.

"స్టుపిడ్" పిడికిలి బిగించి అన్నాను.

"ఆ?" చూ నోరు దాకలాగా తెరిచాడు.

"మిమ్మల్ని కాదు మిష్టర్ చూ! ఆ స్టుపిడ్ నన్ను ఎతుక్కుంటూ వచ్చాడా? మీరేం చెప్పారు?"

"మీరు చెప్పమన్నట్లే చెప్పాను. కావాలంటే రూమ్స్ అన్నీ చూడండి, మీరు వర్ణించిన రూపం గల వారు ఎవరూ లేరు అన్నాను. అన్నట్లు అతను మీ పేరు పనికర్ అని కాక పదేకర్ అని ఎందుకన్నాడు?"

"యూడవను" గట్టిగా అని, పిడికిలి బిగించి బల్లమీద గుద్దాను.

బల్లమీద వస్తువులు ఎగిరిపడ్డాయి. చూ భయపడుతూ కుర్చీకి అతుక్కుపోయాడు.

"మీరొకసారి పైకి రండి మిష్టర్ చూ!" అని గబగబ నడవబోయాను మేడ మెట్లవైపు. కాలు పట్టేసింది. కాలు ఈడుస్తూ మెట్లు ఎక్కి నా రూమ్ చేరాను.

వాంగ్ యూ చూ నా వెనకనే వచ్చాడు మేడపైకి.

రూమ్‌లోకి రాంగానే పాంటు, షర్ట్, కోటు విప్పి మూలగా విసిరేశాను. గాయాలనుంచి రక్తం ఇంకా స్రవిస్తూనే ఉంది. బనీను, కర్‌చీఫ్ రక్తంతో తడిసి పోయ్యాయి.

"అదేమిటి?" చూ నన్ను చూస్తూ గాభరాగా అన్నాడు.

"కనపడటంలా రక్తం. లేచినవేళ బాగుంది. ఆ ఇడియట్, తుపాకీ కళ్ళుమూసుకు గురిచూచి కాల్చగలడు. కాని... ఈ పనికర్ కళ్ళు మూసుకుని తప్పించుకోగలడు. తుపాకీ గుళ్ళు శరీరంలోంచి దూసుకుపోలేదు. రాచుకుంటూ పోయాయి. ఫరవాలేదు. ఇది నాకో లెక్క కాదు," కాటన్‌తో రక్తం తుడుచుకుంటూ అన్నాను.

"అసలు తుపాకీ ఎందుకు కాల్చారు? ఎవరు కాల్చారు? నాకేం అర్థంకావటం లేదు."

"కొన్ని విషయాలు అర్థం కాకపోవటం, మరికొన్ని తెలుసుకోకపోవటం మంచిది" కఠినంగా అన్నాను.

వాంగ్ యీ చూ నిర్ఘాంతపోయి అలా నిలబడి పోయ్యాడు.

తాపీగా గాయం చుట్టూవున్న రక్తం తుడుచుకుని, గాయంమీద మందు, కాటన్ గాజుగుడ్డచేసి, డ్రస్ చేసేశాను. తొడకి నేనే ఇంజక్షన్ చేసుకున్నాను. లుంగీ, పల్చని షర్ట్ ధరించి చూ వైపు తిరిగాను. "వేడి టీ ఓ కప్ పంపించండి" అన్నాను మంచంమీద కూర్చుని.

"నన్నెందుకు పిలిచినట్లు రమ్మని?"

"టీ తాగి చెప్తాను."

మారు మాట్లాడకుండా చూ కిందకు వెళ్ళాడు. టీ

కప్పుతో పదినిమిషాలలో లోపలికి వచ్చాడు.

"మీ కోసం మళ్ళీ ఎవరో వచ్చారు. మా హోటల్లో మీరు చెపుతున్న ఆనవాళ్ళు పేరుగల ఎవరూ లేరంటే నమ్మటంలేదు. తన పేరు రతన్ అని చెప్పాడు. పైగా రతన్ అనే అతనొచ్చాడని పనికర్‌తో చెపితే చాలు రమ్మంటాడని కూడా అన్నాడు" చూ వివరంగా చెప్పాడు.

"ఊహూ, నే అనుకున్న దానికన్నా ముందే వచ్చేశాడన్నమాట. గుడ్. వెంటనే వెళ్ళి రతన్‌కి పైకి పంపండి" అన్నాను.

చూ వెళ్ళిపోయాడు కిందకు.

రతన్ గదిలోకి రాగానే తలుపువేసి గడియ బిగించాడు.

నేనేం మాట్లాడలేదు.

"నీ విక్కడున్నట్లు నే ఊహించటంలో ఎంతమాత్రం పొరపడలేదు. ఎక్కడో ఉండవలసినవాడివి చివరికి ఇక్కడ తేలావా పడేకర్?" అన్నాడు రతన్.

"నా పేరు పడేకర్ కాదు పనికర్."

"ఓహో, పేరుకూడా మారిందన్నమాట!"

"అవసరాన్నిబట్టి అన్ని మారిపోతాయి. నే యిక్కడున్నట్లు ఎవరు చెప్పారు? నన్ను వెతుక్కుంటూ ఎందుకొచ్చావ్? మళ్ళీ మనీ కోసమేనా? నీ శ్రమకి ఫలితం ఎప్పుడో అందజేసాను. పిచ్చిగా మళ్ళీ పచ్చనోటు అడక్కు. పదినిమిషాలలో పరలోకయాత్రకు సిద్ధం చేస్తాను నీ దేహాన్ని."

"నువ్వెంతటి ఘనుడవని తెలుసు పడేకర్, నాకు కావలసింది పచ్చనోటు కాదు."

"మరి...?"

"చంద్రమణి... నీలికాంత... పుష్యరాగం. ఇంకా పేర్లు చెప్పనా?" రతన్ వ్యంగ్యంగా అన్నాడు.

"గెటవుట్" కోపంగా పెద్దపెట్టున అరిచాను.

"అరిస్తే నీ నోరే నొప్పి పుడుతుంది. కోపం తెచ్చుకుంటే నీ గుట్టు బైటపడుతుంది" రతన్ బెదిరింపుగా అన్నాడు.

రయ్యిన మంచం మీదనుంచి లేచాను. సింహంలా రతన్ మీదకు దూకి ఓ చేత్తో తలుపు గడియ తీశాను. రతన్‌ని లాగి గదిలోంచి బైటకు తీసుకువచ్చాను. "మరోసారి నా కంటపడ్డావా? నీ బాబు పోయిన చోటుకి పంపుతానురా బద్‌మాష్, నా పేరు, నా ఉనికి, అదే ఇందాక కూశావ్ వాటి సంగతి అన్నీ మరచిపో. నిన్ను చంపటానికి కత్తి, తుపాకీ అక్కరలేదురా నా ఎడంచేతి చిటికినవేలి గోరు చాలు" అని మెడపట్టి మెట్లవైపు ఓ గెంటు గెంటాను.

రతన్ నా తోపిడికి విసురుగా పడబోయి మేడ మెట్ల పక్కనున్న మెష్ పట్టుకుని నిలతొక్కుకున్నాడు. వాడు కసితీర నాలుగయిదు బండబూతులు తిట్టి వెళ్ళిపొయ్యాడు.

గిరుక్కున వెనుతిరిగాను.

వాంగ్ యీ చూ, భార్య చింగ్ చాంగ్ గోడపక్కగా ఒదిగి నుంచుని ఉన్నారు.

"మీ రిక్కడేం చేస్తున్నారు?" గర్జించి అడిగాను.

చూ తడబడ్డాడు.

చాంగ్ మటుకు "మీ గదిలో పెద్దగా మాటలు వినిపిస్తూంటే ఏమిటో అని వచ్చాము" అంది.

"మంచిది. ఇక్కడేం ఘోరం జరగలేదు. పిచ్చికుక్క వస్తే వెళ్ళగొట్టాను. ఇంక మీరు వెళ్ళవచ్చు" అని గదిలోకి వెళ్ళాను. నా వెనుకనే చూ, చాంగ్ వచ్చారు.

"మీకూ మీ డబ్బుకి నమస్కారం. మీవల్ల మేము, మా హోటలు రచ్చకెక్కేటట్లున్నాం. మీరు వేరే హోటల్ చూసుకోండి" అన్నాడు చూ.

"రతన్ గాడికి నాకు ఎందుకు పోట్లాట వచ్చిందో మీకు తెలియదు. నా ప్రవర్తన కాదు మీరు చూడవలసింది. మీ ప్రవర్తన నాకు నచ్చలేదు. ఇలా మీరు చాటుగా పొంచుండి నా మాటలు వినటం ఏమిటి? రూమ్ ఇచ్చారు. రెంట్ పారేస్తున్నాను. మంచిది. నాకు ఈ రూమ్‌లో ఉండే యోగం నిండా పదిహేను రోజులు కూడా లేదన్నమాట... నాకు రూమ్ ఇచ్చినందుకు వెళ్ళేటప్పుడు మంచి విలువైన బహుమతి ఇచ్చిపోదామనుకున్నాను. ప్చ్. ప్రాప్తంలేదు మీకు. ఓ. కే. రేపు రాత్రిలోగా వేరే రూమ్ చూసుకుని వెళ్ళిపోతాను."

వాంగ్ యీచూ కంగారుగా చేతులతో వారిస్తూ నా ముందుకు వచ్చాడు.

"పోట్లాటలంటే భయం, అందుకని కాస్త గట్టిగా చెపుదామని వచ్చాను. మీరు రూమ్ ఖాళీచేసి పోవద్దు" అన్నాడు చూ.

"నెల కాకపోతే నాలుగు నెలలుండండి" నమ్రతగా అంది చాంగ్.

"నేను రతన్ మాట్లాడుకుంది మీరు విన్నారా?"

"ఉహూ."

"సరే, రూమ్ ఖాళీ చేయను. మీకు కావలసిన డబ్బు ఇస్తాను. నా విషయం ఏదీ పట్టించుకోకండి. అది మీకూ

నాకూ మంచిది. వీలయితే నాకు సాయం చేయటానికి ప్రయత్నించండి. ప్రతిఫలం బాగా ముట్టచెపుతాను. ఇహ మీరు వెళ్ళవచ్చు" అన్నాను.

"మీ విషయం పట్టించుకోము. గోల లేవీ జరగకుండా చూడండి. అదే మాకు కావలసింది" చూ అన్నాడు.

తల ఊపాను, సరే అన్నట్లు.

వాంగ్ యీచూ, చింగ్ చాంగ్ రూమ్‌లోంచి బైటకు వెళ్ళిపోయ్యారు.

# 5

రాత్రి పదిగంటలయింది.

మీల్స్ తీసుకోంగానే విశ్రాంతిగా పడుకుని, పుస్తకం గాని, పేపర్ గాని, ఓ గంట తిరగేసి నిద్రపోవటం ప్రశాంతంగా ఉన్నప్పుడు అలవాటు.

టేబుల్ లైట్ తలవద్ద బల్లమీద పెట్టుకుని న్యూస్ పేపర్ తిరగేస్తున్నాను. నిద్ర ముంచుకొస్తున్నది.

"వద్దు, వద్దు. అనుమతి లేనిదే లోపలికి వెళితే కోప్పడతారు. నీకే చెప్పేది" రూమ్ బైటనుంచి వాంగ్ యీచూ మాటలు గాభరాగా వినవచ్చాయి.

పక్క గది తలుపు తీసిన చప్పుడయింది. అంటే చూ భార్య చాంగ్ తలుపులు తీసుకుని గది బైటకు వచ్చి వుంటుంది.

"నా సంగతి తెలియదు. తలుచుకున్నానంటే నల్లిని నలిపేసినట్లు నలిపేయగలను. పేను కుక్కినట్లు కుక్కగలను. చెయ్యి వదులు. వాడి ముఖం వాడు నన్ను కోప్పడేంతటి మొనగాడా?"

నల్లి, పిల్లి, పేను మొదలైన పేర్లు తరుచు ఎవరు వాడుతారో గుర్తొచ్చింది. ఆ కంఠస్వరం గుర్తించాను. చటు

ప్రక్కన లేచి దిండుకింద పిస్టల్ ని జేబులో వేసుకున్నాను. పిస్టల్ ఉన్న జేబులో చెయ్యిపెట్టి, లేచి నుంచున్నాను.

వాంగ్ యీ చూని తోసిపారేస్తూ లల్లూరాం నా రూమ్ లోకి జొరపడి, గుమ్మంలో ఆగిపోయ్యాడు.

నిద్ర పోయేటప్పుడు తలుపు లేసుకోవచ్చని తలుపులు బార్లా తెరిచి ఉంచాను. అందువల్ల లల్లూరాం నా రూమ్ లోకి రాగలిగాడు.

"అచ్ఛా భాయ్! కష్టం లేకుండానే కనపడ్డావు. పని కూడా అలాగే పూర్తి అయితే బాగుంటుంది కదూ?" లల్లూరాం అన్నాడు.

లల్లూరాంవైపు కోపంగా చూడటం తప్ప, ఏమీ మాట్లాడలేకపోయాను.

"ఉన్నట్లుండి ఇలా ముఖాముఖీ వచ్చి మాట్లాడుతానని మాట్లాడుకోలేదు కదూ భాయ్?"

అప్పటికి నేను పెదవి కదపలేదు. చూ వైపు చూచాను.

"మేడపైన ఎవరూ లేరని చెప్పినా వినకుండా, నాకు కావలసినవాడొకడున్నాడు. వాడి పేరు పనికర్ లేక పడేకర్ కావచ్చు. అసలు పేరు ఆ రెండూ కాదు. వాడి రూపం చూచి పేరు చెప్తానూ, అంటూ నా మాట ఖాతరు చేయక మేడపైకి వచ్చేశాడు," తన తప్పేం లేదన్నట్లు చూ అన్నాడు.

"బాగుంది భాయ్! పనికర్, పడేకర్ మంచి పేర్లే ఎన్నుకున్నావు. శోభనాద్రి, శంకర్రావ్ పేర్లు మోటుగా ఉన్నాయనా? ఈ పేర్లు తగిలించుకున్నావ్?"

"లల్లూరాం! ఇది ఎగతాళికి సమయంకాదు. నువ్విక్కడ

దిగావో చెప్పు, రేపు అక్కడికి వస్తాను. మాట్లాడు కుందాము,'' శాంతంగా అన్నాను.

లల్లూరాం పెద్దపెట్టున నవ్వాడు.

''అరె భాయ్! నీ సంగతి నాకు తెలియదా? నీటిలో మొసలివి. కలుగులో ఎలుకవు. మూలనున్న తేలువు. క్షణం కన్ను మూస్తే పాతిక మైళ్ళు దాటిపోతావు. నేను దిగిన చోటు చెపితే నా దగ్గరకు వస్తావా? ఏం వినయం? ఏం వినయం? బాగుంది. మంచి ప్లేస్ ఎన్నుకున్నావు. అందుకే నీ వెనుక బైలుదేరిన నేను నిన్ను పట్టటానికి పది హేను రోజులపైనే పట్టింది. అసలు విషయానికొద్దాము. నీవూ నేనూ భాయ్ భాయ్‌గా ఉంటే అగ్నికి వాయువు తోడయినట్లుంటుంది.''

''ఉహూ, నిప్పుమీద పడ్డ ఉప్పులా ఉంటుంది,'' చిటపటలాడుతూ అన్నాను.

''అ తొందరే మంచిది కాదు. ఇప్పటికే అ రహస్యం చాలామందికి తెలిసిపోయింది.''

''నాకేం భయంలేదు. వందమందికి తెల్సినా నన్నేం చేయలేరు.''

''ఫూల్‌లా మాట్లాడకు. మనిద్దరం కలిస్తే మూడో వాడిని పట్టటం తేలిక. అప్పుడు కోట్లు మనవి.''

''ఉష్! నీతో నే కలవటంవల్ల కావాలని చేటు తెచ్చు కోటం. నీ దోవన నీవు ప్రయత్నించు. నా దోవన నేను ప్రయత్నించుతాను. ఎవరికి ముందుగా మైకేల్ దర్శన మిస్తాడో, వాడి పంట పండినట్లే. నీ కంటపడ్డా నా కంట పడ్డా మైకెల్ ప్రాణంతో ఉండడు. నెక్స్ట్... మైకెల్ వద్ద దాగిన రహాశ్యం తెలుసుకున్నవాడే మరకత మాణి

కార్యాలకు అధిపతి. నాకే ఆ యోగం ఉంటుందనుకుంటు న్నాను. నా దోవకి అడ్డం రాక నీ ప్రయత్నం నీవు చేసుకో. నీ ముఖానికి ఆ యోగ్యత పడుతుందేమో?" వ్యంగ్యంగా, నిర్లక్ష్యంగా తల ఎగర వేస్తూ అన్నాను.

లల్లూరాం చటుక్కున కోటు జేబులోంచి పిస్టల్ తీశాడు. నాకు గురి పెట్టాడు.

"నీవద్ద ఉన్న ప్లాన్ ఇస్తావా? స్వర్గానికి పంపనా? రెండే నిమిషాలు. జవాబివ్వు."

"ప్లాన్ కాగితం దగ్గరుంచుకుంటానని ఎలా అను కున్నావ్? నీ తెలివి ఏడ్చినట్లే ఉంది. నన్ను చంపితే ఇటు కాగితము దక్కదు, అటు మైకేల్ గాడు అందడు. చూ! అతన్నేమీ చేయకు. ఉత్త బెదిరిం..."

నా ట్రిక్ పనిచేసింది. లల్లూరాంతో మాట్లాడుతూ, మధ్యలో లల్లూరాం వెనుకగా ఉన్న వాంగ్ యీచూతో గాభరాపడుతూన్నట్లు, అన్నాను.

లల్లూరాం గిర్రున వెనుతిరిగాడు. చటుక్కున పాంట్ జేబులో పిస్టల్ తీసి "ఢన్, ఢన్," మంటూ లల్లూరాంని కాల్చాను. లల్లూరాం మొదలు నరికిన వృక్షంలా బోర్లా పడిపొయ్యాడు. వీపులోంచి రక్తం కాలువలా వచ్చింది. సైలన్సర్ అమర్చిన పిస్టల్ కాబట్టి "సర్, సర్" అని చిన్న శబ్దం మాత్రమే అయింది.

చూ 'కెవ్' మని కేక వేశాడు. నా పిస్టల్ వాంగ్ చూ వైపు తిప్పాను.

"మిస్టర్ వాంగ్ యీచూ! నోరు మూసుకుని, చేతులు పైకెత్తి లోపలికి రా. ఏయ్! చాటుగా ఉన్న శ్రీమతి చింగ్ చాంగ్, నువ్వూ ఇలా వచ్చెయ్యి, ప్రాణాలమీద ఏమాత్రం తీపి ఉన్నా" అన్నాను కరుగ్గా.

వాంగ్ యీచూ, చింగ్ చాంగ్ భయపడుతూ రూమ్ లోపలికి లల్లూరాం శవాన్ని దాటుకు వచ్చారు.

"చూ! ఈ శవాన్ని మాయం చేయాలి. నాతో చేతులు కలపండి, ఎంత డబ్బయినా ఇస్తాను. తగలాల్సిన చోటే తగిలి చచ్చాడు ముండాకొడుకు."

"ధనమంటే ఆశయినా, ఇలా హత్యలు అవి దాచి సాయం చేయలేము. నావల్లకాదు. సాయం చేసినట్లే చేసి, నిన్ను పోలీసుల కప్పగిస్తే ఏంచేస్తావ్?" ఓ పక్క భయంభయంగా పిస్టల్ వైపు చూస్తూ అన్నాడు చూ.

చుంగ్ చాంగ్ దోసిట్లో ముఖం దాచుకుని ఏడ్వటం మొదలుపెట్టింది. అయితే ఏదో చిన్నగానే ఏడుస్తున్నది.

"పోలీసులకి నన్నప్పగిస్తావా? మంచిది మిస్టర్ వాంగ్ యీచూ! పోలీసు డిపార్ట్మెంట్ అంటే ఏమిటి? అధికారంలో ఉన్న దొంగలు వాళ్ళు. లైసన్స్ బిళ్ళలేని దొంగలం మేము. వాళ్ళకీ మాకూ అంతే తేడా! అసలు విషయం టూకీగా చెపుతాను. నా పేరు పనికర్ కాదు, అసలుపేరు చెపితే హడిలిచస్తావ్! కాబట్టి నాపేరు అడగకు. పనికర్ అంతే. నేను ఈ ఊరు ఒంటరిగా రాలేదు. నా వాళ్ళు పాతికమంది దాకా వివిధ వేషాలలో ఈ రంగూన్ పట్టణంలో రకరకాల వృత్తులలో ఉన్నారు. ప్రతిరోజు రెండో కంటికి తెలియకుండా ఒకరి సమాచారం ఒకరు తెలుసుకుంటాము. నా ఆచూకీ, నా రహస్యం పోలీసులకు చెప్పి నన్ను జైలుపాలు చేయటం నీకు ఈజీ మరి తర్వాత సంగతి? నా వాళ్ళు ఊరుకోరు. నన్ను జైలు నుంచి తప్పిస్తారు. ఈ లోపలే నీది, నీ భార్యది, శరీరాన్ని అంగుళం, అంగుళం ముక్కలుగా కోసి కైమా చేసి నా

మిత్రబృందం ఆరగిస్తారు. ఓకే, పోలీసులను పిలువు నాకేం భయంలేదు."

వాంగ్ యీచూ, చింగ్ చాంగ్ ముఖముఖాలు చూచుకున్నారు.

"చైనీస్ భాష వచ్చా?" అన్నాడు చూ.

"చైనా వెళ్ళే అవసరం వచ్చిన మర్నాడు నేర్చుకుంటాను. అయినా ఇప్పుడా విషయం దేనికి?"

వాంగ్ యీచూ జవాబు చెప్పలేదు. భార్యవైపు తిరిగి చైనీస్ భాషలో సంభాషణ మొదలుపెట్టాడు. చూ, చాంగ్ పదినిమిషాలు మాట్లాడుకున్నారు చైనీస్ భాషలో. తరువాత నావైపు తిరిగాడు చూ.

నాకు చైనీస్ భాష వచ్చు. కాని, వారు మాట్లాడుకుంటున్నది అర్థంకానట్లు మొహంపెట్టాను.

"నాకు తెలియని భాషలో మాట్లాడుకుని గూడుపుఠాణీ చేస్తున్నారా?" కోపంగా అడిగాను.

"నా మాట కాదనకుండా ఉంటే మీ ఇష్టంవచ్చినట్లు చేస్తాను" చూ అన్నాడు.

"ఓ. కే. డబ్బు గురించేనా? ఎన్ని వేలు కావాలి?"

"డబ్బు కాదు."

"మరి?"

"మీ మధ్య ఉన్న రహస్యం ఏమిటి? మైకేలు, లల్లూరాం ఒకరికోసం ఒకరు ఎందుకు వెతుకుతున్నారు?"

కాసేపు దీర్ఘంగా ఆలోచించాను.

"మిష్టర్ వాంగ్ యీచూ! టూకీగా రెండు ముక్కలు చెపుతాను. ఆ విషయం వెంటనే మరచిపో. అలా మరచిపోవటం నీ ప్రాణానికే మంచిది. నేను, మైకేలు, లల్లూరామ్, కొంతకాలం క్రితం ప్రాణమిత్రులం. ఓ సందర్భంలో

నిధి రహస్యం ఒకటి మాకు తెలిసింది. ఆ నిధిని పొందా లంటే ముగ్గురం ఓ మాటమీద ఉండాల్సింది. ఎవరికివారం విడిపొయ్యాము. గర్భ శత్రువులం అయాము. ఎవరికివారం మందిమార్బలం పోగుచేసుకున్నాము.

ఇదిలా ఉంటే మరో చిక్కు వచ్చింది. నిధిని స్వంతం చేసుకోవాలంటే ముగురం కలవాలి. మా ముగ్గురివద్ద ఉన్న ఆ రహస్యం ఒకేచోటే చేర్చితేగాని, నిధిని పొందలేము. మేము మళ్ళీ ప్రాణమిత్రులం కాదలుచుకోలేదు. ఒకరి నొకరు చంపి ఆ రహస్యం సొంతం చేసుకోవాలని, ముగ్గురం మారువేషాలలో ఉండి సమయం కోసం ఎదురు చూస్తు న్నాము.

మైకేల్ గాడు మూడుసార్లు నా చేత వెంట్రుకవాసిలో ప్రాణం తప్పించుకుని మా ఊరినుంచి పారిపొయ్యి ఈ రంగూన్ వచ్చాడు. వాడిని తరుముతూ నే వచ్చాను. నన్ను తరుముతూ లల్లూరాం వచ్చాడు. లల్లూరాం అనుచరు లను నా మీదకు తోలాడు. లాభం లేకపోయింది. తానే బైలుదేరి వచ్చాడు. చచ్చాడు. వీడి అనుచరులను నావైపు తిప్పుకుని లల్లూరాంవద్ద దాగింది బైటకు లాగుతాను.

పోతే, మైకేల్, వాడు ఎంతకాలం మారువేషాలతో మారుమూలలు దాగి నా కళ్ళు కప్పి తిరుగుతాడు? ఓసారి కొట్టిన దెబ్బకు మూతి పళ్ళు ముందు రెండూ ఊడి కింద పడ్డాయి. మూడో పన్ను కూడా ఊడినట్లయితే మోజుపడి కట్టించుకున్న బంగారుపన్ను కూడా ఊడి కిందపడేది. తొర్రి వెధవ.

ఈ రంగూన్ మారుమూలల్లో వాడెక్కడ దాక్కున్నా వెతికి యమలోకానికి పంపకపోతే నా పేరు సాహూచం" ఆవేశంతో చెప్తున్న నేను చటుక్కున నోరు మూసు

కున్నాను.

"మైకేల్ ఎలా ఉంటాడు?" వాంగ్ యీ చూ అడిగాడు.

"పొట్టిగా; బూడిదపట్టిన గుమ్మడికాయలా ఉంటాడు. మిడిగుడ్లు, ముందు రెండు పళ్ళూ లేవు. ఎడంకాలు ఎత్తి ఎత్తి నడుస్తాడు. ఏం? మైకేల్ గాడు కనపడితే చెయ్యి కలపాలనా?"

"ఉహూ, ఊరికే అడిగాను."

"నాతో చెయ్యి కలుపు. నీ ప్రాణంలా నన్ను చూచుకో. లక్షాధికారిని చేస్తాను మిస్టర్ చూ! లక్షలు నాకో లెక్క కాదు. నాకు కావలసింది అది... అది... నా రహస్యం చెప్పాగాబట్టి ఈ నిమిషంనుండి నాకు నీవు ప్రాణమిత్రుడివి. గర్భశత్రువ్వి. ముద్దుకు ముద్దు. గుద్దుకు గుద్దు. ఓకే, గుర్తుంచుకుని మెలుగు. ఇప్పుడు ఈ అల్లూరాంని ఎలా మాయం చేద్దామంటావు మిస్టర్ చూ?"

"ఆ పని నాకు వదిలెయ్యండి."

"నో. నో, ఏ పనిచేసినా నాతో చెప్పాలి. నా కళ్ళ ముందు జరగాలి."

"మా హోటల్లో పలురకాల మాంసాహారం ఉంటుందని మీకు తెలుసుగా? ఈ శవాన్ని ముక్కలు ముక్కలుగా తురమటం మాంసంలో గుచ్చెత్తటం, ఆ తర్వాత అది ఘుమఘుమలాడే కూరలుగా మారిపోతుంది. ఎముకలను ముక్కలుచేసి గొర్రెలు, చేపలు, మేకలు, పందులు, పడేసే బొమికలు, చర్మాలు ఉంచే వేస్ట్ డ్రమ్‌లో వీడి బొమికలు పడేయటం. వేస్ట్ డ్రమ్‌ని ఎవరూ చూడరు.

డ్రమ్ము మూతతో సహా ఉంటుంది. దానిని ఉదయమే ఖాళీ బండి వచ్చి తీసుకెళుతుంది. బొమికలను మురుగునీరు పోయే కాలవలో బోర్లిస్తారు.

మురికినీటి కాల్వలో కొట్టుకుపోతాయి బొమికలు. ఖాళీ డ్రమ్ తిరిగి క్షేమంగా వస్తుంది. దీనిలో ఏమీ ప్రమాదం లేదు.''

''మాంసం మనిషిదనిగాని, లేక మనం చేసే పని హోటల్ కుక్స్‌గాని, బేరర్స్‌గాని కనిపెడితే, మొదటికే మోసం వస్తుందే? పోనీ ఓ పని చేద్దాం. ఖాళీ పెట్టె ఉంటే చూడు. లేకపోతే తెప్పించు. వీడిని దానిలో పెట్టి నా అనుచరులకు అప్పగిస్తాను. చేయవలసింది వారే చేస్తారు.''

''మీరు చెప్పిందానికన్నా నే చెప్పింది చేయటమే క్షేమం. మాంసంకొట్టు నా ఆధీనంలో ఉంటుంది. పైనే మన పని ముగించి బొమికలను, మాంసాన్ని చేర్చవలసిన చోటుకి చేరుద్దాం.''

''సరే, కాని అంతపనీ నా కళ్ళ ఎదుట జరగాలి. ప్రస్తుతం చేయవలసింది – నాకు కావలసింది వీడివద్ద ఉన్నదా? లేక వీడు దాగున్న చోట ఉన్నదా? వెతకాలి.''

వాంగ్ యూచూ, అల్లూరాం శవాన్ని చూస్తూ ఉండి పోయ్యాడు.

నేను అల్లూరాం వద్దకు వెళ్ళి పక్కనే కూర్చున్నాను. ముందుగా కాలి బూట్లు ఊడదీశాను. మేజోళ్ళు తీశాను. పరీక్ష చేశాను. బూటు మడమలలో పాయిజన్‌ది చిన్న బాటిల్, సిరంజీ, నిడిల్ ఇంజక్షన్‌ది దాచి వుంచె. యధా ప్రకారం బూటు తొడిగాను. పాంటు కోటు జేబులు

వెళిశాను. తలమీద జుట్టు అటూ ఇటూ చెరిపి చూచాను. నిట్టూర్పు విడిచి లేచి నుంచున్నాను.

చచ్చిపోయిన లల్లూరాం ముఖం భయంకరంగా ఉంది. ముఖాన టవల్ కప్పాను.

నా పిచ్చిగాని రహస్యంని రహస్యంగానే దాస్తారు. వెంట తెచ్చుకోరు.

"ముందు మీ ఇంట్లో ఏ పెట్టయినా ఉంటే చూడండి మిస్టర్ చూ! వీడిని దానిలో పెడదాం. తరువాత మావా డొకడికి ఫోన్ చేయాలి. వాడు ఈ నిమిషంనుంచే పని మొదలుపెడతాడు. లల్లూరాం ఎక్కడ దిగింది తెలుసుకుం టాడు. లల్లూరాం దగ్గరవుంది తెలుసుకోందే,ముక్కలుగా నరికామా? అది వీడి శరీరంమీదే ఉంటే నాశనం అవు తుంది. ఇహ ఎప్పటికీ నేనేం చేయలేను. అదంతే భూ స్థాపిత మౌతుంది," అన్నాను.

"అలా అయితే పెట్టె వుంది తీసుకు వస్తాను. దానిలో శవాన్ని పెడదాము. మీరు ఫోన్ చేద్దురుగాని," చూ అన్నాడు.

"అలాగే."

చూ, చాంగ్, ఒకరి వెనుక ఒకరు బైటకు వెళ్ళారు. లల్లూరాంని చూస్తూ కూర్చున్నాను. నా ఆలోచనలు పరి పరి విధాలా పోతున్నాయి.

చూ, చాంగ్‌లు పొడుగాటి కొయ్యపెట్టె మోసుకుని వచ్చారు. నేనూ, చూ కలిసి, లల్లూరాంని పెట్టెలో పెట్టి మూత వేశాము.

"కిందకు వెళ్ళి ఫోన్ చేద్దాము పదండి," అన్నాను.

చూ, చాంగ్, నేను రూమ్‌లోంచి బైటకు వచ్చాము. రూముకి యథాప్రకారం తాళంవేశాను.

"అదేమిటి, పది నిమిషాలలో ఫోన్ చేసి వస్తాము. తాళం దేనికి?" వాంగ్ యీచూ అన్నాడు.

"తాళం వేయకుండా రూమ్ దాటి నాలుగడుగులు వేయటం ఎప్పుడయినా చూచారా? ఇది నా అలవాటు. నా అలవాటుకి విరుద్ధంగా ఏ పనీ చేయను. బద్ధకించటం అజాగ్రత్త నాకు ఎలర్జీ" అంటూ జేబులో కీ వేసుకుని కిందకు బైలుదేరాను.

నాతోపాటు, చూ, చాంగ్ లు కిందకు వచ్చారు.

క్రెడిల్ మీదనుంచి రిసీవర్ అందుకుంటుంటే చూ, చాంగ్ లు నా పక్కనే నుంచున్నారు.

# 6

పడుకుని ఆలోచిస్తున్నాను. తలుపుపై "టిక్, టిక్" అనిన శబ్దం వినవచ్చింది.

చటుక్కున లేచి కూర్చున్నాను.

మళ్ళీ తలుపు తట్టిన శబ్దం వినవచ్చింది.

"ఎవరు?" చేతిలోకి పిస్టల్ తీసుకుని అడిగాను.

"నేనే వాంగ్ యీచూని తలుపు తియ్యండి."

వెళ్ళి తలుపు తీశాను.

వాంగ్ యీచూ చేతిలో నల్లగా నిగనిగలాడుతూ పిస్టల్ ఉంది. అది నావైపు గురి పెట్టబడి ఉంది.

పిస్టల్ పుచ్చుకున్న నా చేతిని పైకి ఎత్తాను.

"ఏమిటి నీ ఉద్దేశ్యం?"

"జాగ్రత్తకోసం. అంతే. మీతో ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి."

"దానికేం మాట్లాడవచ్చు. నేముందే చెప్పాగా ముద్దుకు ముద్దు, గుద్దుకు గుద్దు, నా సిద్ధాంతం అని."

"నే చెప్పబోయేది ముఖ్యమైనది. ప్రాణాలతో పని," చూ అన్నాడు.

"ముఖ్యమైన విషయమైనా, ప్రాణాలతో చలగాట మయినా మన మధ్య పిస్టల్ ఉండరాదు మిస్టర్ చూ? నిన్ను నే నమ్మాను, నన్ను నీవు నమ్ము అంతే. ఇదిగో నా పిస్టల్ పక్కన పడేస్తున్నాను. నీవు పక్కన పడేసి సావధానంగా మాట్లాడవచ్చు," నా పిస్టల్‌ని మంచంమీదకు విసిరేసి అన్నాను.

"నే నీతో మాట్లాడినంత సేపు నా చేతిలో పిస్టల్ ఉంటే అభ్యంతరమా?"

"నాకేం లేదు. కాని...నీవు చూడబోతే ఉజ్జీవి కాదని పిస్తుంది." అంటూ ఛయిర్ లాక్కుని కూర్చున్నాను.

చూ ఎదురుగా కొద్దిదూరంలో నుంచున్నాడు చేతిలో పిస్టల్ ఉంచుకునే.

చూ ఎంతో అవసరం అయితే తప్ప నామీద పిస్టల్ ప్రయోగించడు. ఆ నమ్మకం వుంది.

"మైకేల్ నాకు తెలుసు" నా కళ్ళల్లోకి గుచ్చి చూస్తూ అన్నాడు చూ.

"ఆ!"

"ఎందుకంత ఆశ్చర్యపోతావ్? సరీగా నీవు చెప్పిన గుర్తులు గలవాడే మైకేల్ అయితే వాడెక్కడికీ పోలేదు. ఉన్నాడు."

"ఎక్కడ?"

"స్వర్గానికెళ్ళే దారిలో, మైకేల్ సంగతి మరచిపో; మైకేల్ వద్ద ఏం దాగుందో చెప్పు!"

"నే చెప్పను. పిచ్చిగా మాట్లాడుతున్నావ్, చూ" కోపంగా అన్నాను.

"పిచ్చిగా మాట్లాడటంలేదు. నీవద్ద రహస్యం ఉంది. చచ్చిన అల్లూరాంవద్ద రహస్యం ఉంది. రెండు ఒకటై నీ దగ్గర చేరుతాయి. నీ సొంతం అవుతాయి. అయినా మైకేల్ వద్దది కూడా కలిస్తేగాని పని పూర్తి కాదు. అవునా?"

"అవును" అసహనంగా అన్నాను.

"నేనే మైకేల్ ననుకో. ఏంకావాలి?"

"ఇస్తావా, ఏ దడిగినా?"

"ఆఁ."

"నీవు మైకేల్ వి కాదు! మైకేల్ శరీరం కావాలి. అతని వస్తువులు కావాలి."

"అన్నీ అధీనంచేస్తే నా అవసరం నీకుండదు. కాబట్టి మైకేల్ వద్ద దాగిన రహస్యం చెప్పు. నీ రహస్యం నీ దగ్గర ఉంచుకో. అప్పుడు ఇరువురం సమఉజ్జీ లవుతాము."

"మిష్టర్ చూ! నీవు చాలా తెలివిగలవాడివి. నావద్ద, మైకేల్ వద్ద, అల్లూరాంవద్ద మూడు తాళంచెవి ఆకారం గల బిళ్ళలున్నాయి. ట్రిక్ గా నొక్కితే తాళంచెవి తెరుచుకుంటుంది. చిన్న ప్లాన్ కాగితం దానిలో ఉంటుంది. ఆ ప్లాన్ కి తాళంచెవి కూడా కావాలి. ఒకటి తరువాత ఒకటి తాళంచెవులు ఉపయోగిస్తేనే నిధి స్వాధీనం అవుతుంది."

"గుడ్. మరి నీ అసలు పేరు?"

"చూ, నాకు కోపం తెప్పించకు. బెదిరించి నానుండి రహస్యం లాగుదామని చూస్తున్నావు. మైకేల్ తెలియదు ఏమీ లేదు. ఈ బెదిరింపేమిటి? నా పేరుతో పని ఏమి? నా నిజమైన పేరు కావాలంటే చెపుతా. నా నామం జపిస్తూ కూర్చో. పోలీసులు ఎవరికోసమయితే తీవ్రంగా

గాలిస్తున్నారో, మద్రాస్, బాంబే, కలకత్తా నగరాలలో పంథొమ్మిదిమంది అమ్మాయిలను రేప్ చేసి తప్పించుకు తిరుగుతున్నాడో, లక్షాధికారి హరేరాంని ఘోరంగా హత్యచేసి అతని ఇనప్పెట్టెలో విలువైన సామగ్రి సొంతం చేసుకున్నాడో, ఎవరిపేరు చెపితే మనుషులు హడలి పోతారో, ఆ సాహసాచంగల్ నేనే! నా అసలుపేరు అది. అందరికీ తెలిసినపేరు భగవత్ దాస్."

వాంగ్ యాచూ రెండడుగులు వెనక్కి వేశాడు. "భగవత్ దాస్" అన్నాడు నిర్ఘాంతపోతూ.

"ఊఁ. ఇక చెప్పు, భయపడే పనిలేదు. మైకేల్ నిజంగా నీకు తెలిస్తే చెప్పదలుచుకుంది చెప్పు. ఆ బిళ్ళ తాళంచెవి వుంటే చాలు. మన పని అయిపోతుంది. అంతులేని సంపదతో మనం మీదేశం కాకపోతే మరో దేశం వెళ్ళి రాజుల్లా బ్రతుకుదాము."

"మైకేల్ మరణించి ఉండి, అతని వస్తువులు ఉంటే?" కాసేపు ఆలోచించి అన్నాడు చూ.

"వాడి శవమూ, వస్తువులు కావాలి" అన్నాను.

"మైకేలు మరణించాడు. నేనే అతన్ని చంపాను. ఇందాక చెప్పానే మైకేల్ ని ముక్కలుచేసి కూర వండిం చాను. అందరి కడుపులోకి వెళ్ళి అరిగికూడా పొయ్యాడు."

"ఓ గాడ్, ఎంత పనిచేశావ్ చూ! అతని మెడలో పెద్ద శిలువ వుంది, అదీ పోయిందా? నాశనం సర్వనాశనం. ఆ శిలువలో తాళం బిళ్ళను దాచాడు. నాకు బాగా తెలుసు ఈ విషయం" పెద్దగా అరిచాను కుర్చీలోంచి గబుక్కున లేచి.

"శిలువ ఉంది" నవ్వుతూ అన్నాడు చూ.

...! అయితే, నిధి అన్నావ్. ఆ వివరం నాకు ...ఇద్దరం చెరిసగం వాటా తీసుకుందాం. నన్ను ...తో, చంపటానికి పూనుకోటమో, చేశావనుకో. ఆ ...ఉందీ చెప్పను. చాకనన్నా చస్తాగాని, నాతో ...నా మాయం అవుతుంది. నీవే చెప్పావుగా ...చోట చెరితేగాని నిధి రాదని.''

...చంపటంవల్ల నాకేం వరగదు. చేతులారా ...నం చేసుకున్న వాడినవుతాను. మంచయినా, ...నా మనిషిని మనిషి నమ్మాలి మిష్టర్ చూ! అప్పుడే ...తాయి'' అంటూ నిధి గురించి కొన్ని విషయాలు ...చెప్పే విధంగా చెప్పాను చూకి.

...ముఖం వెలిగిపొయ్యింది.

...కేల్ ని ఎందుకు చంపావు మిష్టర్ చూ!''

...ప్ప లాభం ఏముంది?''

మైకేల్ చచ్చినా బ్రతికినా ఒకటే నాకు కావల ...కాళింబిళ్ళ దాచిన శిలువ. నీ ఇష్టమయితే చెప్పు ...తే, దాచుకో!''

...రం తెచ్చుకోకు. నిజం ఏమిటంటే, హోటల్ ...న్నమాటేగాని పైసా లాభంలేదు. ఇంతవరకు పడి ...ఇలా లాక్కొస్తున్నానంటే లాభాలొచ్చి పెట్టుబడిపై కొంచెం మిగిలీ కాదు. మరో పని చేత ఇలా రోజులు దొర్లిచ్చేస్తున్నాను. ఓ రోజు రెండు ...కేసులతో ఈ హోటల్లో దిగాడు ఒకతను. అతనే ...చ్చిన మైకేల్. నీవు వర్ణించిన రూపం అక్షరాలా పైగా మెడలో పెద్ద శిలువ.''

"అసలు విషయం చెప్పటంలేదు" మా మాటలకు రవంత విసుగు ప్రదర్శిస్తూ అడిగాను.

"వివరం చెప్పకపోతే ఎలా తెలుస్తుంది? మైకేల్ మా హోటల్లో ఏకంగా రెండు నెలలకు బుక్ చేసుకున్నాడు. నీలాగే రూమ్ విడిచి బైటకు వచ్చేవాడు కాదు. ఎప్పుడయినా సాయంత్రం వేళల బైటకు వెళితే పూర్తిగా వేషం మార్చుకునేవాడు."

"ఏ విధంగా తయారయేవాడు?"

"చాలాసార్లు రూమ్లో ఉన్నప్పుడు చూచాను ముందు రెండు పళ్ళు లేవు. కాఫీ టిఫెన్‌కి రూమ్లోంచి బైటకు వచ్చేవాడు కాదు. బేరర్ రూమ్లోపలికి అన్నీ సప్లయి చేసేవాడు. మధ్యమధ్య యోగ క్షేమాలు కనుక్కోటానికి నేను రూమ్లోకి వెళ్ళేవాడిని. అప్పుడు చూచాను. మైకేల్‌కి ముందుపళ్ళు రెండు లేనట్లు. బయటకు ఎప్పుడయినా వెళ్ళాలంటే పళ్ళు పెట్టుకునేవాడి నంటినే ఆ పళ్ళు కొంచెం పొడుగ్గా కనిపిస్తూ ఉండేవి.

మైకేల్ పేరు, మెడలో శిలువ క్రిష్టియన్ అనిపిస్తుంది కదా? కాని...ఇక్కడ తిరిగే ముస్లిమ్స్ తరచు ధరించే దుస్తులు ధరించే ఆ వేషంలో బైటకు వెళ్ళేవాడు. మైకేల్ మీద నాకు అనుమానం వచ్చింది. ఓరోజు అర్ధరాత్రి అతను రెండో ఆట పిక్చర్‌కి వెళ్ళాడు. మారు తాళం చెవితో మైకేల్ రూమ్ తలుపు తెరిచి రూమ్లో ప్రవేశించాను. మైకేల్ ఓ సూట్‌కేసుకి తాళంవేశాడు. మరో సూట్‌కేసుకి తాళంలేదు. ఆ రెండు సూట్‌కేసులు తెరిచి చూచాను. కళ్ళు చెదిరిపోయ్యాయి."

"ఏమున్నాయి దానిలో?" ఆతృతగా అడిగాను.

"అన్ని వందరూపాయల నోట్లు సరికొత్తవి. కొన్ని లక్షలు ఉంటాయి. ఓ పక్కగా బంగారంతో తయారయిన కడ్డీలు, బిస్కెట్స్ ఆకారంతో బంగారం బిళ్ళలు, కిలో తూగే ముత్యాలు, నాలుగు మణులు చిన్నచిన్నవి. ఖరీదెంతుంటుందో తెలియదు. ఇవన్నీ ఉన్నాయి. ఓ పిస్టల్ కూడా ఉంది. మరో సూట్ కేస్‌లో ఖరీదైన సూట్లు ఉన్నాయి. అన్నీ చూచాను. యధాప్రకారం తాళాలు వేశాను.

నాలుగు రోజులు ఆగి మాటల సందర్భంలో అడిగినట్లుగా మీదే ఊరు? మీ వాళ్ళెందరు? అంటూ అడిగాను. నావైపు అనుమానంగా చూచాడు. అదేం నే గమనించనట్లు ఉండిపొయ్యాను. తనకి చాలామంది పిల్లలుట. భార్య నాలుగేళ్ళక్రితం మరణించిందిట. పిల్లలను నాయనమ్మ దగ్గర ఉంచి ఏదయినా బిజినెస్ చేసుకుందామని పొట్టపట్టుకుని ఇలా బైలుదేరి వచ్చాడుట. రెండెకరాల పొలం అమ్మి ఆ డబ్బుతో వచ్చాడుట. ఏం వ్యాపారం చేద్దామా? అని చూస్తున్నాడుట. మైకేల్ చెప్పిన సంగతులు ఇవి" శ్వాస పీల్చుకోటానికా అన్నట్లు ఒక్క నిమిషం ఆగాడు చూ.

"దొంగ వెధవ. తనవద్ద నున్నదంతా మూటగట్టుకుని నాకు కనపడకుండా దాక్కోటానికి పారిపోయి వచ్చాడు. ఊ... మంచి కట్టుకథ అల్లాడు. ఆ తర్వాత ఏమయింది. ఏ విషయంలోనయినా నీతో పేచీ పెట్టుకున్నాడా?"

"ఉహూ, మంచిగానే ఉన్నాడు. డబ్బుకోసం నేనూ చాంగూ ఆలోచించి చిన్న వలపన్నాము. చాంగ్ పుట్టిన రోజు, ఈ రోజు మా ఇంట్లో మాతోపాటు విందు ఆరగిద్దువు గాని రండని పిలిచాను. మైకేల్ నమ్మి రాత్రి డిన్నర్‌కి

మేడపైకి వచ్చాడు.''

''మైకేల్ చాలా జాగ్రత్త మనిషి. మీరు పిలవంగానే వచ్చాడా? నేను నమ్మను.''

''మైకేల్ చాలా జాగ్రత్త మనిషని నేనూ కనిపెట్టాను. చాంగ్‌ని మీరూ చూచారుగా? అందమైనది. నా ప్లాను ప్రకారం. తరుచు మైకేల్‌కి కనపడుతూ అతన్ని ఆరాధిస్తున్నట్టు ప్రేమగా, సిగ్గుగా చూస్తుండేది.''

''అలా చెప్పండి మిస్టర్ వాంగ్ యీచూ! మైకేల్‌కి వెరైటీ సరుకు కావాలి. నాకు బాగా తెలుసు. నీగ్రోస్, ఫ్రెంచ్, ఆంగ్లో ఇండియన్స్, ఫారెన్ గరల్స్, అన్ని రకాల జాతుల ఆడవాళ్ళను చూచాడు.

''డిన్నర్‌కి స్వయంగా చాంగ్ వెళ్ళి పిలవటంవల్ల ఆ రాత్రి పైకి వచ్చాడు. మా దేశంలో ప్రసిద్ధమైన సూప్, అంటూ మొదట టమేటా సూప్‌ని ఇచ్చాము. నిజమే అనుకుని, మా ఆచారం ప్రకారం ముగ్గురం సూప్ తింటూ కూర్చున్నాము. సూప్‌లో మత్తుపదార్థం కలపటంవల్ల మైకేల్ అప్పటికప్పుడే మత్తుగా తల వాల్చాడు. అంతే.''

''అంటే, ఆ తర్వాత...?''

''ఏముంది? వెరీ సింపుల్. చకచక మైకేల్ కంఠం నులమటం, ముక్కలు ముక్కలుగా శరీరాన్ని ఖండించి మాంసం మాంసంలో చేర్చటం, బొమికలను బొమికల్లో చేర్చటం చకచకా అయిపోయింది.''

''మైకేల్ సామానులన్నీ ఎక్కడ దాచారు?''

''మీ ప్లాన్ అర్థం అయింది. సామాను గురించి చెపితే శిలువ తీసుకుందామనా?'' చూ నావైపు తీక్షణంగా చూస్తూ అడిగాడు.

''మిస్టర్ చూ! దొంగయినా, దొరయినా జాయింట్‌గా

పనిచేసేటప్పుడు ఒకరినొకరు నమ్మాలి. నేను ఆ శిలువ కాజేసే ఉద్దేశ్యంతో అడగటం లేదు. యధాలాపంగా అడిగాను. సరే, నేను పూర్తిగా మిమ్మల్ని నమ్మాను. మనం దక్కించుకోబోయే నిధి చెరిసగం. సరేనా? ఇహాపై ముందు కార్యక్రమం గురించి ఇరువురం చర్చించుకుని చేద్దాం. డబ్బుకోసం మైకేల్‌ని చంపినట్లు నన్ను చంపటానికి మాత్రం ప్రయత్నించవద్దు.''

''నా మాటలకు కోపం వచ్చినట్లుంది? సారీ! తొందర పడ్డాను'' చూ అన్నాడు.

''నావద్ద డబ్బు వున్నట్లు చూచారు. మైకేల్‌ని చంపినట్లు నన్నూ చంపటానికి ప్రయత్నిస్తే మీ మెడకు మీరే ఉచ్చు బిగించుకున్నట్లు'' ముందు జాగ్రత్తపడుతూ అన్నాను.

''మనిషిని నమ్మాలని మీరే చెప్పి మళ్ళీ ఇదేం మాట? బంగారు బాతు బంగారు గుడ్డు రోజుకొకటి మాత్రమే పెడుతున్నదని బాతునే చంపితే పొట్టలో ఎన్ని బంగారు గుడ్లు ఉంటాయో అని ఆశపడితే ఫలితం ఏమయిందో నాకు తెలియందికాదు. అలాంటి పిచ్చి పని ఎప్పుడూ చేయను.''

''గుడ్, నిన్ను నమ్ముతున్నాను మిష్టర్ చూ! ఈ లల్లూరాంగాడి శవాన్ని ఇప్పుడే ముక్కలు చేయవద్దు. నా అనుచరులచేత వీడున్న ప్రదేశం, సామాన్లు వెతికించి అప్పుడు చూద్దాం వీడి శరీరంలోనే ఏ భాగంలోనయినా దాచాడేమో?''

''సరే. అలాగే చేద్దాము.''

''ఓసారి ఇప్పుడే మనవాళ్ళకు ఫోన్ చేద్దాము.''

''అలాగే.''

నేనూ, వాంగ్ యీాచూ ఫోన్ చేయటానికి కిందకు బైలుదేరాము.

# 7

తెల్లవారుఝాము 4 గంటలు కావస్తున్నది.

"ఊ, చేతులు పైకెత్తు!" పిస్టల్ కిందకు పైకి ఆడిస్తూ అన్నాను.

"మోసం, ఇదేమిటి? వీళ్ళంతా ఎవరు? నీ అనుచరులా? నన్ను బెదిరించినా, బంధించినా, చచ్చినా ఆ శిలువెక్కడుందో చెప్పను_" వాగ్ యీాచూ కోపంగా ఊగిపోతూ అన్నాడు.

"మిస్టర వాగ్ యీాచూ! శిలువెక్కడుందో నాకు తెలుసు."

"అబద్ధం! నాకూ చాంగ్ కి తప్ప ఎవరికి తెలియని చోట దాచాను. మైకేల్ హత్య బయట పడుతుందేమో అనే భయంతో మైకేల్ ధనాన్ని రెండు మూడేళ్ళదాకా వాడకూడదని పెరటి వేపు భూమిలో పాతిపెట్టి కిచన్ రూమ్స్ పెంచాలంటూ దాని పైగోడ పెట్టించి మరో రూమ్ ఆ వారంలోనే కట్టించాను."

"వెరీగుడ్, మనిషికి ఆవేశం తెప్పిస్తే మూర్ఖుడిలా మారుతాడు. నీ నోటినుంచే ఆశాస్త పూర్తి అయింది. సరే, పిస్టల్ మటుకు మైకేల్ ది కదూ?"

అన్ని రహాశ్యాలు నాకెలా తెలిసి పోయాయా అని, అయోమయంగా ముఖం పెట్టి, అవునన్నట్లు తలాడించాడు వాగ్ యీాచూ.

నా పక్కనున్నతనికి కనుసైగ చేశాను. అతను బైటకు వెళ్ళిపోయాడు.

"నమ్మించి ద్రోహం తలపెట్టావు. నిన్ను మించిన

ద్రోహి ఎక్కడా ఉండడు.'' నవ్వి ఊరుకున్నాను.

బూట్లు టకటకలాడిస్తూ, ఇన్‌స్పెక్టర్ పైకి వచ్చాడు.

''ఇహ నీపని కానియ్యవచ్చు ఇన్‌స్పెక్టర్ భాయ్! నాపని అయిపోయింది.'' బేడీలు తీసుకొని ఇన్‌స్పెక్టర్, వాంగ్‌యాచూ వద్దకు నడిచాడు.

''ఇదేమిటి? ఇదేమిటి?'' వాంగ్‌యాచూ గజగజ వణకిపోతూ అన్నాడు.

''ఓహ్, అసలు విషయం నీకు చెప్పలేదు కదూ? స్మగ్లర్స్‌వల్ల దేశం ఎంతగానో నష్టపోతున్నది. వాళ్ళు మకుటం మకుటంలేని మహారాజుల్లా చలామణీ అవుతున్నారు. పోలీసు డిపార్టుమెంటు ప్రభుత్వము కళ్ళు మూసుకునిలేరు. స్మగ్లర్స్‌ని బంధిస్తూనే ఉన్నారు. అయితే ఉన్నత పదవుల్లో ఉన్న ఉన్నతాధికారులు కూడా కొందరు స్మగ్లర్స్‌తో చేతులు కలపటంవల్ల సరిఅయిన న్యాయం జరగలేదు. ఈ ఎమర్జన్సీలో స్మగ్లర్స్‌ని పట్టుకోడం, వాళ్ళ ఆస్తులు అక్రమ సంపాదనని తెలిస్తే ఆస్తులను జప్తు చేసుకోవడం అమలు పరిచారు. పెద్ద పెద్ద స్మగ్లర్స్‌ని ఎప్పుడయితే ప్రభుత్వం పట్టేసిందో, అప్పుడు కొందరు పెద్ద స్మగ్లర్స్ పరారయారు. మైకేల్ పేరు పొందిన పెద్ద స్మగ్లరు. తనని పట్టుకోడానికి పోలీసులాస్తున్నారని, తన ఉనికి ఆధారాలతోసహా తెలిసిపోయిందని ఎప్పుడయితే తెలుసుకున్నాడో, వీలయినంత రొక్కం నగలు నాణ్యాలు మూటగట్టుకుని పరారయాడు.

మైకేల్ వెనకనే బైలుదేరి వెతుకుతూ రంగూన్‌దాకా వచ్చాము. రంగూన్‌లో మైకేల్ చటుక్కున మాయమయాడు. మైకేల్ ఈ హోటల్లో దిగినట్లు తెలుసుకున్నాము. హోటల్లో దిగిన మైకేల్ హోటల్ దాటి

బైటకి పోనట్లు మాకు తెలుసు.. మరి ఏమయినట్టు? ఈ హోటల్లోనే దాగి ఉన్నాడా? సజీవ సమాధి అయ్యాడా? అది తెలుసుకోడానికే మేము విశ్వప్రయత్నం చేశాము. ఫలితం శూన్యం. నేనో కొత్తప్లాన్ వేశాను. బందిపోటు దొంగ భగవత్ దాస్ రెండేళ్ళ క్రితం జైలునుండి పరారయి ఇంతవరకూ పట్టుపడకుండా తిరుగుతున్నాడు.

ఒక దొంగగా డబ్బు విచ్చల విడిగా వెదజల్లే మారువేషగాడిలా ... బందిపోటు భగవత్ దాసుగా... నేను రూపం దాల్చి నీహోటల్లో స్థానం సంపాదించాను. నన్ను నమ్మావు. నా అనుచరులు నాతోపాటు నాటకం ఆడి సహకరించారు. అల్లూరాం ఎవరనుకున్నావు? ఇదిగో ఈ ఇన్స్పెక్టర్ గారే. అల్లూరాం మరణించాడని చెప్పి, పెట్టెలో పెట్టి మనం కిందకు వచ్చాము. అప్పుడు గాలి కోసం పెట్టెలోంచి బైటకు వచ్చాడు. నేను కాల్చింది బొమ్మపిస్టల్ అల్లూరాం పొట్ట నొక్కుకుంటూ ముందుకు పడిపోతే వీపుమీదనుంచి రక్తం వచ్చే ఏర్పాటు ముందే చేసుకొచ్చాడు.

నీవు, నన్ను బాగా నమ్మాలని పిస్టల్ తో కాలికీ, చేతికీ, కాల్చుకుని గాయం చేసుకు వచ్చాను. నాపై పూర్తి నమ్మకం ఏర్పడింది. నిధిలేదు, నిక్షేపమూలేదు. ఆశ మానవుడిని రాక్షసుడిగా మారుస్తుంది. అదే జరిగింది. అన్నట్లు నీమాటలన్నీ రికార్డు అయ్యాయి. వేరే సాక్ష్యం అక్కరలేదు. ఓ అన్నట్లు నే నెవరో నాపేరు ఏమిటో చెప్పలేదుకదూ? నేను డిటెక్టివ్ ని, నాపేరు విజయ్. ఇప్పుడర్థం అయిందా మిష్టర్ వాగ్ యూచూ!"

వాంగ్ యూచూ తల వంచుకున్నాడు.

-: ఐ పో యిం ది :-

# కాటేసిన యవ్వనం

## టెంపోరావ్

కంట్రాక్టర్ గోపాలరావు ట్రంకాల్ చేసి వాలిగారితో మాట్లాడాడు. వాలిగారి మాటల్నిబట్టి అతను ఆయన్ని విశాఖపట్నానికి రమ్మన్నట్లు గ్రహించాను. ఆయన రిసీవర్ని పెట్టేసి, పడక కుర్చీలో వెనక్కి వాలారు. ఏదో చెప్తారని ఆయనవైపు చూస్తూ కూర్చున్నాను. ఆయన మాట్లాడకుండా చుట్ట కాల్చుకుంటూ వుండిపోయారు.

"వాలిగారూ, మీకు ట్రంకాల్ చేసింది గోపాలరావేనా?" అడిగాను.

"అవును," అన్నారాయన.

ఒక్కోసారి మనం అడిగిందాకా ఆయన మాట్లాడరు. ఆయన ఎప్పుడూ ఆలోచిస్తూ, వూహాలోకంలో జీవిస్తూ

వుంటారేమో!

"మిమ్మల్ని రమ్మన్నట్టున్నాడా?" అని వూహిస్తున్నాను.

"బాగా వూహించావు. మనం కారులో వెళ్తున్నాం. రేపు తెల్లారుజామున బయల్దేరుదాం," అన్నారాయన.

"అతను దేనిలోనైనా ఇరుక్కున్నాడా?"

వాలిగారు పకపక నవ్వారు.

"ఎందులోనో ఇరుక్కుంటేగాని ఏ మనిషీ నాలాంటి డిటెక్టివ్‌ని రమ్మనడని అనేకమంది నీలాగే అనుకుంటారు. ఈసారి మనం వెళ్తున్నది అతడిని రక్షించడానికి కాదు, గిరీ, పెళ్ళవబోతున్న అతని కూతుర్ని దీవించడానికి," అన్నారాయన.

మద్రాస్ వచ్చి వారం రోజులైంది. నిజం చెప్పాలంటే యీ వారం రోజులూ మాకే పనీ లేదు.

కాని వాలిగారు పైకి తీరిక లేనట్లు కనిపిస్తున్నారు. పోలీసు వుద్యోగులతో ఆయన మాట్లాడేవారు. సెంట్రల్ జైల్లో యావజ్జీవిత కారాగార శిక్ష అనుభవిస్తున్న ఒక హంతకుడితో ఆయన రెండు గంటలు మాట్లాడారు. అతడితో అంతసేపు దేన్నిగురించి మాట్లాడారో నాకు అర్థంకాలేదు. ఆయన మాట్లాడేటప్పుడు నే నక్కడలేను. తర్వాత దాన్నిగురించి నే నడిగితే ఆయన నవ్వి వూరుకున్నారు. అప్పట్లో నాతో చెప్పాలనే వుద్దేశం ఆయనకు లేదని గ్రహించాను.

"బయటవాళ్ళు నీ కిచ్చేదే పనని అనేకమంది పొరబడ్తారు, గిరీ! నువ్వు కల్పించుకు చేసేది కూడా పనే!" అన్నాడాయన ఒకసారి నాతో, ఏ పనీ చేతిలోకి రాలేదని నేనగానే.

మర్నాడు విశాఖపట్నానికి బయల్దేరాం. ఆయన కూర్చున్నాను. XYZ కారును శరవేగంగా పోనిస్తున్నాను.

రాజమండ్రీ పట్నం దాటి కారు ప్రయాణం చేస్తోంది. ఆయన ఏదో అమెరికన్ పత్రిక చదువుతున్నారు. చుట్ట పొగ గాల్లోకి ఎగుర్తోంది. ఒక పల్లెటూరు మెయిన్ రోడ్డమ్మట కారు వెళ్తోంది.

"గిరీ!" అన్నారాయన.

ఆయన సౌజ్ఞలనుబట్టి బ్రేకు నొక్కి కారును ఆపాను.

"ఇదే వూరు?"

"మేడపాడు."

"వెనక్కి పోనీ! చంద్రబాబుని చూడాలి," అన్నారాయన.

చంద్రబాబుతో నాకు పరిచయం లేదు. కారును వెనక్కి తిప్పి పోనిచ్చాను. రోడ్డు కిరువైపులా పాపు లున్నాయి.

"ఎడం వైపుకి తిరుగు! దూరంలో కనిపిస్తున్న ఆ తెల్ల మేడ ముందు ఆపు," అన్నారాయన.

కాస్సేపట్లో మేడముందు కారు ఆపాను. మా కారును చూసి అరుగుమీద కూర్చున్న ఒక కుర్రాడు లోపలకు పరుగెత్తాడు. మేం ఇద్దరం కార్లోనే కూర్చుని వున్నాం.

లోపల్నుంచి ఒకతను మెట్లుదిగి నవ్వుతూ కారు దగ్గర కొచ్చాడు. వాలిగార్ని చూడగానే అతని కళ్ళు కాగడాల్లా ప్రకాశించాయి. పంచ, జుబ్బా ధరించాడతను. వయసు నలభై సంవత్సరాలు దాటి వుంటుంది. పొట్టిగా కత్తిరించిన క్రాపు. సన్నగా, పొడుగ్గా వున్నాడతను.

"అయ్యో, వాలిగారూ, మీరిలా వచ్చినందుకు ఎంత ఆనందంగా వుందో చెప్పలేను! రండి, దిగండి!" అన్నాడతను.

"దిగటానికి టైమ్ లేదు. ఈ పూరమ్మట కారు పోతూంటే నువ్వు గుర్తుకొచ్చావు. నిన్ను చూసి పోదామని వచ్చాను!"

"దయచేసి దిగండి. మీరు మా ఇంట్లో అడుగెట్టకుండా వెళ్ళిపోవడం ధర్మంకాదు," అన్నాడతను.

తలుపు తెరిచి ఆయన దిగారు. కారు దిగి వేగంగా ఆయన పక్కకి నడిచాను.

"ఇతను గిరి! నువ్వు మద్రాసులో నన్ను కలుసుకున్నపుడు ఇతను లేడు. బొంబాయి వెళ్ళాడు," అన్నారు వాలిగారు.

అతను నాకు నమస్కరించాడు. మెట్లెక్కి ముందు గదిలోకి వెళ్ళాం. విశాలమైన హాలు. వాలిగారూ, నేనూ సోఫాల్లో కూర్చున్నాం. అతను ఫాన్ స్విచ్చి తిప్పి లోపలకు వెళ్ళాడు. అతను ఒక స్త్రీతో కలిసి హాల్లోకి వచ్చాడు.

"నా భార్య కమల, వాలిగారూ," అన్నాడతను.

వాలిగారు నవ్వుతూ ఆమెకేసి చూశారు. ఏ అవతార పురుషుడినో చూస్తున్నట్లు ఆమె ఆయన్ని చూస్తూ నిలబడిపోయింది.

"అమ్మాయి, కూర్చో!" అన్నారాయన.

ఆమె భర్త వైపు తిరిగింది. ఇద్దరూ పెద్ద సోఫాలో కూర్చున్నారు. ఆమెను పరీక్షగా చూశాను. ఆమె మెళ్లో చాలా నగలున్నాయి. రెండు చేతులకూ డజన్ బంగారం గాజులున్నాయి. చెవులకు కమ్మలు. ఆమె మొహం

చూస్తే అమాయకురాలని తెలుస్తోంది.

"నా హోటల్ గదిలోంచి మాయమైన యాభైవేలూ రెండు గంటల్లో మీ వలన నాకు తిరిగొచ్చిందని చెప్తే కమల ఆశ్చర్యపోయింది సార్! అప్పటినుంచి మిమ్మల్ని చూడాలని కలలు గంటోంది! ఇవాళ దాని కల నిజమైంది," అన్నాడు చంద్రబాబు.

లోపల్నుంచి ఒక యువతి మా గదిలో కొచ్చింది. మాకు ప్లేట్లను అందించింది. ప్లేటులో వున్న జున్ను చూసి సంతోషించాను. గడ్డలా వుంది. చమ్చాతో దాన్ని కోసుకు తినాలి.

"మా ఆవులు రెండు నిన్నే యీనాయి సార్," అంది కమల.

"ఇటువంటి జున్ను పట్నాల్లో దొరకదు! పట్నాల్లోని ప్రజలు మంచి తిండికి దూరమైపోయారు," అన్నారు వాలిగారూ, జున్నును తింటూ.

ఆ యువతి మళ్ళా వచ్చింది. కంచాల్లో రెండేసి మామిడిపళ్ళను తెచ్చి ఆమె మాకు అందజేసింది. "మా తోటలో కాసిన చెరుకు రసాలు!" అంది కమల.

నిజంగా అవి చెరుకు రసాలే! తీయటి రసం! పండును నొక్కితే రసంతో నోరు నిండిపోతుంది. రెండు పళ్ళూ తినేశాను. టెంకల్నీ, తొక్కల్నీ కంచంలో వదిలేశాను. చేతులను కంచంలో కడుక్కున్నాం. ఆ యువతి ప్లేట్లను పట్టుకుపోయింది.

ఆరిపోయిన చుట్టను వాలిగారు వెలిగించి, పొగ వదుల్తూ ఎదురుగా కూర్చున్న దంపతులవైపు చూశారు. "అమ్మాయి,

చాలా థాంక్స్! మీరు నవ్వుతూ అనుమతిస్తే మేం బయ ల్దేరుతాం," అన్నారాయన.

భార్యాభర్తలిద్దరూ లేచి వాలిగారి ముందు కొచ్చారు. చంద్రబాబు ఆయన చెయ్యిని పట్టుకున్నాడు.

"వాలిగారూ, ఇవాళ యిక్కడ వుండి రేపు వెళ్లండి. మీరు మళ్ళీ యిటువైపు రారు," అన్నాడతను.

వాలిగారు చుట్టపొగ వదుల్తూ ఆలోచిస్తున్నారు. నేనైతే "వుంటానని" వెంటనే జవాబిచ్చేవాడిని. తిన్న జున్ను, చెరుకు రసాల రుచులు యింకా నాలికమీద మెదుల్తున్నాయి!

"వాలిగారూ, ఈసారి వచ్చినపుడు కనీసం ఒకరోజు మాతో వుంటానన్నారు మీరు!" జ్ఞాపకం చేశాడతను.

"అలా అన్నమాట నిజమే!" అన్నారాయన.

"పెద్దలు మాట తప్పరు!" అంది కమల.

"అమ్మాయీ, నువ్వు జయించావు. ఉంటాను," అన్నారాయన.

ఆమె సంతోషంగా లోపలకు వెళ్ళింది. కాస్సేపట్లో మాకు చిక్కటి, స్ట్రాంగ్ కాఫీ వచ్చింది. నీళ్ళు కలపని పాలతో చేయడంవలన కాఫీ చాలా రుచికరంగా వుంది.

సాయింత్రం చంద్రబాబు మమ్మల్ని తన తోటకు తీసు కెళ్ళాడు. చాలా పెద్దతోట. వివిధ రకాల చెట్లూ తోటలో వున్నాయి. ప్రతి చెట్టునూ ఆసక్తితో చూస్తూ వాలిగారు కదుల్తున్నారు. పళ్ళు ఇంకా పెద్దవి అవడానికి ఏం ఎరువులు వెయ్యాలో ఆయన చంద్రబాబుకి చెప్పారు. చెట్లనూ, మొక్కల్నూ గురించి ఆయన కంతగా తెలుసని నే నంతవరకూ యెరుగను. ఆయన చెప్పిన కొన్ని విష యాలను చంద్రబాబు డైరీలో రాసుకున్నాడు.

జామిచెట్టుకింద వాలిగారు ఆగారు. మూడు దోర కాయల్ను కోసి చంద్రబాబుకీ, నాకూ ఇచ్చి ఒక టాయన కొరుక్కు తిన్నారు.

"ఇది ఒంటికి చాలా మంచిది!" అన్నారాయన.

తోటలో గడ్డినేలమీద కూర్చుని పాలికాపు తెచ్చి, నరికిచ్చిన ముంజికాయల గుంజును తిన్నాం. అటుపైన చంద్రబాబు సీతాఫలాలు తెప్పించాడు.

ఒక పండును వాలిగారు మధ్యకు విడదీశారు.

"చంద్రబాబూ, సీతాఫలాలు చాలా పురాతనమైనవి. వీటిలో గింజలు ఎక్కువగా వుంటాయి. ఈ మధ్య రిసెర్చి చేసి కొత్తరకం సీతాఫలాన్ని సృష్టించారు. దానిలో గింజలు ఇన్ని వుండవు. గుంజుతో నిండివుంటుంది. దాని విత్తనాలు నీకు పంపిస్తాను," అన్నారాయన.

చంద్రబాబు తన సంతోషాన్ని వెలిబుచ్చి, విత్తనాల కోసం ఎదురుచూస్తానన్నాడు.

సూర్యుడు అస్తమించాడు. చల్లటిగాలి వీస్తోంది. చిలకలు పాడుతూ మాపైనుంచి ఎగిరిపోయాయి. వాటివైపు సంతోషంతో చూశాను. చంద్రకాంతిలో గట్లమ్మట నడిచి ఇంటికి వెళ్తున్నాం. పొలాల్లో ఒకచోట పామును చూసి ఆగాను. టార్చి కాంతిలో వాలిగారు పామును పరీక్షించారు. "జెర్రిగొడ్డు! మనుషులను ఏమీ చెయ్యదు," అన్నారాయన.

చంద్రబాబు ఇంట్లో ఫ్లొరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. పల్లెటూర్లో వున్నా ధనవంతుడైన చంద్రబాబు అన్ని సౌకర్యాలనూ సమకూర్చుకున్నాడు. డాబామీద ఓవర్ హెడ్ టాంక్ కట్టించాడు.

నూతిలోంచి ఎలక్ట్రిక్ మోటర్ టాంక్‌లోకి నీళ్ళను సంపు తుంది. బాత్‌రూమ్స్‌లో షవర్ అమర్చబడింది.

మేడమీదున్న గెస్టురూమ్‌లో రాత్రి నిద్రపోయాం. అది ఏర్‌కండిషన్డ్ గది! గదిలో పడుకుంటే పట్నంలో వున్నట్టుంది. ఆశ్చర్యంగా వాలిగారివైపు తిరిగాను. "పట్నంలో వుండే సౌకర్యాలన్నీ యిక్కడున్నాయి," అన్నాను.

"పట్నంలో దొరకనివి ఇక్కడ ధారాళంగా లభి స్తాయి, గిరీ! మనం తిన్న గడ్డపెరుగు పట్నంలో దొర కదు! అక్కడ వ్యాపారదృష్టి ఎక్కువ. పాలు పితగ్గానే నీళ్ళు పోయకుండా పట్నంలోని మనుషులు వుండలేరు! తాజా కూరగాయలు యిక్కడ దొరుకుతాయి. చంద్ర బాబు ఎమ్మే పాసయి పల్లెలో వుండిపోయి వ్యవసాయం చేసుకుంటున్నాడు. మోజుపడి పట్నానికి పోలేదు!" అన్నారు వాలిగారు.

* * *

కోళ్ళు కూస్తున్నాయి. మేలుకుని పరుపుమీద కూర్చు న్నాను. ఆయన పరుపుకేసి చూశాను. వాలిగారు లేరు! నాకంటె ముందుగా లేచి ఆయన ఎక్కడికో వెళ్ళిపోయి వుంటారు.

మేడమెట్లు దిగి వీధిలోకి వెళ్ళాను. కారు వీధిలోనే వుంది. క్రిందటిరోజు మాకు టిఫిన్ అందించిన యువతి పాడుతూ వీధిలో ముగ్గులు పెడ్తోంది.

ఆమెకేసి నవ్వుతూ చూశాను. పదహారేళ్ళ పిల్ల! చూడ్డానికి అందంగా వుంది. ఆమె ధరించిన దుస్తులు అంత ఖరీదైనవి కావు. అయినా ఆమె శరీరం యవ్వన కాంతుల్తో మెరుస్తోంది.

నన్నామె చూసి సిగ్గుపడ్తూ పాడ్డం మానేసింది. తొందరగా ముగ్గుపెట్టేసి ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

వీధమ్మట నడవసాగాను. పెద్ద ఇళ్ళను దాటిపోయాను, దూరంలో వంతెన కనిపిస్తోంది. వంతెనమీదకు నడిచాను. వంతెన వారగా నిలబడి కాలవ కేసి చూశాను. నీళ్లు ప్రవహిస్తున్నాయి. బూట్ల చప్పుడయి వెనక్కి తిరిగాను.

ఆయనవైపు ఆశ్చర్యంగా చూశాను. ఆయన వంతెన అటువైపునుంచి పెద్ద అంగల్లో నడిచి వస్తున్నారు. నన్ను చూసి ఆగారాయన.

"గిరీ, పాపం సూరమ్మ కాలవలో మునిగి చనిపోయింది," అన్నారాయన.

"సూరమ్మెవరు?" అడిగాను.

"ఒకందమైన అమ్మాయి!" అని ఆయన కాలవ అటువైపు ఒడ్డుకేసి చెయ్యి చూపించారు.

పదిమంది ఒకచోట గుంపుగా నిలబడ్డారు.

"ఆమె శవం అక్కడుందా?"

"ఆమె నిన్నరాత్రి చనిపోయింది. శవాన్ని పోలీసులు పరీక్షకు పట్టుకుపోయారు," అన్నారాయన.

"మీరు యీ వూళ్లో వుండగా ఇంత జరిగినా వార్త మనకు చాలా ఆలస్యంగా అందింది, వాలిగారూ! పోలీసులు మిమ్మల్ని కల్సుకోకుండా పోయారు!"

"గిరీ, మనం అప్పుడు తోటలో వున్నాం! తోట పల్లెకు అటువైపునుంది!" అన్నారాయన.

మరోసారి గుంపుకేసి చూశాను. వాలిగారు పల్లెవైపు నడుస్తున్నారు. నేను వంతెన దాటి ఒడ్డు చేరుకున్నాను. గుంపుగా నిలబడిన వాళ్ళదగ్గర కెళ్లాను. నలుగురు మొగాళ్లు, ఆరుగురు ఆడాళ్ళు వున్నారక్కడ.

"ఇక్కడ ఏమైంది?" అడిగాను.

"సూరమ్మ కాలువలో మునిగిందయ్యా, చచ్చిపోయింది పాపం," అన్నాడొకడు.

"ఆమె తలిదండ్రు లెక్కడుంటారు?"

"తండ్రి లేడు. తల్లి బజ్జీలూ, పకోడాలూ అమ్మి బతుకుతోంది. పాపం, ఒక్కత్తే కూతురు," అన్నాడు మరొకతను.

"వాళ్ళ ఇల్లెక్కడ?"

"శివాలయం పక్కన! అరుగులమీద పొయ్యి, బూరెల మూకుడు మీకు కనిపిస్తాయి," అన్నాడు మూడో మనిషి.

కాలవ అంత వెడల్పుగా లేదు. కాలవలో ఒక గేదె యీదుతోంది. ఒక కుర్రాడు దాని వీపుమీద కూర్చుని వున్నాడు. ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించి వెనక్కి తిరిగాను.

చంద్రబాబు ఇంటికి చేరుకున్నాను. వాలిగారికి ఎదురుగా కమల, చంద్రబాబు కూర్చుని వున్నారు. ఆమె ముఖంలో విచారం గోచరిస్తోంది.

"వాలిగారూ, సూరమ్మ వృషాగైన పిల్లండి! గత సంవత్సరమే అది పెద్దమనిషయింది," అంది కమల.

"కాలవలో ఆమె ఎందుకు మునిగి వుంటుంది? రాత్రిళ్లు ఎవ్వరూ స్నానం చెయ్యరే!" అన్నారాయన.

"కొందరు ఆమె ఆత్మహత్య చేసుకున్నది అంటున్నారా, సార్," అంది కమల.

"ఆత్మహత్యా? ఎందుకు?"

"పుస్తకాలు చదివి, సినిమాలు చూసి యువతులు ప్రేమలో పడ్డారండి," అందామె.

"ఆమె ఎవర్నైనా ప్రేమించిందా?" వాలిగారు ప్రశ్నించారు.

"అదంతా సుబ్బమ్మతో మాట్లాడితే మీకు తెలుస్తుంది. సుబ్బమ్మ దాని తల్లి. మగడు పోయాక బజ్జీలూ అవీ అమ్మి బతుకుతోందండి."

"నూరమ్మ ఎక్కడా పని చేయడం లేదా?"

"రెండు మూడు ఇళ్ళల్లో అది పని చేస్తోంది. డాక్టర్ చలపతి ఇంట్లో పనికి ఒప్పుకోవద్దని నూరమ్మతో నేనన్నాను. కాని అది వినలేదు."

"డాక్టర్ చలపతి నుంచివాడు కాదా?"

"మంచివాడే వాలిగారూ! అయినా కుర్రాడు. పట్నంలో చదువుకుని ఇక్కడకొచ్చాడు. బ్రహ్మచారి. బ్రహ్మచారి, కన్యా ఒకచోటుండడం మంచిదికాదు, వాలిగారూ!" అందామె.

"అమ్మాయి బాగా చెప్పావ్! వాళ్ళలో ఏ క్షణంలో ఏం రగులుకుంటుందో చెప్పలేం! వయసులో వున్నవాళ్ళు ఆకల్ని ఆపుకోలేరు! ఆకలి వాళ్ళచేత నేరాలు చేయిస్తుంది," అన్నారు వాలిగారు.

గదిలో నిశ్శబ్దంగా వుంది. ఆ యువతి, ఆమె పేరు కనుక్కోవాలి, ప్లేటలో పెసరట్లు తెచ్చి మా కిచ్చింది. కొత్తిమిరి పచ్చడి నంచుకుంటూ అరడజను పెసరట్లు తిన్నాను. కమలా, చంద్రబాబూ ఎదురుగా కూర్చుని మమ్మల్ని రెచ్చగొట్టి ఎక్కువగా తినేటట్లు చేస్తున్నారు.

"వాలిగారూ, నూరమ్మకి ఏం జరిగిందో మీరు కనుక్కోండి సార్. అమాయకపు పిల్ల! అన్నెం పున్నెం ఎరుగనిది!" అంది కమల.

వాలిగారు విచిత్రంగా నవ్వారు.

"అమ్మాయి, కాలువలో పడి సూరమ్మ మరణించిందని వినగానే విశాఖపట్నం యివాళ వెళ్ళకూడదని నిశ్చయించుకున్నాను. సూరమ్మ మరణం గురించి దర్యాప్తు చేస్తాను," అన్నారాయన.

వేడి కాఫీ తాగాం. వాలిగారు సోఫాలోంచి లేచారు చెయ్యి కడుక్కోడానికి. నేను స్నానాల గదిలోకి వెళ్ళాను. ఆ యువతి నాకు తువ్వాలిచ్చింది. ఆమెకేసి నవ్వుతూ చూశాను.

"నీ పేరు?" అడిగాను, తువ్వాలా మెకిచ్చేసి.

"లచ్చమ్మండి!" అని ఆమె పారిపోయింది.

ముందు గదిలోకొచ్చాను. వాలిగారి వెనకనే మెట్లు దిగాను. చంద్రబాబు మాతో వచ్చాడు. ముగ్గురం రోడ్డమ్మట నడిచాం. కొన్ని మలుపులు తిరిగి శివాలయం పక్కనున్న ఆమె ఆమె ఇంటిముందుకు చేరుకున్నాం.

అరుగుమీద పొయ్యి వుంది. కాని కట్టెలు కాలడం లేదు. లోపల గదిలోంచి ఏడుపు వినపడింది. చంద్రబాబు లోపలికెళ్ళాడు.

"లోకాన్ని అధరగొట్టే వాలిగారొచ్చారు. మీ అమ్మాయికి ఏమైందో ఆయన కనుక్కుంటారు," అన్నాడు చంద్రబాబు. వీధిలో నిలబడిన మాకు అతని మాటలు వినపడ్డాయి. ఆమె పెద్దకంఠంతో ఏడవసాగింది. వాలిగారు లోపలికెళ్ళారు. వెనకనే నేను మెట్లెక్కాను.

పెద్ద గది. గదిలో కుర్చీలు అవీ లేవు. నేలమీద కూర్చుని సుబ్బమ్మ ఏడుస్తోంది. ఆమె చుట్టూ యిరుగు పొరుగు వాళ్ళున్నారు. సుబ్బమ్మ తెల్లచీర కట్టుకుంది. ఆమె వయస్సు ముప్ఫయి అయిదుంటుందేమో! ఆమె

రవిక ధరించలేదు. చీర కొంగుతోనే తన స్తనాలను కప్పుకొంది.

వాలిగారు ఆమెకేసి సూటిగా చూశారు. ఆమె కళ్ళు తుడుచుకొంది.

"నీ కూతురు సూరమ్మ రాత్రివేళ కాలవొడ్డుకు ఎందు కెళ్ళింది?" అడిగారాయన.

"నాతో చెప్పలేదయ్యా!"

"ఆమె కాలవలో పడిందని నీ కెవరు చెప్పారు?"

"చిన్నబ్బాయి చెప్పాడయ్యా. ఆడు మా ఇంటి పక్కనే వుంటాడు."

"నువ్వు కాలవొడ్డుకు వెళ్ళావా?"

"వెళ్ళానయ్యా! వెళ్ళి చేసేదేముంది? దాన్ని లాగి ఒడ్డున పడేశారు. అప్పటికే ప్రాణం పోయింది. నేనెళ్ళి ఏడుస్తూ శవంమీద పడిపోయాను," అంది సుబ్బమ్మ.

చుట్ట పొగ వదుల్తూ ఆయన ఆమెవైపు సూటిగా చూశారు.

"ఆమె ఆత్మహత్య చేసుకుని వుంటుందా?"

"బంగారంలాటి పిల్ల ఎందుకు కాలవలో పడి చస్తుం దయ్యా? డాక్టర్ చలపతిగారు దాని బుర్ర పాడుచేసి వుంటారు. ఆయనింట్లో పని కెళ్ళొద్దని ఎంత చెప్పినా అది వినేది కాదు," అందామె.

"అతను ఏవిధంగా పాడుచేసి వుంటాడు?"

"చలపతిగారంటే దానికి మహా మోజయ్యా! తెల్లారు జామునే లేచి ఆయనింటికి పరుగెత్తేది!"

"చలపతితో మాట్లాడావా?"

"ఏం చెప్తారండాయన? ఆమె గురించి తనకేమీ తెలియదని తప్పించుకున్నారు! మొహంలో మాత్రం

విచారం చూపిస్తున్నారు!" అంది సుబ్బమ్మ.

"నువ్వు నూరమ్మకి ఎందుకింకా పెళ్ళి చేయలేదు?"

"సుబ్బరాజు దాన్ని పెళ్ళాడ్తానని నాతో రోజూ చెప్పేవాడు. వాడు వడ్రంగి పని బాగా చేస్తాడు. డబ్బు సంపాదిస్తున్నాడు. ఇంటి కొచ్చేవాడు. వాడిని చూసి అది వెకిలిగా నవ్వేది. వాడ్ని పెళ్ళాడ్డమేమిటి అనేది!"

"సుబ్బరాజు ఎక్కడుంటాడు?"

"రామసుబ్బయ్యగారి యింట్లో గది అద్దె కుచ్చుకుని వుంటున్నాడయ్యా," అంది సుబ్బమ్మ.

వాలిగారు మరే ప్రశ్నలూ అడగకుండా బయటకు నడిచారు. వీధిలో ఆయన నిలబడ్డారు. చంద్రబాబు ఏదో ఆయనతో చెప్తున్నాడు.

"గిరీ, ఇక్కడకు కారు తీసుకురా!" అన్నారాయన.

నేను చంద్రబాబు ఇంటికి పరుగెత్తాను. కాస్సేపట్లో XYZ కారును వాళ్ళ పక్కనే ఆపాను. వాలిగారూ, చంద్రబాబూ ముందు సీటుమీద కూర్చున్నారు.

"సామర్లకోట వెళ్దాం," అన్నారాయన.

కారును స్టార్ట్ చేసి సామర్లకోట వైపు స్పీడుగా పోనిచ్చాను. గవర్నమెంట్ హాస్పిటల్ ముందు కారాపాను. వాలిగారు, చంద్రబాబు దిగారు. మేం ముగ్గురం లోపలకు వెళ్ళాం.

డాక్టర్ జోగారావు వాలిగారికి నమస్కరించాడు.

"నూరమ్మ అనే యువతి శవాన్ని పోలీసులు ఇక్కడకు పంపారని విన్నాను," అన్నారు వాలిగారు.

డాక్టర్ జోగారావు మమ్మల్ని ఒక గదిలోకి తీసుకు వెళ్ళాడు. పొడుగాటి టేబుల్ మీద తెల్లటి దుప్పటి

కప్పబడి వుంది. డాక్టర్ జోగారావు దుప్పటిని పూర్తిగా తీసేశాడు.

మా కళ్ళముందు సూరమ్మ శవం నగ్నంగా పడుకుని వుంది. ఆమె వయస్సు పదహారు లోపున వుంటుంది. పచ్చటి శరీరచ్ఛాయ. కడుపు ఇప్పుడు వుబ్బిలేదు! కళ్ళు మూసున్నాయి. వాలిగారు ఆమె గొంతునూ, కొంచెం పక్కకి కదిల్చి మెడనీ పరిశీలించారు. మెడమీద గాట్లు వున్నాయి. రెండు చోట్ల ఏదో గుచ్చుకున్నట్లుంది!

గాట్లను ఆయన పరీక్షగా చూశారు.

"డాక్టర్ ఎవరి గోళ్లో ఇక్కడ గుచ్చుకుని వుండాలి?" అన్నారాయన.

"అదే నేననుకున్నాను సార్," అన్నాడు డాక్టర్ జోగారావు.

"శవ పరీక్ష అయిందా?"

"అయింది సార్," అన్నాడతను.

బల్ల చివరకి నడిచి వాలిగారు ఆమె కాళ్ళను, పై భాగాన్ని పరీక్షించారు.

"వాలిగారూ, ఈ శవాన్ని గురించి కొన్ని విషయాలు నేను చెప్పగలను. ఈమెకు పెళ్ళికాలేదని విన్నాను, కాని ఈమె కన్యకాదు. గర్భవతి అని కూడా నా అనుమానం," అన్నాడు డాక్టర్ జోగారావు.

మౌనంగా గదిలోంచి వాలిగారు బయటకు నడిచారు.

అందరం కారు దగ్గరకు వెళ్ళాం.

"మిమ్మల్ని చూసినందుకు చాలా సంతోషిస్తున్నాను," అన్నాడు డాక్టర్ జోగారావు.

"అబ్బాయి, ఆ పిల్ల శవాన్ని చూశాక మనుషులను చూసి నాకు నవ్వాలనిపించడం లేదు. ఎవరో ఆమెను

బలవంతంగా నీళ్ళలో ముంచి నొక్కిపెట్టారు. తన ప్రాణాన్ని కాపాడుకోడానికి పాపం ఆమె చాలా యుద్ధం చేసింది. ఆ సమయంలో నొక్కిపట్టిన వాళ్ళ చేతి గోళ్ళు ఆమె శరీరంలోకి దిగాయి," అన్నారు వాలిగారు.

"అలా దిగుండొచ్చు, సార్," అన్నాడు డాక్టర్.

కారును పోనిచ్చాను. పోలీసుస్టేషన్ ముందు ఆపాను. వాలిగారు దిగి లోపలకు వెళ్ళారు. చంద్రబాబు కార్లోనే వుండిపోయాడు. నేను వాలిగార్ని లోపలకు వెంబడించాను.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు తృప్తిపడుతూ లేచి నిలబడ్డాడు.

"వాలిగారూ, దయచేసి కూర్చోండి!" అన్నాడతను.

వాలిగారి పక్కనే నేనూ కూర్చున్నాను.

"సుబ్బారావు భాయ్, నూరమ్మ శవాన్ని చూశాను," అని పూరుకున్నా రాయన.

"పాపం, కాలవలో పడి చచ్చిందండి! ఆత్మహత్య చేసుకుందని అక్కడవాళ్ళు అనుకుంటుంటే విన్నాను!"

"ఆత్మహత్య ఎందుకు చేసుకుంటుంది? నూరమ్మకి కావలసినంత అందముంది! ఎక్కడేనా పనిచేసుకుని ఆమె సుఖంగా బతగ్గలదు!"

"ఆమె గర్భవతని డాక్టర్ అన్నాడు. ఎవడో ఆమెను నమ్మించి మోసం చేసుంటారు సార్," అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు.

వాలిగారు అతనికేసి సూటిగా చూశారు.

"ఆమె ఒంటిమీద నగలూ అవీ లేవా?"

"చేతికి రెండు గాజులు, చెవులకు రింగులు వున్నాయి.

అవి గోల్డు కోటెడ్ వి. వాటిని మా దగ్గర వుంచాం," అన్నాడతను.

"సూరమ్మను ఎవరో ఘోరంగా చంపారు. ఆ సమయంలో స్నానం చెయ్యడానికి ఆమె నదిఒడ్డుకు వెళ్లిందదు. ఎవరో ఆమెను నీళ్ళలోకి తోసి, నొక్కి పెట్టి చంపారు," అన్నారు వాలిగారు.

ఇన్ స్పెక్టర్ సుబ్బారావు ఆశ్చర్యంగా వాలిగారికేసి చూశాడు.

"వాలిగారూ, మీరు సహాయపడ్తే ఆమె హత్యకు కారకురాలెవరో తెలుస్తుంది," అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఇదేదో తెలిసిన దాకా నేను మేడపాడులోనే వుంటాను," అని కుర్చీలోంచి లేచారు వాలిగారు.

* * *

డాక్టర్ చలపతి యువకుడు. అతను నవ్వుతూ మావైపు చూశాడు. కాని లోలోపల అతను భయపడ్తూ వుండాలి! పాంటు, స్లాక్ ధరించాడతను. ఎడం చేతికి ఖరీదైన వాచ్ వుంది. అతని కన్ సల్టింగ్ గదిలో వాలిగారూ, నేనూ కూర్చున్నాం.

"అబ్బాయి, మెడికల్ డిగ్రీ సంపాదించి నువ్వు యీ పల్లెటూరికి ఎందుకొచ్చావు?" ప్రశ్నించారాయన.

"ఒక చారిటీట్రస్టు నాకు స్కాలర్ షిప్ యిచ్చింది సార్. వాళ్ళిచ్చిన డబ్బు సహాయంతో నేను ఎమ్. బి. బి. యస్. చదివి పాసయ్యాను. వాళ్ళ రూల్సు ప్రకారం కనీసం ఒక సంవత్సరంపాటు నేను ఏదో పల్లెటూరులో ప్రాక్టీసు పెట్టాలి," అన్నాడు చలపతి.

"పల్లె ప్రజలకు సేవ చెయ్యాలనే వున్నతాశయంతో నువ్విక్కడకు రాలేదు!" అన్నారు వాలిగారు.

"వాలిగారూ, అటువంటి ఆశయాలు నాకూ వున్నాయి! అందువలననే అన్నివిధాలా పల్లెప్రజలకు సేవ చేస్తున్నాను," అన్నాడతను.

"సూరమ్మ ఇక్కడ పనిచేసేది!"

"అవును సార్. ఆమె హఠాత్తుగా కాలవలో పడి చనిపోయిందని విని ఆశ్చర్యపోయాను," అన్నాడతను.

"అబ్బాయీ, సూరమ్మ అందమైన పిల్ల. నువ్వు యువకుడవు. ఆమెకేమైనా ఆశలు చూపించి, అనుభవించావా?"

"వాలిగారూ!" అన్నాడతను, కాని అతని పెదిమలు వణుకుతున్నాయి.

"అబ్బాయీ, ఏ కారణం లేకుండా ఆమె కాలవలో పడి చావదు. ఆమె గర్భవతి! తల్లికి తెలియకుండా ఆమె ఇదంతా చేయగల్గింది."

"నాకేం తెలియదు సార్. ఆమె నా ఇంట్లో పనిచేసి వెళ్ళిపోయేది. నేను జీతం ఇచ్చేవాడిని. నెలకు పదిరూపాయిలు. సుబ్బరాజు వాళ్ళింటికి వెళ్తూ వుండేవాడని విన్నాను. వాడిని అడిగితే మీకు ఏదేనా తెలుస్తుందేమో!" అన్నాడతను.

వాలిగారు కుర్చీలోంచి లేచారు.

"ఆమె గురించి నాకేదేనా చెప్పదలిస్తే చంద్రబాబు యింటికి రా," అని బయటకు నడిచారాయన.

మరోసారి అతనివైపు చూశాను. అతనితో కరచాలనం చేశాను.

"డాక్టర్ చలపతీ, ఏదేనా వుంటే చెప్పడం మంచిది. ఎలాగైనా ఆయన కనుక్కుంటారు," అన్నాను.

"ప్లీజ్, నన్ను ఆలోచించనివ్వండి!" అన్నాడతను, వేళ్ళతో నిమురుకుంటూ.

బయటకు వెళ్ళాను. వాలిగారు గబగబా నడుస్తున్నారు. కాస్సేపట్లో ఆయన పక్కకు చేరుకున్నాను.

సుబ్బమ్మ ఇంటి పక్కనున్న యింటికి వాలిగారు వెళ్ళారు. పదహారేళ్ళ కుర్రాడు మాకు ఎదురయ్యాడు.

"చిన్నబ్బాయి నువ్వేనా?" అడిగారాయన.

"అవునండి," అన్నాడతను.

"సూరమ్మ కాలవలోకి దూకటం నువ్వు చూశావా?"

"లేదండి. సూరమ్మ అక్కడ తిరుగుతూ వుండడం చూశాను."

"ఆమె అక్కడ ఒంటరిగా తిరుగుతోందా?"

"రాత్రిళ్ళు అక్కడెవరూ వుండరండి. పొలంనుంచి నేను కాలఒడ్డమ్మట వస్తూన్నానండి. అప్పుడు ఆమెను చూశాను."

"తర్వాత నువ్వు ఎటు వెళ్ళావు?"

"నేను వంతెనకాడ మాట్లాడుతూ నిలబడ్డానండి."

"ఎవరేనా ఒంతెన దాటడం చూశావా?"

"డాక్టరబ్బాయిగారు నా పక్కనుంచి వెళ్ళారండి. ఆయన ఎక్కడికెళ్ళారో నేను గమనించలేదు."

"నువ్వు సూరమ్మ కాలవలో పడిందని సుబ్బమ్మకు ఎలా చెప్పావు?"

"కొంతసేపయ్యాక పైడిసెట్టి కొట్టుదగ్గర ఆ వార్త విన్నానండి. ఎవరు కాలవలో పడ్డారో సూద్దామని పరుగెత్తుకెళ్ళానండి. కొందరు దాన్ని లాగి ఒడ్డున పడేశారు. వెంటనే వెళ్ళి సుబ్బమ్మతో చెప్పానండి," అన్నాడు చిన్నబ్బాయి.

"ఒంతెన దగ్గర నువ్వు వుండగా ఆ ప్రాంతంలో తిరిగినవాళ్ళందర్నీ చూశావా?"

"చూశానండి. రామరాజు వెళ్ళాడు. కోటిలింగాలు రావడం చూశాను. సుబ్బరాజు గబగబా వెళ్తుంటే చూసాను."

"అతను ఎటు వెళ్తున్నాడు?"

"వంతెన దాటిపోతూంటే చూశాను సార్."

వాలిగారు నవ్వుతూ అతని భుజంమీద తట్టారు.

"సూరమ్మ నీ వయస్సుదే? చిన్నప్పుడు నువ్వూ, సూరమ్మా ఆడుకుని వుండాలి," అన్నారాయన.

"ఆడుకునేవాళ్ళమండి. పెద్దదైనాక అది మాకు దూరమైపోయింది," అన్నాడతను.

వాలిగారు వెనక్కి తిరిగారు. సుబ్బమ్మ యింటిముందు ఇద్దరం క్షణకాలం నిలబడ్డాం. ఎవ్వరూ ఏడ్వడంలేదు. మనిషిపోతే కొంతసేపు ఏడుస్తారు, తర్వాత జీవితం మామూలుగానే సాగిపోతూ వుంటుంది.

"వాలిగారూ, ఇప్పుడు మనం ఎక్కడికి పోదాం?"

"గిరీ, ఇది పట్నంకాదు, పల్లెటూరు. నాలుగే వీధులు. నడుద్దాం పద," అన్నారాయన.

ఒక ఇంటిముందు ఆయన ఆగారు. పెద్ద అరుగులు. గుమ్మంలో నిలబడిన స్త్రీ మావైపు చూసింది. మెట్లెక్కి గుమ్మం దగ్గరకు వెళ్ళాం. ఆమె మావైపు ప్రశ్నార్థకంగా చూసింది.

ఆమె పొడుగ్గా, లావుగా వుంది. సిగ చుట్టుకుని జుత్తులో మల్లెపూలు పెట్టుకుంది. నుదురుమీద రూపాయంత బొట్టుంది.

"రామసుబ్బయ్య యిల్లు యిదేనా?" అడిగారాయన.

"ఇదేనండయ్యా! మీ రెవరో ఊళ్ళోంచొచ్చారని విన్నాను, రండి," అందామె.

లోపలకు వెళ్ళాం. పెద్ద గది. గదిలో కుర్చీలున్నాయి. ఇద్దరం కూర్చున్నాం. ఆమె దూరంగా మరో కుర్చీలో కూర్చుంది.

"మీ భర్త ఇంట్లో లేరా?" అడిగారు వాలిగారు.

"ఆయన తిరపతివెళ్ళి మూడేళ్ళు దాటింది. ఇంటికి తిరిగిరాలేదు. ఆయనకోసం యింకా ఎదురుచూస్తున్నా," అందామె.

"సుబ్బరాజు ఇక్కడుంటున్నాడని విన్నాను."

"సుబ్బరాజా? అతను బయటకెళ్ళాడు. కాస్సేపట్లో రావచ్చు," అందామె.

"నిన్నరాత్రి సుబ్బరాజు ఎక్కడికి వెళ్ళాడు?"

"అతను ఎక్కడకూ వెళ్ళలేదు సార్, ఇక్కడే వున్నాడు. రెండు కుర్చీలు పాడైతే వాటిని బాగుచేస్తూ వున్నాడు," అందామె.

"అతను కాలవదగ్గర కెళ్ళాడని విన్నాను. చిన్న బ్బాయి చెప్పాడు!"

"వాటి మాటలు నమ్మకండయ్యా! చిన్నబ్బాయి పచ్చి అబద్ధాలు చెప్తాడు!" అందామె.

అప్పుడే ఒకతను యీలపాట పాడుతూ మెట్లెక్కి గదిలోకొచ్చి మమ్మల్ని చూసి నిశ్శబ్దంగా వుండిపోయాడు. అతను బలంగా వున్నాడు. పంచ కట్టుకుని, పొట్టిచేతుల స్లాక్ వేసుకున్నాడు. మనిషిలో అందం లేకపోయినా, అతని శరీరం గట్టిగా వుంది!

"రాజూ, వీళ్ళు నీకోసమే వచ్చారు!" అందామె.

అతను ఒక స్టూల్ మీద చతికిలబడ్డాడు.

"సూరమ్మ గురించి నీతో మాట్లాడ్డానికొచ్చాను," అన్నారు వాలిగారు.

"అమాయకురాలు కాలవలో పడి చచ్చింది. నన్ను పెళ్ళాడుంటే పువ్వుల్లో పెట్టి పూజించేవాడిని," అన్నాడతను.

"నువ్వు పెళ్ళాడా లనుకున్నావు, కాని ఆమెకా అదృష్టం లేదు!" అందామె.

"నువ్వూరుకో, పారిజాతం? ఆమె పోయిందని విన్నాక నేనెంత బాధపడ్తున్నానో నీకు తెలియదు! ఆ డాక్టర్ వెనుకబడి జీవితాన్ని పాడు చేసుకుంది!" అన్నాడతను.

"అబ్బాయి, డాక్టర్ చలపతితో ఆమెకు సంబంధ ముందని అంటావా?"

"అతనంటే నా కెంతో ప్రేమ సార్. నేను వాళ్ళ ఇంటికి వెళ్ళేవాడిని. నాకేసి చిన్నచూపు చూసేది. తను కుర్చీలు చేసేవాడి పెళ్ళాం కాడానికి పుట్టలేదంది. అలా అన్నా నేనేమీ అనలేదు. ఎప్పుడో మనసు మారి నన్ను పెళ్ళాడుతుందని వూరుకున్నాను. సంవత్సరం అయ్యాక డాక్టర్ వెళ్ళిపోతాడు. అటుపైన దానికి బుద్ధి వస్తుందనుకున్నాను."

"డాక్టర్ చలపతితో జాగ్రత్తగా వుండమని ఆమెను నువ్వు హెచ్చరించావా?" అడిగారాయన.

"నేను చెప్పినా ఆమె వినిపించుకునేది కాదు. ఆమె దృష్టిలో డాక్టర్ చలపతి దేముడులాంటివాడు. అతడిని గురించి ఆమె కలలు కనేది!"

"అబ్బాయి, నిన్నరాత్రి నువ్వు బయటకు వెళ్ళావా?" అడిగారు వాలిగారు.

"లేదు సార్. పారిజాతంగారు రెండు కుర్చీలు పడేసి రిపేరు చెయ్యమన్నారు. వాటిని బాగుచేస్తూ ఇక్కడే వున్నాను," అన్నాడతను.

"నువ్వెంతవరకూ ఇక్కడున్నావు?"

"నేను పని ముగించేసరికి పది దాటింది, సార్," అన్నాడతను.

వాలిగారు వేరే ప్రశ్నలు అడగలేదు. ఆయన వీధిలోకి వెళ్ళారు. నేను ఆయన ప్రక్కకు చేరుకున్నాను.

"గిరీ, మనం కలుసుకున్నవారందరూ ఏదో దాస్తున్నారు. డాక్టర్ చలపతి నిజం చెప్పడంలేదు. సుబ్బరాజూ ఏదో దాస్తున్నాడు," అన్నారు వాలిగారు.

ఇద్దరం చంద్రబాబు ఇంటికి చేరుకున్నాం.

* * *

తెల్లారింది. ఆవులిస్తూ పరుపుమీద లేచి కూర్చున్నాను. వాలిగారు ఎక్కడికో వెళ్ళడానికి తయారవుతున్నారు. గబగబా దుస్తులు మార్చుకున్నాను. మెట్లు దిగి వీధమ్మట నడుస్తూన్న ఆయన్ని కలుసుకోగల్గాను.

"గిరీ, బాగా నిద్ర పట్టిందా?" అడిగారాయన.

"అఖండంగా నిద్రపోయాను," అన్నాను.

ఆయన గంభీరంగా నవ్వారు.

"గిరీ, నువ్వు రాత్రి పలవరించావు! కోర్కెలకు బానిసైన మనిషి సుఖంగా పడుకోలేడు," అన్నారాయన.

"నాకు ఏ కోరికలూ లేవు! వాలిగారూ, మీతో వుంటే నాకెంతో ఆనందంగా వుంది," అన్నాను.

"నాతో వుంటే నీకు ఆనందంగా వుంటుందని నాకు తెలుసు! గిరీ,సూరమ్మ శవాన్ని నగ్నంగా నువ్వు చూశావు.

ఆమెను గురించి ఆలోచిస్తూ నిద్రపోయి వుంటావు!" అన్నారాయన.

"ఆమె చాలా అందంగా వుంది!" అన్నాను.

"గిరీ, అందమైన యువతులు అనేక విధాలుగా బలై పోతారు! సూరమ్మ అందంగా లేకపోతే సుఖంగా జీవిస్తూ వుండేది! అందం ఆమెకు ఒక విధంగా శత్రువైంది!" అన్నారాయన.

డాక్టర్ చలపతి యింటిముందు ఆగాం. వాలిగారు లోపలకు వెళ్ళారు. ఆయన వెనుకనే నేనూ వెళ్ళాను. కన్సల్టింగ్ రూమ్‌లో వున్న చలపతి మావైపు గాభరాగా చూశాడు.

"వాలిగారూ, మీ దగ్గరకు వద్దామనుకుంటున్నాను," అన్నాడతను.

"ఎందుకు?"

"మీతో నిజం చెప్పాలని నా ఆశ," అన్నాడతను.

"నిజం చెప్పడం యెప్పుడూ మంచిది!" అన్నారాయన.

"వాలిగారూ, మా ఇద్దరి హృదయాలూ కలిశాయి. మాకు అన్నివిధాలా సంబంధం ఏర్పడింది. నేను చదువుకున్నవాడిని. ఆమె పనిమనిషి. దాన్ని నేను ఈమధ్య గుర్తించాను. నా మూలంగా ఆమె గర్భవతి అయింది, కాని నేనామెను వివాహమాడలేను! ఒకరోజు అదంతా ఆమెతో నేను చెప్పాను. తనని నేను మోసగిస్తున్నానని ఆమె అనుకుంది. ఆమెను మోసం చేయాలనే దృష్టి నాకు లేదు! నేను డాక్టర్ని. ఆమె ఎక్కువగా చదువుకోలేదు. ఆమెతో నేను సుఖంగా వుండలేను. ఒకప్పుడు మేం దగ్గరయ్యాం. ఆమె గర్భవతి అయింది. ఆమెకు అయిదు వేలు

యిస్తానని నే నన్నాను! ఆమె నవ్వుతూ వెళ్ళి పోయింది!'' అన్నాడు చలపతి.

''అబ్బాయి, మొన్న రాత్రి నువ్వు కాలవ ఒడ్డుకు వెళ్ళావా?''

''వెళ్ళాను,'' అన్నాడతను.

''ఎందుకెళ్ళావు?''

''ఆమె నన్ను అక్కడ కలుసుకోమంది. నాతో ఏదో మాట్లాడాలంది.''

''ఆమెను కలుసుకున్నావా?'' అడిగారాయన.

''కాలవదాకా వెళ్ళేసరికి నాకు ధైర్యం లేకుండా పోయింది. నేను కాస్సేపు అటూ యిటూ తిరిగి ఇంటికి వచ్చేశాను,'' అన్నాడు చలపతి.

''కాలవ ఒడ్డుమీదున్న ఆమెను నువ్వు చూశావా?''

''తెల్లారాక ఆమె నా ఇంటికొస్తుందనుకున్నా. ఆమె అలా మరణిస్తుందని నేను వూహించలేదు,'' అన్నాడతను.

''చలపతీ, కాలవ ఒడ్డున కల్సుకోమని ఆమె నీతో ఎందుకు చెప్పింది?'' అడిగారు వాలిగారు.

''అదే నాకు తెలియలేదు. నా ఇల్లు పెద్దది. ఆమె నాతో యిక్కడే మాట్లాడొచ్చు. అయినా ఆమె నన్ను కాలవ వడ్డుకు రమ్మంది!'' అన్నాడతను.

''అబ్బాయి, నువ్వామెను చంపలేదా?''

డాక్టర్ చలపతి కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

''వాలిగారూ, జరిగినదానికి విచారిస్తున్నాను. ఆమెను నేనెందుకు చంపుతాను! సూరమ్మ చాలా మంచిది. ఆమంటే నాకు చాలా ఇష్టం. కాని ఆమెను నేను పెళ్ళాడలేను. పనిమనిషి డాక్టర్ భార్యా అని అందరూ నవ్వుతారు!'' అన్నాడతను.

"సుబ్బరాజును గురించి ఆమె నీతో ఏదేనా చెప్పిందా?"

"తనంటే సుబ్బరాజుకి పిచ్చని ఆమె నాతో అంది. ఏ స్థితిలో వున్నా తనని సుబ్బరాజు పెళ్ళాడతాడని ఆమె నమ్మకం!"

"సుబ్బరాజుని ఆమె కాలవ ఒడ్డుకు రమ్మందేమో!" అన్నారాయన.

"అది నాకు తెలియదు, సార్," అన్నాడు చలపతి.

కన్సల్టింగ్ రూమ్‌లోంచి వాలిగారు బయటకు నడిచారు. ఇద్దరం వీధిలో నడుస్తున్నాం.

"వాలిగారూ, సుబ్బరాజు కసితో ఆమెను చంపి వుండొచ్చు," అన్నాను.

ఆయన ఫక్కున నవ్వారు.

"గిరీ, సుబ్బరాజుకు ఆమంటే ప్రాణం. అంతగా ప్రేమించే సుబ్బరాజు ఆమెను చంపడు," అన్నారు వాలిగారు.

* * *

భోజనం చేస్తున్నాం. కమల స్వయంగా వడ్డిస్తోంది.

"వాలిగారూ, సూరమ్మ విషయం ఏదేనా తెలిసిందా?" అడిగిందామె.

"అమ్మాయి, సూరమ్మ కాలవలో మునిగి చావలేదు. ఆమె ఘోరంగా హత్యచేయబడింది," అన్నారాయన.

"ఆమెను ఎవరు చంపారు?" అందామె.

"అదింకా నేను కనుక్కోవాలి," అన్నారు వాలిగారు.

చంద్రబాబు నవ్వుతూ వాలిగారికేసి చూశాడు.

"డాక్టర్ చలపతి దేవాంతకుడు, సార్. అతని దగ్గరకు ఎవ్వరూ వైద్యానికి వెళ్ళరు! ఇది పల్లెటూరు. పల్లెటూరిలో ఎవ్వరూ ఆడవాళ్ళను డాక్టర్ చలపతి దగ్గరకు పంపరు. బ్రహ్మచారంటే అందరికీ భయం!" అన్నాడు చంద్రబాబు.

వాలిగారు అతనివైపు సూటిగా చూశారు.

"చంద్రబాబూ, డాక్టర్ చలపతి చెడ్డవాడు కాదు. ప్రతి బ్రహ్మచారీ చెడ్డవాడని మనం అనుకోకూడదు," అన్నారాయన.

"వాలిగారూ, సూరమ్మను ఎవరు చంపారో కనుక్కోండి? వాడిని ఉరి కంబానికి పంపండి," అంది కమల.

"అమ్మాయి, పరిశోధన సాగిస్తున్నాను. హంతకుడు తాత్కాలికంగా దాక్కున్నా శాశ్వతంగా దాక్కోలేడు! ఎప్పుడో అప్పుడు అతను బయటపడ్తాడు," అన్నారు వాలిగారు.

"వాలిగారూ, చలపతినే కాదు, సుబ్బరాజుని కూడా మీరు అనుమానించాలి? అతను పైకి వెర్రిపీనుగలా కనిపించినా, లోలోపల దుర్మార్గుడు," అంది కమల.

"అతడిని గురించి నీకేదైనా తెలుసా?"

"సుబ్బరాజు మనస్ఫూర్తిగా సూరమ్మను ప్రేమించాడు. కాని ఆమె అతడిని లెఖ చేయకుండా డాక్టర్ చలపతితో తిరిగేది! మనిషికి అది చూస్తే కసి పుట్టుకొస్తుంది," అందామె.

వాలిగారు జవాబివ్వలేదు. భోజనం చేసి చేతులు కడుక్కున్నారు. పడకకుర్చీలో కొంతసేపు చుట్ట పీలుస్తూ కూర్చున్నారు. అమాంతంగా ఆయన కుర్చీలోంచి లేచారు.

"గిరీ!" పిల్చారాయన.

"చెప్పండి," అన్నాను.

"నేను పొరబడ్డాను," అన్నారాయన.

"ఏ విషయంలో?"

"నేను వూహించిందంతా నిజం కాదు. డాక్టర్ చలపతి, సుబ్బరాజు ఆమెను చంపి వుండరు," అన్నారాయన.

"అయితే ఆమె ఆత్మహత్య చేసుకుందా?"

"లేదు!" గర్జించారు వాలిగారు.

"అయితే ఏమైంది?"

"అది నాకు యిప్పుడే తట్టింది. దాన్ని గురించి నేనింతవరకూ ఆలోచించనందుకు విచారిస్తున్నాను. గిరీ, వెళ్దాం పద?" అన్నారాయన.

"ఎక్కడికి?"

ఆయన జవాబివ్వలేదు. గబగబా మెట్లు దిగాడు. ఆయన వెనకనే నేను పరుగెత్తాను.

*    *    *

సుబ్బరాజు గాభరాగా వాలిగారివైపు చూశాడు.

"అబ్బాయీ, నువ్వు కాలవ ఒడ్డుకు వెళ్ళావు. నువ్వు సూరమ్మను కలుసుకున్నావు!" అన్నారు వాలిగారు.

అతను మాట్లాడలేదు. మౌనంగా వున్నాడు.

"నిన్ను ఆ ప్రాంతంలో చూసినవాళ్ళు వున్నారు!" గర్జించారు వాలిగారు.

"నేను వెళ్ళాను సార్," అన్నాడతను.

"ఎందుకు వెళ్ళావు?"

"ఆమె నన్ను అక్కడకు రమ్మని కబురు పంపింది. నాతో అత్యవసరంగా మాట్లాడాలంది," అన్నాడతను.

"ఆమెను కలుసుకున్నావా?"

"ఆమెతో మాట్లాడాను. తను గర్భవతినని ఆమె నాతో చెప్పింది. అయినా ఆమెను పెళ్ళాడతానని నేనన్నాను. ఆమె ఏడ్చింది," అన్నాడతను.

"అటుపైన ఏం చేశావు?"

"నేను ఇంటికి వెళ్ళిపోయాను. ఆమె యింటికి పోతానంది. తల్లితో మా పెళ్ళిగురించి మాట్లాడతానంది," అన్నాడతను.

వాలిగారు అతనికేసి సూటిగా చూశారు.

"అబ్బాయి, అయితే నువ్వు ఇక్కడే వున్నానని నాతో అబద్ధం ఎందుకు చెప్పావు?"

"పారిజాతం అలా చెప్పమంది సార్! ఆనాటి రాత్రి నేను ఇంటికొచ్చేసరికి ఆమె లేదు. అరగంట తర్వాత ఆమె వచ్చింది. సూరమ్మ కాలవలో మునిగి చచ్చిందని ఆమె నాతో చెప్పింది. పోలీసులు నన్ను అనుమానిస్తారని ఆమె అంది. అబద్ధం చెప్పి నన్ను కాపాడుకోమంది. అందుకని అలా చెప్పాను," అన్నాడు సుబ్బరాజు.

తలుపుమీద వాలిగారు తట్టారు. కాస్సేపట్లో తలుపు తెరవబడింది. పారిజాతం కళ్ళు నులుపుకుంటూ మావైపు చూసింది.

"మీరు నిద్ర పోరా?" అందామె.

"నిజం తెలిసిందాకా మాకు నిద్ర పట్టదు," అన్నారు వాలిగారు.

"నాతో మీకేం కావాలి? నన్నెందుకిప్పుడు లేపారు?" అర్చిందామె.

వాలిగారు చుట్టపొగను పైకి వదిలారు. ఆమెకేసి సూటిగా చూశారు.

"సూరమ్మను ఎందుకు చంపావు?" అడిగాడాయన.

ఆమె ఉలిక్కిపడింది. కాస్సేపు ఆమె నిశ్శబ్దంగా వుండిపోయింది.

"పారిజాతం, తిరుపతి వెళ్ళిన నీ భర్త తిరిగి రాలేదు. సుబ్బరాజుకు గది అద్దెకిచ్చి వుండమన్నావు. అమాయకుడైన అతడిని మెల్లిగా మచ్చిక చేసుకున్నావు! అతని హస్తాల్లో నీ జీవితం హాయిగా సాగుతోంది!"

"వాలిగారూ, ఇదంతా అబద్ధం. నేను పెళ్ళయిన స్త్రీని. నన్ను అవమానిస్తున్నారు," అర్చిందామె.

సుబ్బరాజు గదిలో కొచ్చాడు.

"అబ్బాయి, మీ యిద్దర్కీ సంపర్కముందా?" అడిగాడాయన.

అతను తలాడించాడు. పారిజాతం అతనివైపు కోపంతో చూసింది.

వాలిగారు ఆమె ముందుకు వెళ్ళి నిలబడ్డాడు. ఆమె కేసి కళ్ళెర్రజేసి జూశారు.

"డాక్టర్ చలపతిని వదిలేసి సూరమ్మ సుబ్బరాజును పెళ్ళాడబోతోందని నువ్వు విన్నావు."

"అది నేనే ఆమెతో చెప్పాను," అన్నాడు సుబ్బరాజు.

"అతనికి పెళ్ళయితే సుబ్బరాజు నీకు లేకుండా పోతాడు. వెంటనే కాల వడ్డుకి వెళ్ళావు. సుబ్బరాజు అప్పటికప్పుడే ఆమెతో మాట్లాడి వెళ్ళిపోయాడు. ఇంటికి పోడానినికి సూరమ్మ సిద్ధమవుతోంది. నువ్వామెను కాలవ లోకి తోసి, నొక్కిపెట్టావు! ఆమె మరణించాక నీ ఇంటికి పరుగెత్తావు!"

"కథ బాగుంది, ఇంకా చెప్పండి," అందామె.

"ఇంట్లో సుబ్బరాజు వున్నాడు. సూరమ్మ చనిపోయిందని అతనితో చెప్పావు. నిన్ను రక్షించుకోడానికి మంచి ఆలోచన తట్టింది నీకు. కాలవ వద్దకి సుబ్బరాజు వెళ్ళాడని నీకు తెలుసు. దాని మూలంగా యీ హత్యకేసులో తను ఇరుక్కోవచ్చని సుబ్బరాజును భయపెట్టావు. అమాయకుడైన సుబ్బరాజు నీ మాటలు విని గాభరాపడ్డాడు. అతను చేతుల్తో పని చేసే వడ్రంగి. నీలాటి పదునైన బుర్ర అతనికి లేదు. ఏం చేయాలని అతను నిన్ను అడిగాడు. కుర్చీలు బాగుచేస్తూ యింట్లో కూర్చున్నానని అతడిని చెప్పమన్నావు. అతను యింట్లో వున్నాడని నువ్వు సాక్ష్యమిచ్చావు. మీ ఇద్దరూ ఒకే విధంగా చెప్పినందువలన మొదట్లో మీ మాటలు నేను నమ్మాను. కాని తర్వాత అసలు రహస్యం నాకు అర్థమైంది. నువ్వు అతడిని చెప్పమన్న అబద్ధం ఒక వైపున అతడిని కాపాడ్తూ మరో వైపున నిన్ను కాపాడ్తోంది! మీరిద్దరూ ఇక్కడున్నారు! అతని సాక్ష్యం మూలంగా నిన్నెవరూ అనుమానించరు అనుకున్నావు!" అర్వారాయన.

పారిజాతం లోపలి గదిలోకి పరుగెత్తింది. సుబ్బరాజు వాలిగారివైపు చూశాడు. అతని కళ్ళు జేవురించినట్లున్నాయి.

"వాలిగారూ, ఈమె నిజంగా సూరమ్మను చంపిందా?" అడిగాడతను.

"నిస్సందేహంగా!" అన్నారు వాలిగారు.

"దాని తోలు ఒల్చేస్తాను," అని అతను లోపలకు పరుగెత్తాడు.

"వాలిగారూ, మనం ఆపకపోతే మరో హత్య జరుగుతుంది," అన్నాడు.

లోపల గదివైపు వెళ్ళబోయాను. వాలిగారు నా చెయ్యి పట్టుకుని ఆపారు. ఆయన మెల్లిగా లోపలకు వెళ్ళి గుమ్మం బయట నిశ్శబ్దంగా నిలబడ్డారు. ఆయన పక్కనే నేనున్నాను. గదిలోంచి వాళ్ళ మాటలు మాకు వినపడుతున్నాయి.

"దొంగ ముండా, నన్ను శాశ్వతంగా వుంచుకోడానికి సూరమ్మను ఘోరంగా చంపావా?" అర్చాడు సుబ్బరాజు.

ఆమె ఏడుస్తోంది.

"రాజూ, నువ్వు నా ప్రాణం! రెండేళ్ళనుంచి యిక్కటున్నావు. నీకు నేను అన్ని సేవలూ చేస్తూ వచ్చాను. నిన్ను నేను వదులుకుని జీవించలేను!" అందామె.

"నువ్వు నాకంటె పెద్దదానవు. మంచి మాటలాడుతూ నా శరీరంతో ఆడ్డం ప్రారంభించావు. నువ్వు నామీదకు వస్తూంటే నేను ఆగలేకపోయాను. అయినా ఇంత ఘోరమైన హత్య చేస్తావని నేను కల్లో కూడా అనుకోలేదు." అన్నాడతను.

"వాళ్ళ మాటలు నమ్మకు. సూరమ్మను డాక్టర్ చలపతి చంపుంటాడు? నాకు తెలుసు!" అందామె.

సుబ్బరాజు ఆమె చంపల్ను వాయిస్తున్నాడు. ఆమె అరుస్తోంది.

"నిజం చెప్పు!" అర్చాడతను.

"రాజూ, నేను ఆమెను చంపాను. నీకోసం దాన్ని చంపవలసి వచ్చింది. నీ బలహీనత నాకు తెలుసు.

సూరమ్మ బతికుంటే నువ్వు దాన్ని మర్చిపోవు! ఆమె నిన్ను పెళ్ళాడ్డానికి నిశ్చయించుకొంది! నాకు శాశ్వతంగా నువ్వు దూరమై పోతావు! నేను పొందుతున్న ఆనందమంతా గాలిలో ఎగిరిపోతూంటే చూస్తూ వూరుకోలేక ఆమెను తుదముట్టించాను!''

''దొంగ ముండా.'' అంటూ అతను ఆమెను బాదుతున్నాడు.

తటాలున వాలిగారు లోపలకు జొరబడ్డారు. బలంగా పట్టుకుని సుబ్బరాజును వెనక్కి లాగారు.

''అబ్బాయి, హంతకులను శిక్షించడం నీ వంతు కాదు. అందుకోసం దేశంలో కోర్టులున్నాయి,'' అన్నారాయన.

గుమ్మంలో నిలబడిన నాకు వాలిగారు సౌజ్ఞ చేశారు. గట్టిగా విజిల్ వూదాను. ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు అరడజను మంది కానిస్టేబుల్సుతో గదిలోకొచ్చాడు.

''సుబ్బారావు భాయ్, సూరమ్మను చంపింది ఈమే! పారిజాతం!'' అన్నారు వాలిగారు.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు ఆమె చేతులకు బేడీలు వేశాడు.

''సుబ్బరాజు సాక్ష్యం మీకు చాలా వుపయోగపడ్తుంది,'' అన్నారాయన.

వాలిగారూ, నేనూ బయటకు నడిచాం. ఇన్‌స్పెక్టర్ మా వెనకనే వచ్చాడు.

''చంద్రబాబు ఇంట్లో మీరు వుంటారుగా? ఇక్కడి పని పూర్తి చేసి అక్కడకొస్తాను,'' అన్నాడతను.

''సుబ్బారావు భాయ్, గంటలోపల రా! ఇక్కడ మా పని పూర్తయింది. విశాఖపట్నానికి బయల్దేరాలి,'' అన్నారు వాలిగారు.

వీథమ్మట ఇద్దరం వేగంగా నడుస్తున్నాం.

"వాలిగారూ, మీరు పారిజాతాన్ని ఎలా అనుమానించారు?" ప్రశ్నించాను.

ఆయన తీయగా నవ్వుతూ నాకేసి చూశారు.

"గిరీ, ఆమె కళ్ళలోంచి వాంఛలు తొంగిచూస్తున్నాయి! భర్త యింట్లో లేకపోయినా ఆమె పూలతో అలంకరించుకొని రంభలా ముస్తాబైంది! తన యింట్లో వుండే బ్రహ్మచారి సుబ్బరాజును ఆమె నిద్ర పోనివ్వదని ఊహించాను! సుబ్బరాజు అమాయకుడు. ఎవరేం చెప్పినా నమ్మేస్తాడు! బొమ్మలా అతడిని ఆడించసాగిందామె!" అన్నారు వాలిగారు.

*　　　*　　　*

నేను సామాను సర్దుతున్నాను. ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు గదిలోకొచ్చాడు.

"వాలిగారూ, ఆఖర్కి ఆమె ఒప్పుకుని అంతా వివరంగా చెప్పింది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏం చెప్పిందామె?" అడిగారాయన.

"ఆమె కాలవ్వడ్డుకి వెళ్ళింది. సూరమ్మ చూస్తూండగా కాలవలోకి దిగింది. చేతులు పైకెత్తి చంద్రనమస్కారాలు చేస్తూ నిలబడింది. అదంతా ఎందుకని సూరమ్మ అడిగిందట. పౌర్ణమి చంద్రుడికి నమస్కారాలు పెట్టుకుంటే కోర్కెలన్నీ తీర్తాయని చెప్పింది పారిజాతం. ఆ మాటలు విని, వాటిని నమ్మి సూరమ్మకూడా నీళ్ళలోకి దిగింది. ఇద్దరు పక్కపక్కనే వున్నారు. అప్పుడు పారిజాతం తన రెండు చేతుల్తోటీ ఆమెను నీళ్ళలోకి నొక్కేసింది. సూరమ్మ విదిలించుకోడానికి ప్రయత్నించింది కాని, పారి

జాతం చాలా బలమైనది! ఆ సమయంలో ఆమె గోళ్ళు సూరమ్మ మెడకింద గుచ్చుకున్నాయి,'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు.

గదిలో వున్న కమల, చంద్రబాబు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు చెప్పినదంతా విన్నారు.

"రామసుబ్బయ్య ఆమె చేతుల్లో బొమ్మలా పడుండే వాడు. పగలూ, రాత్రీ ఆమె అతడిని వదిలేది కాదని పుకార్లు వున్నాయి. అందుకే, పాపం, అతనెక్కడికో పోయి మళ్ళీ యింటికి రాలేదు,'' అంది కమల.

"అమ్మాయి, శారీరక వాంఛలకు బానిసలైన మనుషులు అవినీతిపరులు అయే అవకాశం వుంది! మనిషి తన మానవత్వాన్ని కోల్పోకుండా వాంఛలను తీర్చుకోవాలి!'' అన్నారు వాలిగారు గంభీరంగా.

-: ఐపోయింది :-




(24 వ భాగము)

అయాచితంగా, అసంకల్పంగా అన్న ఆమెమాట వెనుక నాకు కోటి అర్థాలు స్ఫురించాయి.

"ప్రయత్నమా? ఏమిటది??" అడిగాను.

"నో! నథింగ్! నువ్వు నాతో రావద్దు. ఇక్కడే పడుండు. నీలాంటివాళ్ళెక్కడున్నా ఒక్కటే!" అంది లేవబోతూ.

చెయ్యిపట్టి బలంగా గుంజి కూర్చోబెట్టా నామెను.

"ఏమిటీ దౌర్జన్యం?" అడిగింది కోపంగా కూలబడుతూ.

"తొందరపడకు. చెప్తాను. ఇంతకూ నువ్వు చెప్పిన ఆ ప్రయత్నం ఏమిటీ?" అడిగాను శాంతకటువుగా.

"ఏమీ లేదన్నాగా?" తప్పించుకో చూచింది.

"నేను చాలా మొండివాణ్ణి. కొంతమంది నన్ను మూర్ఖుడివని కూడా అన్నారు. ప్రాణాలు తియ్యడం నాకు చేతనయినంత బాగా మరెవ్వరికీ చేతకాదు. మనిషి ఆయువు పట్లు ఎక్కడుంటాయో, ఎంత తక్కువ హింసతో, ప్రాణిని, శవంగా మార్చవచ్చునో నాకు బాగా తెలుసు. నువ్వు రేపు మీ దేశం, అదే నువ్వు అనుకొనే స్వర్గం అమెరికాకు పోవాలనుకుంటున్నావ్? ప్రాణాలతో వెళ్ళి మళ్ళీ మీ వాళ్ళను చూడాలనుకొంటే నాకు కావలసిన విషయాలు కొన్ని చెప్పు. అలా చెప్పనంటే, ఈ విశాలమైన ఎడారీ, అడవిలాంటి దీవిలో, ఆరడుగుల గొయ్యి నేనే తీసి, నీ శవాన్ని అందులో పూడ్చి, పైన ఏవిధమైన సంకేతం కూడా వుండకుండా జాగ్రత్తలు తీసుకొని వెళ్తాను. ఏమంటావ్?" అడిగాను సీరియస్‌గా.

నా మాటలకామె మొఖం పాలిపోయింది.

"డోంట్ బీ ఎ బ్రూట్!" అంది కోపంగా.

"బ్రూట్‌ను మాత్రమే కాదు! బీస్ట్‌ను గూడా కాగలను. చెప్పు! త్వరగా చెప్పు!" అన్నాను.

ఆమె చెయ్యి నా చేతిలో వుంది.

బొటనవ్రేలి క్రింది భాగాన వున్న నరం నలిపాను. "అమ్మో!" అని గావుకేక పెట్టింది.

"అది సాంపిల్ మాత్రమే! అంతకన్నా బాధాకరమైనవి అసలువి వేరే వున్నాయి. చూపించమంటావా?" అడిగాను.

"ఒంటరి ఆడదాన్ని నమ్మించి ఇలా తీసుకొచ్చి చంపుతానని బెదిరించడం పెద్దమగ లక్షణంకాదు!" అందామె.

"ఆ లక్షణాలు లేవని అనుమానపడుతున్న విషయం

నీకు ముందే చెప్పాను. దానిగొడవ వదిలెయ్! అసలు వ్యవహారంలోకి రా! డెల్లాను ఏంచేశావ్?'' అడిగాను.

''నేనేం చెయ్యలేదు! నాకు తెలీదు!'' అంది.

అరచేతిని కత్తిలాపెట్టి, శరీరంలోని బలాన్నంతా దమ్ముపట్టి అందులోకి జేర్చి, ఆమె కాలర్ బోన్ క్రింద విసురుగా కొట్టాను. వెల్లికింతలా పడిపోయింది ఇసుకలో.

లేచి నిలుచున్నాను.

మెడకున్న మఫ్లర్‌ను పేలికలుచించి, కాళ్ళూ, చేతులూ విడివిడిగా కట్టేశాను.

సిగరెట్ కాల్చుతున్నాను.

పొగ వదిలాను దట్టంగా.

''నన్నేం చేస్తున్నావ్?'' అడిగింది దీనంగా.

''అలా తొందరపడకు. చూస్తూ వుంటే నీకే తెలుస్తుంది'' అంటూ కాలుతున్న సిగరెట్ ఆమె చెక్కిలి పైన పెట్టాను. దాని వేడికి చర్మం కాస్త కాలింది. ఎగిరి పడింది గాల్లోకి.

''కాల్చకు! దయచేసి నన్ను కాల్చకు!'' అంది దీనంతా వేడుకొంటూ.

''అయితే చెప్పు! డెల్లాను ఏంచేశావ్?''

''చెప్తాను!'' అంటూ తన్నుకులాడి తనకుతానే లేచి కూర్చుంది.

''నిన్ను నాతో అమెరికాకు తీసుకెళ్ళాలనీ, నిన్ను పెళ్ళాడి, స్వర్గసౌఖ్యాలు రుచిచూడాలనీ కలలుగన్నాను. డెల్లాను నువ్వు అస్తమానం కలవరించడం, ఆమె పేరు పదేపదే పలవరించడం గమనించాను. ఆమెపై నీకున్న ప్రేమ ఎంత దట్టమైందో అర్థంచేసుకున్నాను. ఆమె

బ్రతికి వుండగా నువ్వు నాతో నా దేశం రావనుకున్నాను. ఆమె నెలాగైనా నీనుంచి వేరుచేస్తే, నువ్వు కాస్త ఆలస్యంగానైనా నా వాడివవుతావన్న నమ్మకం కలిగింది. అందుకే ఆమెను వదలించుకునే మార్గాల గురించి అన్వేషణ సాగించాను. ఒకరోజు ఈ దీవి మొత్తం గాలించాను'' అంటూ ఆగింది ఆమె.

''ఎందుకు?'' అడిగాను.

''ఎవ్వరికీ కనుపించకుండా దాచేందుకనువైన స్థలం దొరుకుతుందేమోనని...'' అంది మెల్లగా.

''ఊఁ! తర్వాత ఏమయింది?''

''నిర్మానుష్యంగా వున్నాయి అన్ని ప్రాంతాలు. ఆమెను చంపేసి శవాన్ని పూడ్చిపారేద్దామనుకున్నాను. ఏవైనా జంతువులు వెలికిలాగి పట్టిస్తాయేమోనని భయపడ్డాను. పోనీ సముద్రంలో పారేద్దామనుకున్నాను. అందులోనూ ప్రమాదం పసిగట్టాను. అలల తాకిడికి ఒడ్డుకు కొట్టుకొచ్చే అవకాశాలున్నాయి. అంతలోనే ఆమెకు మతిస్థిరంలేని విషయం గుర్తొచ్చింది. ఆమెను కట్టుదిట్టంగా బంధించి కాపలా కాస్తున్నారు. రాత్రిళ్ళు, నాతో వచ్చిన రెండో నర్సు డ్యూటీ చేసేది. ఆమెకు ఇక్కడున్న సైంటిస్టుల్లో ఒక ప్రియుడున్నాడు. రాత్రిళ్ళు అతనితో గడపడానికి వీలులేకపోవటంతో ముందు విసుక్కుంది. అది నేను తెలుసుకున్నాను. నేను పేషెంటును చూస్తూంటాననీ, తనను వెళ్ళిపొమ్మనీ చెప్పాను. అవసరమైతే వచ్చి పిలుస్తానని చెప్పాను'' అంది అమెరికన్ నర్సు.

నా రక్తం లావాలా కుతకుతమని ఉడుకుతూ, గుండెల్లోంచి ఉబికి కళ్ళలోకి తన్నుకురావటం మొదలెట్టింది.

"ఆ రాత్రి చాలాసేపు ఆలోచించాను. మెల్లగా తలుపులు తెరచాను. నన్ను చూసి పైకి దూకింది. భయపడ్డాను. అపిల్స్ కోసే కత్తితీసి పొడుస్తానని భయపెట్టాను. దాంతో కాస్త తమాయించుకుంది. దగ్గరకంటూ వెళ్ళి కాళ్ళకు చేతులకూ తగిలించిన గొలుసులు తీశాను. బోనులోంచి బైటకు వదలిన సింహంలా పరుగెత్తుకొని వెళ్ళిపోయింది చీకట్లో. నేనూ వెంటపడ్డాను. ఇద్దరం చాలాదూరం పరుగెత్తాం!"

"ఏ వైపుకు పరుగెత్తింది? సముద్రంలోకా?" అడిగాను కోపంగా.

"కాదు! అదుగో దూరంగా కనుపిస్తున్న ఆ పర్వతాల వేపుకు" అంటూ చూపించింది.

"ఆ తర్వాత!"

"అక్కడిదాకా పరుగెత్తింది. చకచక కొండ ఎక్కింది. నేనూ కొంత దూరం వెళ్ళాను. ఆమెలా సులభంగా ఎందువల్లో ఎక్కడం నావల్ల కాలేదు. చూస్తుండగానే ఆ రాళ్ళల్లో ఆమె రూపం అంతర్థానమైపోయింది. కాసేపు చూశాను. కనుపించలేదు. ఎటో వెళ్ళివుంటుందనుకుంటూ అలిసి వచ్చేశాను బిల్డింగుకు. వచ్చాక ఒక పది నిముషాలు రెస్టు తీసుకొని, తిన్నగా నర్స్ వున్న గది వద్దకు వెళ్ళి తలుపు తట్టి పిలిచాను. ఆమె వెలుపలికొచ్చింది. జరిగింది చెప్పకుండా, పేషెంటు తప్పించుకొని పోయిందని చెప్పి, మెల్లిగా నా గదికి వెళ్ళిపోయాను," అంది ఆమె.

సిగరెట్ దూరంగా విసిరి పారేశాను.

"నువ్వు మనిషివి కాదు! రాక్షసివి!! లేకుంటే మతిస్థిరం లేని మనిషిని అలా నిర్దాక్షిణ్యంగా వదిలివెయ్యావు. నర్స

ఎలా అయ్యావో నాకు తెలీడంలేదు. నిన్ను నిలువునా చంపేసినా పాపంలేదు!" అన్నాను కోపంగా.

నా కళ్ళలోకి చూసింది. వెంటనే తల వంచుకుంది. నేలచూపులు చూస్తూ "అయితే నన్ను చంపుతావా?" అడిగింది.

"ఆఁ! చంపుతాను!" అన్నాను.

"వద్దు! ప్లీజ్! తెలీక తొందరపడ్డాను. నువ్వు కావాలనుకుని, పిచ్చిగా ప్రవర్తించాను. ఇకపైన ఎప్పుడూ అలా చెయ్యను, ఈమారు క్షమించి వదిలెయ్! మా దేశం వెళ్ళిపోతాను" అందామె దీనంగా వేడుకుంటూ.

"లాభం లేదు! నిన్నలా వదిలేస్తే నన్ను భగవంతుడు క్షమించడు. లే! నా వెంట రా!" అన్నాను లేచి, ఆమె కాళ్ళకున్న కట్లుమాత్రం విప్పి.

ఆమె లేచి నుంచుని "ఎక్కడికి" అడిగింది.

"ఏమో? నాకు మాత్రం తెలుసా ఏమిటి? నువ్వు ముందు నడువు! డెల్లా వెళ్ళిన వేపుకు పద. మన ఇద్దరం కలసి ఆమెను వెతికి పట్టుకోవాలి. ఆతర్వాత ఆమె క్షమిస్తే నిన్ను వదిలేస్తాను. లేకుంటే ఆమె ముందే నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు, గద్దలకు వేస్తాను" అన్నాను.

ఆమె మారుమాట లేకుండా కదలింది.

ముందామె నడుస్తోంది.

వెనకగా నేను వెళ్తున్నాను.

ఇద్దరం దాదాపు ఐదారు మైళ్ళు నడిచాం. సాయంత్రం అయ్యేసరికి కొండలవద్దకు వచ్చాం. చీకటి అక్కడక్కడా అలముకుంటూంది.

వెనక్కి పోదామా అన్నట్లు వెనక్కి తిరిగిచూసింది నాకేసి అమెరికన్ నర్స్ ఆశగా.

"ఎక్కు?" అన్నాను గుట్టలు గుట్టలుగా పడివున్న ఎత్తైన రాళ్ళను చూపించి.

"చీకటి పడుతూంది. మళ్ళీ తిరిగి రాలేము. చీకట్లో ఎక్కడని కనుపిస్తుంది. ప్రొద్దున్నే వచ్చి వెతుకుదాము?" అడిగిందామె.

"నో! పగలూ, చీకటీ, రాత్రీలాంటివి లేవు నీకూ, నాకూ. ఆమెను వెతకడమే మన పని. ఎక్కు!" అన్నాను కఠినంగా.

ఆమెకు వేరే దారి తోచలేదు. రెండు గుట్టలెక్కింది. చేతులకున్న కట్లు అడ్డు రాసాగాయి. వాటినికూడా విప్పేశాను. ఆమె నాకన్నా ఎత్తుగా, లావుగా వుంది. బలంగా కూడా వుంది. ధైర్యంచేసి తిరగబడితే నే నామెను కంట్రోలు చెయ్యడం కొంత కష్టమే కావచ్చు. అయితే, నా దగ్గర చిన్న రివాల్వరూ, పెద్ద కత్తీ వున్నాయి. అవే నాకు రక్షక కవచాలు. వాట్ని అంతకుముందే చూసి వుందామె. నాకు కోపం ఎక్కువైతే ఆవేశంతో ఆమెను అవలీలగా చంపివెయ్యగలనన్న అనుమానం వుందామెకు. అందుకే భయపడిపోయింది. ఇద్దరం మరో గంటసేపు కష్టపడి కొండలు ఎక్కాం. దాదాపు సగంఎత్తు పైదాకా వచ్చేశాం.

ఆమె కాళ్ళకు చెప్పుల్లేవు. రాళ్ళు గ్రుచ్చుకుని రక్తం కారింది. రెండుసార్లు చూసుకుని, తుడిచేసుకొంటూనే ఏడ్చింది.

చదునుగావున్న పెద్ద బండపైన ఠక్కున కూర్చుండిపోయింది. వెనువెంటనే వెక్కిళ్ళలా పడుతుంది. నా కర్థం

కాలేదు ఆమె ఎందుకలా చేస్తోందో? అడిగా నామె నా మాట.

కాళ్ళు నొప్పులు పుడుతున్నాయంది. ఇంకో అడుగు ముందుకు వెయ్యలేనని చెప్పింది.

కత్తి తీసి బెదరించాలనుకున్నాను.

మరీ అమానుషంగా ప్రవర్తించడం ఎందువల్లో నాచేత కావడంలేదు. కాస్త విశ్రాంతి తీసుకోవడం నాకూ అవసరంగానే వుంది. అంతకు ముందులా నడవలేకున్న విషయం, అర్థమవుతూంది నాకు.

నేను కూర్చున్నాను ఆమె ప్రక్కగా.

"నర్స్!" పిలిచాను మెల్లిగా.

"ఏమిటి? నడవకుంటే చంపుతానంటావా?" అడిగింది పడుకునే వెల్లికింతలా.

"కాదు! డెల్లా ఈ త్రోవనే వచ్చిందా?"

"ఆ! ఇక్కడిదాకా నాకు కనుపించింది. ఆపైన కనపడలేదు. వెనక్కి వెళ్ళిపోయాను" అంది.

ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఇంతదాకా వచ్చిన మనిషి ఏమయిపోయి వుంటుంది. క్రూరమృగాలేమైనా వచ్చి వుంటాయా! అలాంటివి వున్నట్లు శాస్త్రజ్ఞులు కూడా ఎవరూ అనుకోగా వినలేదు నేను.

ఏవైనా గుహలలాంటివి వున్నాయేమోననుకున్నాను. అలాంటివి వున్నా రాత్రిళ్ళు కనుపించవు. తెల్లవారాక వెతకాలి. ఆమెకు కాస్త దూరంగా నేను వెల్లికింతలా పడుకున్నాను. ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. చందమామ ఇంకా రాలేదు.

"ఆకలవుతూంది! తినేందుకేమైనా వుందా?" అడిగింది నర్స్ అర్థిస్తున్నట్లు.

నా దగ్గర రెండు బిస్కెట్ పాకెట్లున్నాయి. ఇవ్వడమా, మానడమాని కాసేపు సందిగ్ధంలో పడ్డాను. ఆమె నలా ఆకలితో మాడ్చి మాడ్చి. ఆలసటతో. ఆశక్తతతో, తనకుతానే చచ్చేట్లు చెయ్యడం నా కోరిక. అది తీర్చుకోవాలనిపించింది.

"ఉంది! కానీ నువ్వు తినడానికి కాదు! నా కోసం తెచ్చుకున్నాను," అన్నాను.

"అలా ఆకలితో అల్లాడి నేను చావాలని నీ పథకం! అవునా! అది అమానుషం! నాపై నున్న కత్తు తీర్చుకోవాలంటే అదికాదు పద్ధతి! కాల్చి చంపు. ఒక్కదెబ్బకు నీ కోరిక తీరుతుంది. నాకు బాధ వుండదు!" అంది ఆమె.

"అలాంటి చావు నీకు రాగూడదు!" అన్నాను.

"ఎందుకని?"

"నన్ను అనవసరంగా ప్రశ్నలతో విసిగించకు. నోరు మూసుకుని పడుకుని విశ్రాంతి తీసుకో!" అన్నాను విసుగ్గా.

"ఆమెమీద నీ ప్రేమ నన్ను ఇంత దారుణంగా హింసించేందుకు పురిగొల్పింది. అలాగే నాకున్న నీపైని ప్రేమ ఆమె నలా వదిలేసేందుకు ప్రోత్సహించింది. దానికే నేనేదో పెద్ద తప్పు చేసినట్లుగా నువ్వింత నీచంగా నన్ను చూడటం బాగులేదు! ఇద్దరం కలిసి ఆమెను వెతుకుదామని బయలుదేరాం! అలాంటప్పుడు నన్నింకా విరోధిలా చూడటం మంచితన మనిపించుకోదు!" అంది నాకేదో సలహా ఇచ్చినట్లు.

వినీ, విననట్లే ఊరుకున్నాను.

"నాకు ఆకలితో పేగులు తెగిపోతున్నాయి!" అంది మళ్ళీ.

డెల్లా గుర్తొచ్చింది నాకు.

ఇంతకన్నా విపత్కర పరిస్థితుల్లో చిక్కుకున్నప్పుడు ఆమె ఈమెలా బేలపడిపోలేదు. ఆకలిని అదుపులో పెట్టుకొంది. నాకు ధైర్యం చెప్పింది. అందుకే బహుశా డెల్లాను మరచిపోలేక పోతున్నానేమో ననిపించింది.

"నీ దగ్గరున్న ఆహారం నాకు కొద్దిగా పెట్టవూ" మోచేతిపైన బరువు మోపి ప్రక్కవాటుగా తిరిగి అడిగింది మళ్ళా.

పాంటుజేబులో చెయ్యిపెట్టి బిస్కెట్ పాకెట్ లాగాను. వెలుపలికి తీసి ఆమెపైకి విసిరాను.

దాన్నందుకుని పైపాకింగు నోటిలోనే పరపర పీకేసింది. లోనున్న బిస్కెట్లను రెండేసి, మూడేసి చొప్పున కరకర నమలసాగింది.

నేను లేచి కూర్చున్నాను.

క్వార్టర్ బాటిల్ బ్రాందీ తీసి కార్కు నోటితోనే త్రిప్పి ఊడబీకాను. సగంవరకు గటగటమని తాగేశాను.

"దాహం అవుతూంది. గొంతుకూడా పట్టుకుపోయింది. నాకు కాస్త డ్రింకు ఇవ్వు!" అడిగింది మళ్ళా.

ఆమెపైని నా కసహ్యం వేసింది.

సీసా ఆమె కందించాను.

ఆత్రంగా అందుకుని నోటికి కరిపించుకుంది.

ఒకేసారి మొత్తం త్రాగేసింది. సీసా దూరంగా విసిరింది. అదో రాయిపైన పడి ఘల్లుమని శబ్దంచేస్తూ, ముక్కలు ముక్కలుగా పగిలి పడిపోయింది.

"వెలుతురొచ్చిందాకా పడుకో! ఆ తర్వాత లేచి వెతుకుదాం!" అన్నాను ఆమెతో.

చెయ్యి మడచి తలక్రింద పెట్టుకుంది.

మరో రెండు నిముషాల్లోనే ఆమె గాఢనిద్రలో కొరిగిపోయినట్లు పసిగట్టాను, గుర్రుమంటూ పెడుతున్న గురకను విని.

నాకు ఎక్కవలసిన మిగిలిన ఎత్తుకొండలు కనుపిస్తున్నాయి. వాటిపైనుంచి తొంగిచూస్తున్న చందమామ దగ్గరకు వెళ్ళగలిగితే, లోకమంతా నాకు కనుపిస్తుంది గదా అనుకున్నాను. ఆ ఎత్తునుండి ఆ వెలుగులో డెల్లా ఎక్కడున్నా సులభంగా గుర్తుపట్టగలను గదా అనుకున్నాను. భగవంతుడు నాకా ఎత్తులకు వెళ్ళే శక్తి నిచ్చివుంటే ఎంతో బాగుండును కదా అనికూడా అనుకున్నాను.

కమ్మరి పురుగుల్లాంటి ఆలోచనలు నా బుర్రను తొలుస్తూంటే నిద్రపోవాలని వున్నా, కళ్ళు మూతపడనన్నాయి. వొళ్ళంతా బాగా అలసిపోయి వుంది. విశ్రాంతి దానికీ అవసరమే! అయినా డెల్లాను ఎలా వెతకాలన్న ఆలోచనల వెనక్కి యివన్నీ త్రోసివేయబడ్డాయి.

తెల్లవారిందాకా అలా మిడిగుడ్లు వేసుకొని చూస్తూ కూర్చున్నాను. అమెరికన్ నర్సుమాత్రం హాయిగా నిద్రపోతూంది.

వెలుతురు వెల్లువలా మాపైనా, చుట్టూ ప్రవహించి నిండుకుంది. ఆమెను చేత్తో తట్టి లేపాను.

అయిష్టంగా, లేచి కూర్చుంది.

"అప్పుడే తెల్లవారిందా?" అడిగింది ఆశ్చర్యంగా.

"కనుపించటంలే!" అన్నాను చిరాకుగా.

"నువ్వు నిద్రపోలేదా?" అడిగింది నర్స్ నా కళ్ళకేసి పరీక్షగా చూసి.

"లేదు!" అన్నాను.

"ఇంక లేద్దామా!"

"ఊఁ!" అంటూ సర్దుకుని లేచాను.

"ఎటు వెళ్దాం? ముందుకుపోయి మరే ప్రయోజనం సాధించే అవకాశం కనుపించటంలేదు. ఆమె యెటు పోయిందో, ఏమయిందో? ఆమెకోసం వెతుకుతూ మనమూ ఏదైనా ప్రమాదంలో చిక్కుకుంటామేమోనన్న భయంగా వుంది. తిన్నగా వచ్చినదారినే వెనక్కి వెళ్ళిపోదాం! ఏమంటావ్?" అడిగింది నర్స్.

కాస్త సుఖనిద్ర దొరకగానే, శరీరం సుఖంవైపు పరుగెత్తుతూందనుకున్నాను.

"వెనక్కి వెళ్ళే ప్రశ్నలేదు! నా అభిప్రాయాలు ముందే చెప్పాను." అన్నాను నిక్కచ్చిగా.

"అయితే వెళ్ళి వెతుకుదామంటావ్?"

ఆమె ప్రశ్నకు సమాధానంగా రాళ్ళు ఎక్కటం మొదలెట్టాను. పదడుగులు వెళ్ళి వెనక్కు చూశాను. ఆమె నా వెనుక వస్తూవుంది కొంతదూరంలో.

అలా ఆ కొండపైకి ఎక్కేసరికి మిట్టమధ్యాహ్నమైంది మాకు. నా కాళ్ళకు కత్తుల్లాంటి రాళ్ళు గ్రుచ్చుకుని, గాయాలయి రక్తం ప్రవహించసాగించి. ఆ ప్రవాహాన్ని ఆపేందుకని మెత్తటి మట్టి తీసి ఆ గాయాల్లోకి కూరాను. విపరీతమైన మంట, నొప్పి పుట్టాయి. తమాయించుకున్నాను.

అమెరికన్ నర్స్ పరిస్థితికూడా నాలానే వుంది. లావుపాటి ఆమె తొడలు, విశ్రాంతిలేని నడక రాపిడివల్ల,

మంటలు పుట్టాయని చెప్పి, దూరదూరంగా కాళ్ళు పెట్టి వెళ్లకింతలా పడుకుంది కొండపైకెక్కాక.

కొండపై అంచున నిలుచుని చూశాను. క్రిందిభాగాన వున్న విశాలమైన బయలుప్రదేశం కనుపించింది. అక్కడికి చేరుకోవా లనుకున్నాను. అంతలోనే నాకో అనుమానం వచ్చింది. నాకే అతికష్టంగా వున్న ఈ ప్రయాణం, మతి స్థిరంలేని డెల్లా ఎలా చేసివుంటుందని. నాది కేవలం వ్యర్థప్రయత్నం, వృధాప్రయాసలేమో ననిపించాయి. అలాగని నర్స్ చెప్పినట్లు వెను దిరగటానికి మనస్కరించ లేదు.

కొండ దిగడం మొదలెట్టాను. ఆమెకూడా లేచి నా వెంట రావడం మొదలెట్టింది. ఈ ప్రయాణం అంత కష్టంగా అనిపించలేదు. అంతేగాక బాగా వేగంగా దిగగలుగుతున్నాం.

దాదాపు సగం ఎత్తు దిగాం. క్రిందిభాగం బాగా స్పష్టంగా కనుపించసాగింది. చిన్నచిన్న తుప్పలు, చెట్లు, పచ్చిక పెరిగిన బయళ్ళు కనుపించాయి. ఆ దృశ్యం హృద యానికి ఆహ్లాదకరంగాకూడా వుంది.

గబగబ క్రిందికి దిగాం.

సూర్యుడు నడి నెత్తిపైకి వచ్చేసరికి బాగా క్రిందికల్లా వచ్చేశాం ఇద్దరం.

చుట్టుపక్కలంతా కలయజూశాను. ఎక్కడా ఏవిధ మైన మానవసంచారం వున్నట్లు తోచలేదు. ఒక చిన్న చెట్టు నీడన కూర్చున్నాం.

"ఆమె ఆ కొండ దాటి ఇటుగా వచ్చి వుంటుందని నాకు నమ్మకం లేదు!" అంది నర్స్.

"నాకూ లేదు! అయినా ప్రయత్నించాలిగా!" అన్నాను.

"ఆమె మతిస్థిమితం లేని మనిషి. ఏ సముద్రంలోనో దూకి ఆత్మహత్య చేసుకుందేమో?"

"మళ్ళీ ఆ మాటనకు! ఆమె చావదు! బ్రతికే వుంది. కానీ ఎక్కడుందో కనిపెట్టాలి. అంతే!" అన్నాను.

"దాహంగా వుంది!" అంది నర్స్.

నాకూ దాహంగా వుంది. ఎక్కడైనా నీళ్ళు దొరుకు తాయేమో చూద్దామని లేచాను.

"నేనూ వచ్చేదా?" అడిగింది.

"వద్దు! ఇక్కడే వుండి కాస్త విశ్రాంతి తీసుకో. వెళ్ళి చూసొస్తాను" అన్నాను.

ఆమె చెట్టుకు చేరబడి కూర్చుని కాళ్ళు బార్లా జాపుకుంది. నేను బయలుదేరాను ముందుకు.

నా చుట్టూ పరికించి పరిశీలగా చూస్తూ నడవసాగాను ముందుకు. అడుగు అడుగుకు, చిన్నచిన్న ముళ్ళపొదలు, తుప్పలు, లావుపాటి రాళ్ళు అడ్డం వచ్చాయి. వాట్ని తప్పించుకుంటూ నీళ్ళజాడ కోసం ముందుకు పోసాగాను.

ఎక్కడా చిన్న గుంట కూడా కనుపించలేదు.

ఈ ప్రాంతాల్లో ఎక్కడా నీళ్ళు దొరకవేమో నని పించింది. అయినా పట్టు వదలని విక్రమార్కుడిలా, ప్రయత్న విరమణ చెయ్యకుండా ముందుకు సాగిపోయాను. మరో పది నిముషాల నడక నడిచాక, విశాలమైన బయలు ప్రదేశం కనుపించింది.

పచ్చటి పట్టు పరుపులా, ఎండ వెలుగులో మెరిసిపోతూంది ప్రదేశమంతా. గడ్డి క్రిందనున్న నల్లటి మట్టి కాలికి మెత్తగా తగిలింది. అంతకుముందు రాత్రి బహుశా వాన కురిసి వుండాలనుకున్నాను.

ఇంకొంత ముందుకు వెళ్ళాను.

గుండ్రంగా వున్న చిన్న కొలనులో ఏదో కనుపించింది. నీళ్ళు నల్లగా వున్నాయి. ఆ రంగునుబట్టి బాగా లోతు వుండాలనుకున్నాను. అంచున వొంగి కూర్చుని, రెండు చేతులు దోసిలిపట్టి, నీళ్ళలో ముంచి పైకి తీశాను. ఆ నీళ్ళతో మొహం కడుక్కున్నాను. కొద్దిగా నోట్లోకి వెళ్లాయి. అవి బాగా తియ్యగా వున్నాయి.

దాహంతో తాపంతో నీరసపడిపోయిన నేను, గబ గబ నీళ్ళు త్రాగాను కడుపునిండుగా. కాళ్ళు కూడా కడుక్కున్నాను.

అప్పుడు నాకు అమెరికన్ నర్స్ గుర్తొచ్చింది.

ఆమెకు నేను దాదాపు మైలు దూరంలో వున్నాను. ఆమె కూడా దాహంతో అల్లాడిపోతున్నది. ఇక్కడినుండి నీళ్ళు తీసుకెళ్ళేందుకేమైనా పాత్రలాంటి దేదైనా దొరుకుతుందేమోనని చుట్టూ చూశాను. ఏదీ కనుపించలేదు. వెళ్ళి ఆమెను వెంటబెట్టుకుని రావడంకన్నా వేరే మార్గం లేదనుకున్నాను.

వెనక్కి నడవడం మొదలెట్టాను.

వంద గజాలు నడిచాక, ఒక చిన్న ముళ్ళతుప్పకు చిక్కుకుని గాలిపటంలా రెపరెపలాడుతున్న తెల్లటి కాగితంలాంటిది కనుపించింది. అదేమిటో దగ్గరకెళ్ళి చూడాలనిపించింది. అటుకేసి అడుగులు వేశాను. ఆ తెల్లటి వస్తువును చేత్తో తాకాను. అది ఆడవాళ్ళు వేసుకొనే షర్టని సులభంగానే తెలుసుకున్నాను. ఘట్టిగా లాగాను. ముళ్ళతుప్పనుండి ఆ షర్టు విడిరాలేదు. మరీ గుంజితే చినిగిపోతుందని, వొంగి కూర్చుని ముళ్ళను తప్పించి, తంటాలు పడి వెలికి తీశాను.

గాలిలో విదిలించి తేరిపార చూశాను దాన్ని.

ఆ షర్టు డెల్లాది. నాకు బాగా గుర్తుంది. ఇక్కడికెలా

వచ్చిందానని ఆశ్చర్యపోతూ ఆలోచించసాగాను. డెల్లా ఈ ప్రాంతాలకు వచ్చిందా?

నా బుర్రవాడిగా పని చెయ్యడం మొదలెట్టింది. అష్ట కష్టాలుపడి ఇంతదూరం వచ్చినందుకు నిరాశ కలగలేదు.

నా అంచనా ప్రకారం డెల్లా ఖచ్చితంగా కొండ దాటి ఇటువేపు వచ్చివుండాలి? విశాలమైన ఈ ప్రాంతాల్లో ఎక్కడో పిచ్చిపట్టి తిరుగుతూ వుండాలి. ఆమెను వెతికి పట్టుకోవాలి.

అంత ఆనందంలోనూ, దూరంగా చెట్టు క్రింద దాహంతో మంచినీళ్ళకోసం ఎదురుచూస్తూ పడుకునివున్న అమెరికన్ నర్స్ కూడా గుర్తొచ్చింది. ఆమెను వెంటబెట్టు కొని తిరిగిరావాలని తీర్మానించుకున్నాను.

అడుగులు వడిగా వేశాను.

పది నిముషాల్లో ఆమెను వెంటబెట్టుకొచ్చాను నీళ్ళ గుంటదగ్గరకు. త్రోవలో ఆమెతో నేను మాట్లాడలేదు. నేను తెలుసుకొన్న విషయాన్ని అప్పుడే ఆమెకు చెప్పా లనిపించలేదు.

నాలాగే ఆమె కాళ్లూ చేతులూ, మొహం కడుక్కొని నీళ్ళు త్రాగి లేచింది.

"చాలా బావున్నాయి నీళ్ళు!" అంది ఆమె.

"వెళ్దామా?" అడిగాను నేను.

"ఎక్కడికి?"

"గమ్యం లేని ప్రయాణం మనది. ధ్యేయం మాత్రం తప్పిపోయిన డెల్లాను పట్టుకోవడం. ఆమెను వెతుకుతూ వెళ్దాం!" అన్నాను.

"ఇంతదూరం మనం రావడమే గగనమైపోయింది. మరి ఆమె రాగలిగి వుంటుందని నేననుకోను!" అందామె.

(సశేషం)

## సప్లిమెంట్ పోటీ - 20.

M, N, O, P, Q — అక్షరాలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు జులై '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది.

# జోకాపేజీ వినోదం

## 82

అడ్వొకేట్ కేశవాచారిగారు కొత్త బోర్డు రాయిద్దామనుకున్నారు. అందుకని వెంటనే ఆ వూళ్ళో పేరుమోసిన ఓ ఆర్టిస్టు దగ్గరికి వెళ్ళి ఆర్డరిచ్చారు.

ఆర్టిస్టు బోర్డువ్రాసి కేశవాచారి ఆఫీసు గేటుకితగిలించాడు.

క్రొత్తబోర్డు రాయించాననే గొప్పకోసం ఓ నలుగురు ఫ్రెండ్స్‌ని వెంటబెట్టుకుని వెళ్ళారు ఆఫీసుకి. కాని ఆఫీసు గేటు దగ్గర ఆ బోర్డును చూసిన కేశవాచారిగారు నిశ్చేష్టులయ్యారు.

ఇంతకీ ఆ బోర్డుమీద-'కె. శవచారి, అడ్వొకేటు.' అని వ్రాసుంది!

* * *

యముడు : అదేవిటి చిత్రగుప్తా! అదేదో విచిత్ర యంత్రంలా వుంది. దాంతో ఏం చేస్తున్నావయ్యా?

చిత్రగుప్తుడు: మనలోకంలో పాపులుపెరిగిపోతున్నారు. వాళ్ళ జాబితాలు తయారుచేయడం కష్టమైపోతోంది. అందుకని భూలోకంనుండి ఓ కంప్యూటర్ తెప్పించాను స్వామి!

—కొనె సత్యనారాయణ, పిఠాపురం.

## 83

ఒక సిక్కు తన కారులో ప్రయాణం చేస్తున్నాడు.

సిక్కుగార్కి తెలుగు చదవటం వచ్చుకాని అర్థంతెలీదు. సిక్కుకారు ముందు ఒక లారీ వెళ్తొంది. ఆ లారీ వెనుక తెలుగులో.

"ఫిర్ మిలేంగే."

"దయచేసి హారను కొట్టండి" అని వ్రాసుంది.

యిద్దరూ ఓ సెంటరులో కాఫీకి ఆగారు.

తిరిగి వెళ్తూ సిక్కు లారీ డ్రైవరుతో పలకరింపుగా "దయచేసి హారను కొట్టండి" అన్నాడు.

డ్రైవరు తెల్లముఖం వేశాడు.

* * *

ఒక రాత్రి యిద్దరు దొంగతనానికి బయలుదేరి ఓ ఇంటి వద్ద ఆగారు.

మొదటి దొంగ: ఈ ఇల్లు ఎవరో డిటెక్టివ్‌దిలాగుంది రోయ్.

రెండవ దొంగ: ఏం? ఎలా తెలుసు?

మొదటి దొంగ: కనబడటల్లా? ఇంట్లో లైటువేసి దొడ్డి వాకిలికి తాళం వేసుంది.

—జి. ఎస్. స్వామి, గుంటూరు.

## 84

"నా పేరు వింటూనే ముఖం తప్పించేవాళ్ళు కొందరు. పారిపొయ్యేవాళ్ళు కొందరు." కొత్తగా కలిపిన మిత్రుడితో చెప్పాడు అతను.

"అదేం? ఏ గజదొంగపేరన్నా పెట్టుకున్నావా?" మిత్రుడు అడిగాడు.

"కాదు. నా పేరు అప్పారావు. అప్పులడుగుతానని భయం. అన్నట్లు ఓ ఫైవ్ వుంటే యిద్దురూ ఎళ్ళుండి ఇచ్చేస్తాను." అప్పారావు అన్నాడు.

* * *

"ఇప్పటికి నేను ముప్పై ఆరు కధలు రాశాను." కుశాల రావు అన్నాడు.

"ఏఏ పత్రికల్లో ప్రచురణ అయ్యాయి?" విశాలరావు అడిగాడు.

"ఇంకాకాలా, ఇహ అవుతాయి. సస్పెన్స్‌లేదు, అన్న కధ 'అపన'కు పంపాను. సెక్స్‌కధ 'పత్రిక్క' పంపాను. సాంఘిక కధ 'అభిసారిక'కు పంపాను. "అతివ"కు ఘోర హత్య అనే కధ పంపాను."

"అయితే, అవి యీపాటికి తిరిగొచ్చి వుండాలే" విశాల రావు అడ్డం తగిలి అన్నాడు.

* * *

పాతికేళ్ళ యువకుడు పళ్ళడాక్టరు దగ్గరకు వచ్చాడు.

"పిప్పి పన్ను పీకితే ఏం తీసుకుంటారు?" అని అడి గాడు.

"పన్నుకి అయిదు రూపాయలు. ఎన్నిపళ్ళు పీకితే అన్ని అయిదులు ఇవ్వాల్సిందే." డాక్టరు చెప్పాడు.

"పయోరియా వ్యాధి నయం చేయటానికి ఏమి తీసు కుంటారు?"

"లేతలో వ్యాధి వుంటే పది. ముదిరితే పాతిక."

"మరి పంటిపోటు తగ్గించటానికో?"

"మూడు రూపాయలు. ఇంతకూ మీకేం బాధ పంటి పోటా? పప్పిపన్నా? పయోరియా వ్యాధా?"

"పళ్ళకేం వ్యాధిలేదు. నేనూ పంటి డాక్టరునే. కొత్తగా ప్రాక్టీసు పెట్టబోతున్నాను. ధరలెలా వున్నాయో తెలుసు కుందామని వచ్చాను. సెలవ్" అన్నాడు కుర్రడాక్టరు.

—కె. విజయలక్ష్మి, విజయవాడ.



